

" శివరాత్రినాడు పూజానంతరము "

—చిత్రకారుడు వై. బాలయ్య, సిద్దిపేట ]



శివరాత్రి
విడుదల!
నేషనల్ ప్రొడక్షన్స్ వారి
అంతా పెద్దలే
(తెలుగు)
తెలుగు చిత్రం
శివాజీగణేశన్ • లలిత
లక్ష్మీప్రభ • ఎం.ఎన్.రాజం
తంగవేలు • వీరప్ప నటించినది.
మాటలు, పాటలు
భైరాగి.
సంగీతం
సుబ్రహ్మణ్యరాజు.
దర్శకుడు
T.R.రఘునాథ్.
పూర్ణా విడుదల...
FLOODLIGHT
K.KRISHNA








# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 18—0—0
విడిప్రతిక 25 న.పై

Founder: K. NAGESWARA RAO

విళంబ ఫాల్గుణ శుద్ధ ద్వితీయ బు వారం

సంపుటము 53
సంచిక 24
11-3-59


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

లంబాడీ స్త్రీలు

—ఫొటో: పి. వీర—.





# రాజధాని కబుర్లు

## "శాంతికి సాధనం శాస్త్రవిజ్ఞానం"

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఒక సంఘటన. జపాను సేనలకు బందీలుగా ఉన్న ఇద్దరు బ్రిటిష్ సైనికులు క్వాయి నదిపై ఒక వంతెన కడతారు. ఆ వంతెన పాశ్చాత్యుల ఇంజనీరింగు ప్రతిభకు నిదర్శనం. వంతెన నిర్మించిన బ్రిటిష్ సైనికులు సహజంగా ఆ వంతెనను చూసి గర్విస్తారు. అదే కాలంలో కలకత్తాలో ఉన్న ఒక బ్రిటిష్ సైనికదళం ఆ వంతెనను కూల్చడానికి పథకాలు సిద్ధపరుస్తూ ఉంటుంది.

గతవారం అమెరికన్ సమాచారశాఖ ఆధిపత్యాన, గవర్నర్ దర్బార్ అన్యత్కుటిన నగరంలో తెరవబడ్డ 'సైన్సు ఫర్ పీస్' ప్రదర్శనం చూస్తూంటే, 'ది బ్రిడ్జి ఆన్ రివర్ క్వాయ్' అన్న పుస్తకంలో వర్ణింపబడ్డ ఆ సంఘటన గుర్తుకొచ్చింది.

ప్రతీ వ్యక్తిలోను, ప్రతి వ్యవస్థలోను, వస్తువులోను మంచి ఫలితాలనిచ్చే లక్షణాలుంటాయి; చెడు పరిణామాలకు దారితీసే లక్షణాలుకూడా ఉంటాయి. కొందరికి ప్రాణప్రదమైనది, మరి కొందరికి వినాశకారణం కావచ్చు. అణువును విభజించి, ఉత్పన్నమైన శక్తిని హిరోషిమా నాగసాకీ పట్టణాలను ధ్వంసం చేయడానికి వినియోగించారు ఆనాటి 'మిత్రమండలి' నాయకులు. అణువులను విభజించడంవల్ల ఉత్పన్నమైన శక్తి శాంతికాలంలో మనుష్యులకు ఏవిధంగా ప్రయోజనకారి కాగలదో నిరూపిస్తుంది ఈ ప్రదర్శనం.

సైన్సు అనేది అందరికీ అర్థంకాదు. (నాకెన్నడూ అర్థం కాలేదు.) అందరికీ (అందరితోపాటు నాకూ) అర్థమయ్యే భాషలో అణు విజ్ఞానాన్ని బోధచేసే ప్రదర్శనం ఏర్పాటు చేసినందుకు అమెరికన్ సమాచారశాఖ వారిని అభినందించాలి. మూడు నాలుగు సంవత్సరాలుగా ఇది భారతదేశంలోని వివిధ నగరాల్లో ప్రదర్శితమౌతుంది. ఈ మూడు నాలుగు సంవత్సరాలలో విజ్ఞాన భౌతిక శాస్త్రాలు సాధించిన విషయాలుకూడా ఈ ప్రదర్శనద్వారా మనం తెలుసుకోవచ్చు.



శ్రీమతి లక్ష్మి.
(రాఘవకళాసమితి రాజమహేంద్రవరం)

1955లో 19.వ ఆంధ్రనాటకకళాపరిషత్తు నాటకపోటీలలో "భయం" నాటకంలో "ఉత్తమనటి" బహుమతిపొంది, 1959లో హైదరాబాదులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్ ప్రత్యేక మహాసభల — నాటక పోటీలలో "భవబంధాలు" నాటకంలో "పద్మ"పాత్రకు తిరిగి "ఉత్తమనటి"గా బహుమతి పొందినది.

* * * *

## శాసన సభల్లో ఒక[illegible]రం:

### చట్టాలు.......

ఆంధ్రప్రదేశ్ శాసనసభ, మండలి మొదటివారంలో ఐదు బిల్లులను ఆమోదించాయి. కృష్ణాజిల్లా బస్సు రవాణా జాతీ బిల్లు, రెండు మోటారుబండ్ల సవరణ బిల్లులు, ఆంధ్ర కౌలుదారీ సవరణ బిల్లు ఒకటి, మదరాసు క్షామసహాయ సవరణ బిల్లు ఒకటి. ఈ బిల్లులో ప్రజలకు సన్నిహిత సంబంధంకల బిల్లు మదరాసు మోటారుబండ్ల (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లు.

ఇంతవరకు ఆంధ్రప్రాంతంలో బస్సుల్లో మైలుకి 7½ పైసల చొప్పున వసూలు చేస్తున్నారు. ఇకముందు మైలుకి ఐదు నయా పైసల చొప్పున వసూలుచేయడం జరుగుతుంది. అంటే టిక్కెటు రేటు మైలుకి సుమారు 1.25 నయా పైసలు పెరుగుతుంది. ఒక మైలుకి లెక్కవేస్తే ఇది చాలా తక్కువగా కనిపిస్తుంది. మొత్తంమీద లెక్కకడితే మాత్రం చాలా తేడా వస్తుంది. ఉదాహరణకి బందరు నుంచి బెజవాడకి బస్సులపై ఇప్పుడు 1 రూ 9 అణాలు టిక్కెట్లు వసూలు చేస్తున్నారు. చట్టం అమలులోకి వచ్చిన తర్వాత అది రూ 2.15 లకు పెరుగుతుంది. ఇది గమనించదగ్గ విషయాల్లో ఒకటి.

ఆంధ్రప్రాంతంలో బస్సురేట్లు హెచ్చించబడినా, తెలంగాణంలో తగ్గింపబడుతున్నాయన్న అభిప్రాయం ఒకటి చర్చల్లో పాల్గొన్న సభ్యుల్లో కనబడింది. తెలంగాణంలో బస్సురేటు ఇదివరలో మైలుకి 6 నయాపైసలు లేదు. మైలుకి ఒక హాలీ అణా— 5.14 నయాపైసలు—మాత్రమే ఇదివరలో ఉన్న రేటు. అందువల్ల తెలంగాణాలో రేట్లు మైలుకి 0.14 నయాపైసలు మాత్రమే తగ్గింపబడిందన్నది గమనింపదగిన విషయాల్లో రెండోది.

 "ప్రవీణ్" 



పమిడిముక్కల శ్రీరామారావు

పశ్చిమ జర్మనీప్రభుత్వం ఇచ్చే విద్యార్థివేతనంపై అక్కడ నాటకరంగంలో ఒక సంవత్సరంపాటు శిక్షణ పొందే నిమిత్తం భారతదేశం తరఫునవీరు ఫిబ్రవరి 20న పశ్చిమ జర్మనీ వెళ్లారు. 'నాటకప్రదర్శన', 'రంగస్థల సాంకేతిక పరిజ్ఞానం' అనే విషయాలలో అక్కడ శిక్షణపొందుతారు.



శ్రీ కవిపురపు శ్రీరామ్

అమెరికాలోని పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో పిహెచ్. డి. పట్టంకొరకు మూడుసంవత్సరాలు విద్యాభ్యాసం చేయటానికి వెళ్లారు. వెళ్ళేముందు బొంబాయిలోని అణుశక్తిసంఘంలో రిసెర్చి అసిస్టెంటుగా పనిచేశారు.



కుమారి జి. రాఘవకుమారి

రాఘవకళాసమితి (రాజమహేంద్రవరం) 1959లో హైదరాబాదులో జరిగిన ఆంధ్ర నాటకకళాపరిషత్ ప్రత్యేక మహాసభల— నాటక పోటీలలో "ధనబంధాలు" నాటకంలో "కళ" పాత్రకు "ఉత్తమసహాయనటి"గా బహుమతిపొందిన క్రొత్తనటి.

#  రాజధాని కబుర్లు 

## ......సరసాలు

శాసన సభ్యులు సమస్యల్ని ఎంత తీవ్రంగా చర్చించినా, అప్పుడప్పుడు ఒకరిపై నొకరు ఛలోక్తులు విసురుకోకుండా ఉండలేరు. ఈ వారంలో సోషలిస్టు సభ్యుడు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి విసిరిన ఛలోక్తి ఒకటి స్మృతిపథంలో ఉండిపోతగ్గది. 'దుయ్యబట్టడం ప్రతిపక్ష సభ్యుల హక్కు మాత్రమే కాదు. ప్రభుత్వ సభ్యులుకూడా దుయ్యబట్టవచ్చు. నన్నొకసారి రావణాసురుడు అన్నారు...' అన్నారు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి. శ్రీ భాట్టం దానికి సమాధానం చెబుతూ, 'నేను ముఖ్యమంత్రిని రావణాసురుడు అనలేదు. అన్నాననడం పొరపాటు. ఎలా అంటాను? రావణాసురుడు మహాతపస్సు చేసినవాడు...' అన్నారు. శ్రీరామమూర్తిగారి సమాధానం సభ్యుల నవ్వులో కలిసిపోయింది. ముఖ్యమంత్రి కూడా ఫక్కున నవ్వారు.

* * *

శాసన మండలిలో ఎవరో ప్రభుత్వాన్ని విమర్శిస్తూ "దొరికిందంతా మింగేసేట్టుంది" అన్నారు. రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు సమాధానం: 'నన్నొకరు మింగి జీర్ణించుకోలేరు. నేనొకర్ని మింగలేను. నేను వాతాపిని కాదు; కబంధుడిని కాదు—' అని.

* * *

ఎన్నికల్లో ప్రచారానికి వెళ్ళి ప్రతిపక్షాలను విమర్శించారన్న విమర్శకు శాసనసభలో ముఖ్యమంత్రి సమాధానం: 'ఎన్నికల్లో మంత్రులు వెళ్ళి పాల్గొనకూడదంటె వేరేసంగతి. వెళ్ళిన తర్వాత ప్రతిపక్షాలను విమర్శించవద్దంటారు? వెళ్ళి ఏం చెప్పమంటారు? సోషలిస్టులు మంచివాళ్లు, కమ్యూనిస్టులు గొప్పవాళ్లు అనా?'

శాసనమండలిలో ఒకనిముషం నిశ్శబ్దం. నియమాల ప్రకారం శాసనసభ్యులెవరయినా అరెస్టు చేయబడితే, నిర్ణీత కాలములో సభాపతికి ఆ విషయం తెలియచేయాలి. శాసనమండలిలో గతవారం ఒకసభ్యుడు లేచి "ఫలానా సభ్యుడు అరెస్టుచేయబడి తిరిగి విడుదల చేయబడ్డాడు. మీకా సమాచారం అందిందా?" దీనికి ఉప సభాపతి సమాధానం: "ప్రశ్నోత్తరాల సమయం ఐపోయింది" తరువాత సభ్యులు కర్తవ్యతామూఢులై ఒక నిముషం నిశ్శబ్దంగా ఊరుకున్నారు.

## భూమితనఖా విందు

భూమి తనఖా బేంకు వాళ్ళు విందుచేస్తే, ఎలా చేస్తారు? భూమి తనఖా పెట్టేటట్లు చేస్తారు! అని నా ఊహ మొన్నమొన్నటివరకు. నా ఊహ మార్చుకున్నాను. భూమి తనఖా బేంకులు కూడా ఆడంబరంలేని విందులు ఏర్పాటు చేయగలవు. ఆనందంతో అతిథుల్ని ఆహ్వానించగలవు.

నాకు బేంకు వాళ్ళతో పరిచయం తక్కువ. నా దగ్గరున్న డబ్బు తక్కువ. బేంకుకు డబ్బువేసే ప్రశ్న ఉదయించలేదు ఎప్పుడూ. నాకు ఎప్పుడూ అప్పుఇచ్చే ఆలోచన ఉదయించలేదు బేంకు వాళ్లకి.

ఉన్నభూమి తాకట్టుపెట్టి, సహకార భూమి తనఖా బేంకులతో సహకరించాలనే కోరిక నాకు కలుగకపోలేదుకాని, లేని భూమిని తాకట్టుపెట్టడం సాధ్యంకాదు కనుక నా సహకారంవారికి లభ్యంకాలేదు. ఈమధ్య ఈ బేంకుల ప్రతినిధులందరూ హైదరాబాదులో కలిశారు. బేంకువాళ్ళు నలుగురూ కలిస్తే ఒకరిపేర ఒకరు చెక్కులు రాసుకుని మార్చుకుంటూ కూచుంటారని నా ఉద్దేశ్యం. తీవ్రంగా ఒకరివంక ఒకరుచూస్తూ, 'ధరల పెరుగుదల'ను గురించి

విదేశీమారక ద్రవ్యాన్ని గురించి, ద్రవ్యోల్బణాన్ని గురించి చర్చించు కుంటూ కూచుంటారని నా ఉద్దేశ్యం.

భూమి తనఖా బేంకుల ప్రతినిధుల సమావేశం హైదరాబాదులో ఫిబ్రవరి 14 న జరిగినప్పుడు నేనూ హాజరయ్యాను. వాళ్లు ఎలా ఉంటారో, ఎలా మాట్లాడుకుంటారో చూడాలన్న కుతూహలం! ఆ సమావేశంలో ఖాదీ కమీషన్ అధ్యక్షులు శ్రీ వైకుంఠలాల్ మెహతా, కేంద్ర ఆదాయవ్యయ శాఖామాత్యులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి, ఆర్థికమంత్రి బ్రహ్మానందరెడ్డి పాల్గొన్నారు. అందరూ కలిసి చెక్కులతో పేకాడుకోలేదు కాని, తీవ్ర సమస్యలను తీవ్రంగా చర్చించుకొన్నారు. అర్థంకాక, ఊపిరాడక, అరగంట ఉండి అరుబయటకు వచ్చేశాను.

* * * *

ఆ నాటిరాత్రి 'రిట్జ్' హోటల్ లో ఆంధ్ర, మదరాసు కేంద్ర సహకారభూమి తనఖా బేంకుల ఆధ్వర్యాన విందుజరిగింది—వి. ఎల్. మెహతా, గోపాలరెడ్డిగార్ల గౌరవార్థం! భూమి తనఖా బేంకు వాళ్ళు విందుచేస్తే ఎలాచేస్తారో చూద్దామనే కుతూహలం మనస్సులో, ఒకపక్క. రెండోపక్క—ఎవరు ఏ క్షణాన నిలదీసి, భుజంమీద చెయ్యేసి, 'విదేశీ మారకద్రవ్యాన్ని' గురించి ప్రశ్నిస్తారో అనిభయం. అట్టిభావాలు నాకు విజాతీయమైనవని ఎలా చెప్పడం ?

కాని విందులో అట్టిపరిస్థితి రాలేదు. విందు ఆహ్లాదకరంగా గడిచిపోయింది. కవులు, కథకులు కనపడ్డారు. గంభీరంగా ఆలోచిస్తూ, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, బేంకు ఉద్యోగి కళ్ళద్దాల వెనుక నుంచి చిలిపిగా అందరివంకా చూసి పలకరిస్తూ శ్రీ పొలంకి వెంకట రామచంద్రమూర్తి, మంత్రులు, న్యాయమూర్తులు కనిపించారు. మందహాసం చేస్తూ ఏదో చెబుతూన్న ప్రధాన న్యాయమూర్తి శ్రీ చంద్రారెడ్డి మాటలను శ్రద్ధగా వింటున్న డా॥ బెజవాడ గోపాల రెడ్డి; తలకాయ ఊపుతూ, న్యాయమూర్తి శ్రీ సత్యనారాయణరాజు మాటలు వింటూన్న శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆదరంతో వచ్చిన ప్రతీ పేటునీ భుజంతట్టి పంపించేస్తూన్న శ్రీ మెహతా.

ఒక చేత్తో ప్లేట్లు పెడుతూ, మరోచేత్తో ప్లేట్లు తీసేస్తూన్న బేరర్లు. వాళ్లని అజమాయిషీ చేస్తూన్న హెడ్ వెయిటర్లు.

సరదాగా, చక్కగా, నిరాడంబరంగా జరిగిన ఈ విందు, భూమి తనఖా బేంకుల వాళ్లవిందుల్ని గురించిన నా అపోహల్ని తొలగించి వేసింది. ఇంతటి ఆహ్లాదకరమైనవిందు ఏర్పాటు చేసినందుకు భోగరాజు వెంకటరత్నంగారిని, మాచర్లదత్తాత్రేయులు గారిని అభినందించారు.

* * * *

ఆ విందుకు హాజరైనప్పుడు ఆ స్థలంలో ఏర్పాటైన మరో రెండు విందులు జ్ఞప్తికివచ్చాయి. గత సంవత్సరం ఛాంబర్ ఆఫ్ కామర్సు పక్షాన జరిగిన విందుఒకటి. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ముఖ్యఅతిథిగా వచ్చారు. విందుభోజనానికి ముందు అరగించిన పానీయాలు ఒకవక్తని మైమరపించాయి. అవసరమేమిటో. హఠాత్తు లేవరో గమనించకుండా ప్రసంగం ప్రారంభించాడు. కమ్యూనిటీ ప్రాజెక్టులనుగురించి ప్రస్తావిస్తూ, కామ్యూనిటీ (వితంతు) ప్రాజెక్టులని పరిహసించాడు. ముఖ్యమంత్రి తరువాత లేచి ప్రసంగిస్తూ, ఆ దృక్పథాన్ని, ఆ దృక్పథం దేశానికిచేస్తూన్న తీరని అపకారాన్ని తీవ్రంగా విమర్శించారు. ఆ వక్త ఆనాడు చేసిన ప్రసంగాన్ని మరచిపోలేదు ముఖ్యమంత్రి. ఈ మధ్య పటన్ చెరీలో ప్రసంగిస్తూన్నప్పుడు కూడా ఆ విషయాన్ని గురించి ప్రస్తావించారు.

* * *

రెండు వారాల క్రితం అదే స్థలంలో అదే సంస్థ తరఫున అమెరికన్ రాయబారి గౌరవార్థం ఒక విందు జరిగింది. ఆ వ్యక్తి అదే పరిస్థితిలో విందుకు హాజరైనాడు. ఆహూతులైన పత్రికా ప్రతినిధులు ఒకచోట కూచొని కబుర్లాడుకొంటున్నారు. వారు కూచున్న కుర్చీలు కొందరు అతిథులకు ప్రత్యేకింప బడినవని కట్టడిచేసి, వారిని లేపి, తన మిత్రులు కొందరిని పిలిచి ఆ కుర్చీలలో కూచోపెట్టాడు ఆ వ్యక్తి. ఈ అవమానానికి నిరసనగా వెళ్లిపోయారు పత్రికా ప్రతినిధులు ఒకరిద్దరు.

## పారిశ్రామిక ప్రదర్శనం:

హైదరాబాదులో ఏటేటా నిర్వహింపబడే అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం గతవారంలో అంతమైంది. ఈ పారిశ్రామిక ప్రదర్శన నిర్వాహకులు ఏది నిర్వహించినా, ప్రదర్శన పూర్వకంగానే చేస్తారు. పోటీల నిర్వహణ అదొక ప్రదర్శన. బహుమతి ప్రదానం మరొక ప్రదర్శన. ప్రదర్శన వెనుక ఉంది ఎంతో పరిశ్రమ.

ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి జనవరి ఒకటవ తేదీన ప్రారంభించారు ఈ ప్రదర్శనాన్ని. ఫిబ్రవరి పదవ తేదీ ఆఖరి తేదీ. ఈ నలభైదినాల్లో ప్రదర్శన వీక్షింపవచ్చిన ప్రేక్షకులు ఒక కోటి రూపాయల విలువచేసే వస్తువులను కొన్నారట. అంటే రోజుకు సగటున రెండున్నరలక్షల రూపాయల విలువగల వస్తువుల అమ్మకం జరిగిందన్నమాట.

ఈ లెక్క ప్రకారం లక్ష రూపాయలైనా అమ్మకం పన్నువల్ల ప్రభుత్వానికి చేరుండాలి. లక్ష కాకున్నా ఏభై వేలు. ఈ అంకెలు పొరపాటైతే, ప్రభుత్వం ఒకసారి తన అమ్మకంపన్ను లెక్కలు అజమాయిషీ చేసుకుంటే మంచిది. ప్రభుత్వం లెక్కలు సరైనవైతే, సంస్థలలెక్కలు పరిశీలిస్తే మంచిది.

పారిశ్రామిక ప్రదర్శనసంస్థ ఈ నలభైరోజుల్లో ఎన్నో పోటీలు నిర్వహించింది. బహుమతులుగా పదిహేను వేల రూపాయల విలువగల వస్తువులను పంచిపెట్టింది. ప్రదర్శనకు ప్రవేశ రుసుము పన్నెండు నయాపైసలు. పదిహేను వేల రూపాయలంటే లక్షా ఇరవై వేలమందికి పైగా చెల్లించిన ప్రవేశరుసుము. ఊహించుకోండి: ఎన్ని లక్షలమంది ప్రదర్శన చూచిఉంటారో ?

ఈ పారిశ్రామిక ప్రదర్శనం ఏటేటా ఏర్పాటుచేయడం ఇది పందొమ్మిదో సంవత్సరం. ఈ సంవత్సరం జనవరి ఒకటవ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభించిన నాటినుంచి లక్షలాదిమంది వచ్చి ప్రదర్శన తిలకించారు. పన్నెండువందల దుకాణాలు తెరువబడ్డాయి. వారానికొకదినం స్త్రీలకు ప్రత్యేకించబడింది. ఒకరోజు పిల్లలకు ఉచితప్రవేశం కల్పించారు.

వాణిజ్యరంగంలో రాజధానినగరంలో ఈ ప్రదర్శనయొక్క ప్రాముఖ్యతని ప్రత్యేకం వివరించనక్కర్లేదు. ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం, సంగీతనాటక అకాడమీలపక్షాన, ఆంధ్రనాటక కళాపరిషత్తు సహకారంతోను నిర్వహింపబడిన సాంస్కృతిక కార్యక్రమాల సమీక్షలు మీరు చదివేవుంటారు. సర్వతోముఖంగా అభివృద్ధిని సాధిస్తూన్న కార్యకర్తలను మనం ఆభినందించాలి. ఈ ప్రదర్శనసంస్థ ఆధ్వర్యాలనే ఒక ప్రదర్శనం వరంగల్ లో ఏర్పాటు చేయబడింది. కాకినాడలోను, యాదగిరిగుట్టవద్ద ఏర్పాటు చేయాలనే పథకం ఒకటి నా సిద్ధంగా ఉంది.

కాని ఇక్కడ ఒకటి రెండు విషయాలు పేర్కొనాలి. ఈ సంవత్సరం నిర్వాహకసంఘం అధ్యక్షులు హోంశాఖామంత్రి శ్రీకొండా వెంకటరంగారెడ్డి. ప్రతి సంవత్సరం ఒకమంత్రి అధ్యక్షత వహించడం పరిపాటి ఐపోయింది. ప్రదర్శనయొక్క ప్రాముఖ్యతని గుర్తించి రాష్ట్రప్రభుత్వంకూడా కొన్ని ప్రయోజనాలు చేకూరుస్తోంది. సంస్థ కార్యనిర్వాహక వర్గంలో అనేకులు ఉన్నతోద్యోగులు ఉన్నారు. ఈ ఉద్యోగు లక్కడ వ్యక్తిగతహోదాలో వ్యవహరిస్తున్నారు గాని అధికారయుతంగా కాదు. మంత్రుల సహకారం, ప్రభుత్వోద్యోగుల సహాయం సంస్థకు ఎక్కువగా లభిస్తున్నాయి.

(53-వ పేజీ చూడండి)




# 'వేసినచోటే ఉన్న గొంగళి' రైల్వే బడ్జెట్

రైల్వే బడ్జెట్ పై పార్లమెంటులో చర్చ జరిగింది. వేసినచోటే ఉన్న గొంగళి లాంటిది రైల్వే బడ్జెట్. అది యుద్ధానికి ముందు రోజుల్లో ఎక్కడుండేదో ఇప్పుడూ అక్కడే ఉంది. ఆ రోజుల్లో రైల్వే ఆయవ్యయాలు బాగా జబ్బుచేసినట్లు కనిపించి ఉండేవి. వాటిపై పరిపాలన కొంత ప్రభుత్వానిది. కొంత కంపెనీది. అలాంటి ద్వంద్వ పరిపాలన ఉండే రోజుల్లో కూడా రైల్వే నిర్వహణం ఇప్పటికంటే సమర్థంగా ఉండేది.

రైల్వేలు తమ రవాణా భారాన్ని సమర్థంగా వహించటంమాట అటుంచి, అసమర్థంగానైనా నిర్వహించలేకపోతున్నాయని, కనక కొంత భారాన్ని రోడ్డుమార్గాలమీదికీ, నీటిమార్గాలమీదికీ తోసేయాలని రైల్వేశాఖ కిందటేడువరకూ ఆలోచిస్తూ ఉండేది. రైల్వేల భారాన్ని నీటి రవాణామీదికి కొంతైనా మళ్లించాలనే ఉద్దేశంతో పథకం తయారుచేయటానికి కొన్ని కమిటీలు వేశారు. కాని రైల్వే మంత్రి ఒక పాడివేశారు: ఇరవయ్యేళ్ళకి మళ్ళీ ఈనాడు రోడ్డురవాణా రైల్వేను పెనుభూతంలా వెంటాడుతోందట. రైల్వేశాఖ తన భారాన్ని కొంత తన పోటీదార్లకు అప్పగించాలని ఇన్నాళ్ళూ తీవ్రంగ ప్రయత్నించేసి, ఇప్పుడు మళ్ళీ రోడ్డురవాణా తనకు పెనుభూతంలా తయారైందని వాపోవటం బాగా లేదనీ, తన అసమర్థతకూ, లోపాలకూ కారణంగా పాపాల భైరవుణ్ణి ఒకణ్ణి సృష్టించాలని ఎత్తువేస్తోందని కొందరిక్కడ భావిస్తున్నారు.

ఒక చిన్నమాట. రైల్వే కార్మికులు రకరకాల ట్రేడ్ యూనియనులలో సంఘటితులై ఉన్నారు. కొన్ని కొన్ని ప్రాంతాలలో రైల్వేపనివారి ఓట్లబలాన్ని నిర్లక్ష్యం చేసి ఊరుకోటానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. అంటే రైల్వేపనివారి నియోజకవర్గాన్ని జాగ్రత్తగా లాలించి పాలించాలన్నమాట. రైల్వేశాఖపై మంత్రిత్వం నెరపిన కాంగ్రెసు మంత్రులందరూ ఈ విద్యలో ఘటికులు. రైలు రాకపోకలు సకాలంలో జరిగేట్లు చేసిన ఇంజను డ్రయివర్లకూ, గార్డులకూ బహుమతులు కూడా ఇచ్చేవారు. ముందు ముందు లంచాలు మానేసి అవినీతిని కడిగేసుకున్న రైల్వే సిబ్బందికి అలా స్వార్థత్యాగం చేసినందుకుగాను పరిహారం చెల్లించేస్థితి కూడా వస్తుందేమో ఎవరు చెప్పగలరు! రైల్వేలలో చిల్లరమల్లర దొంగతనాలు ధారాళంగా జరుగుతున్నాయి. రైల్వే ప్లాట్ ఫారాలు, వెయిటింగ్ రూములు, కంపార్టుమెంటులు ఎంత అసహ్యంగా ఉండాలో అంత అసహ్యంగా ఉంటున్నాయి. రైళ్లలో రద్దీ, రాకపోకల ఆలస్యం యథాప్రకారంగానే ఉన్నాయి. ఇవిచాలనట్లు, గోరుచుట్టుపై రోకటిపోటుగా రైల్వేరేట్లు, చార్జీలు అమితంగా పెరిగిపోయాయి. లోటు ఆర్థికవిధానం పుణ్యమా అని, జీవనవ్యయం రోజు రోజుకీ పెరిగిపోతోంది. యుద్ధంలేని రోజుల్లో ఇంత భారీఎత్తున జీవనవ్యయం పెరిగిపోవటం ఏనాడూ లేదు.

జీవనవ్యయం ఇంతగా పెరిగిపోవడం వల్ల — అనవసరంగా ప్రయాణాలు చేయటానికి తగినంతడబ్బు ప్రజలచేతుల్లో ఆడటంలేదు. ప్రయాణంచేయక తప్పనిసరై ప్రయాణం చేస్తున్నారు. ఏ ప్రయాణం చవకగా, హాయిగావుంటే ఆ ప్రయాణం చేస్తారు. రోడ్డుప్రయాణాలు చేయటం, రోడ్డుద్వారా రవాణా చేయటం రైలుద్వారాకంటే బాగా ఉంటోందనీ, చవక అనీ, త్వరితమనీ, శుభ్రంగా, శుచిగా ఉంటుందనీ ప్రస్తుతం ప్రజాభిప్రాయం.

రోడ్డు రవాణాకు దెబ్బతగిలే చర్యలను వేటినీ తీసుకోవటానికి రాజ్యసభ సభ్యులు సుముఖులుగా లేరని చర్చలో స్పష్టమైంది.

ఈ సమస్యనుగూర్చి జ్ఞాపకం పెట్టుకోవలసిన విషయాలు రెండు ఉన్నాయి. రోడ్డు రవాణా, ముఖ్యంగా ప్రయాణ సాధనాలకు సంబంధించినంత వరకూ చాలా మటుకూ జాతీయం చేసేశారు. ఇది మొదటిది. రోడ్డు రవాణాసంస్థలు చాలావాటిలో రైల్వేలకు వాటాలున్నాయి. అందుచేత రోడ్డు రవాణాను తగ్గించటానికి తీసుకునే చర్యలేవీ ఫలప్రదం కాజాలవు. ఇది రెండవ విషయం.

రెండేళ్ళ క్రిందట 1957 ఫిబ్రవరి 10వ తేదీని రైల్వేమంత్రి రైల్వే సిబ్బందిలోని నాన్ గెజెటెడ్ ఉద్యోగులందరినీ భారీఎత్తున

పునర్వ్యవస్థీకరించాలనీ చాలా 'సాహసంగా' ప్రకటించారు. ఈ పథకం వలన తక్కువ జీతం గ్రేడులో వున్న సుమారు 1,70,000 మంది సిబ్బందికి మేలు చేకూరింది. రు. 4 కోట్లు ప్రభుత్వానికి ఖర్చు తగిలింది. "రైల్వేలను ఎదుర్కొంటున్న సమస్యలు నానాటికీ తీవ్రం కావటంతో ఈ పనివారి బాధ్యతలు, పని ఒత్తిడికూడా బాగా అధికమయ్యాయి." సరే ఇంతవరకూ బాగానే వుంది. కాని తమ "సాహస చర్య"వలన రైల్వేలకు ఏమైనా మేలు చేకూరిందో, లేదో ఆయన వివరించ లేదు.

ప్రజలు ఎంతవరకూ భరించగలరూ అనే దాన్నిబట్టి రేట్లు, చార్జీలు నిర్ణయించాలని ఒక ముఖ్యసూత్రం ఉన్నది. ఈ సూత్రాన్ని ప్రభుత్వం పాటించటం మానివేసింది. ద్వితీయ ప్రణాళికకు ఎక్కువ ధనం సేకరించే నిమిత్తం రైల్వేలను, తంతి తపాలాశాఖను ఉపయోగించుకుంటున్నది. వాడకం తగ్గిపోవటంవల్ల అనండి, మరే ఆర్థిక కారణంవల్ల అనండి, మొత్తంమీద రైల్వే ఆదాయం అనుకున్నదానికంటె బాగా తగ్గింది. అందుచేత రోడ్డు ప్రయాణాలను, రవాణాను నిందించటం కంటె, రైలు ప్రయాణాలను, రవాణాను ఇప్పటికంటె సుఖంగా, సుకరంగా చేయటం ఎంతైనా అవసరం. దీనికి కాంగ్రెసు మంత్రులు కొంత త్యాగం చెయ్యవలసి వుంటుంది. తమ పలుకుబడికంటె రైల్వేల అభివృద్ధి ముఖ్యమని భావించవలసి వుంటుంది.

ఇంకో సూచన. మంత్రులు రైళ్లలో ప్రయాణం చెయ్యాలి. ఎయిర్ కండిషన్ పెట్టెలలో కాదు. మూడవతరగతి పెట్టెలలో ప్రయాణం చెయ్యాలి. దీనివల్ల రైల్వే ఆదాయం పెరగవచ్చు.

* * *

ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనను విచారణచేయటానికి ఒక కార్యక్రమాన్ని సూచిస్తూ రాజ్యసభ సభ్యుడు, జర్నలిస్టు శ్రీ బి. శివరావు ప్రధానమంత్రికి ఒక లేఖ వ్రాశారు. బ్రిటన్‌లో అలాంటి కేసులను అటార్నీ జనరల్‌కు పంపిస్తారని ఆయన అన్నారు. అతడు రహస్యంగా విచారణజరిపి ఒక నిర్ణయానికి వస్తాడు అభియోగం తేబడిన వ్యక్తిపై ఆరోపణ సరియైనది అవునా కాదా అని సూచించేది అటార్నీ జనరల్ నివేదికే. ఈ పద్ధతివలన సీనియర్ అధికారులు తమకు ఏ కేసైనా నివేదించబడినప్పుడు సందిగ్ధావస్థలో పడవలసిన అవసరం ఉండదు. ప్రభుత్వోద్యోగులపై ఆరోపణ చేయటం మామూలైపోతున్నందువల్ల ఇలాంటి పకడ్బందీ కార్యక్రమం ఏదో ఒకటి రూపొందటం మంచిది. ఏదో అప్పటికి ఆ కార్యక్రమం తోస్తే దాన్ని అవలంబించటంవల్ల ఆరోపణ చేయబడిన వ్యక్తికి సరియైన రక్షణా



శివం

1959 ఫిబ్రవరి 4 నుండి 7 వరకు హైద్రాబాదులో జరిగిన ఆంధ్ర నాటక పరిషత్ ప్రత్యేక మహాసభలో ఉత్తమరచనగా ఎన్నుకొనబడిన "సోము-శిక్ష" నాటక-రచయిత.

ఏర్పడదు; న్యాయం జరుగుతోందన్న నమ్మకం కలగదు.

* * *

'కుటుంబ నియంత్రణ' సమస్యమీద అంతర్జాతీయ సమావేశం ఒకటి ఢిల్లీలో జరిగింది. దినదినం నొప్పిపుట్టేట్లు ఉపన్యాసాలివ్వటంతోనే దేశపు సమస్యలు తీరిపోయేటట్లయితే భారత దేశ సమస్యలు ఈపాటికి మూడుసార్లు పరిష్కారమైపోయి ఉండేవి. ఎందుకంటే 1947 నుంచీ పనికంటే ఉపన్యాసాలివ్వటం ఎక్కువగా ఉంది.

ఆసియాదేశాల్లో ఈ సమస్యను అతి శీఘ్రకాలంలో పరిష్కరించుకో గలిగిన దేశం జపాన్ ఒక్కటే. 'జపాన్‌లో జననాలు సగానికి సగం ఎలా తగ్గిపోయాయి' అనే విషయమై ఢిల్లీ సమావేశంలో ప్రొఫెసర్ జాట్సూ కటవోకా ఒక ప్రసంగం చేశారు. ఆయన ఇలా చెప్పారు:

"జపాన్‌లో కుటుంబనియంత్రణ ఉద్యమానికి అన్నిటికంటె ఎక్కువ తీవ్రంగా పనిచేసింది జపాన్ ప్రభుత్వమే. ఈ ఉద్యమానికి అడ్డంగా ఉన్న అవరోధాలన్నిటినీ ప్రభుత్వం తొలగించివేసింది. ఉద్యమానికి సంబంధించిన సమాచారాన్ని విరివిగా అందజేసేందుకు, కుటుంబ నియంత్రణను ప్రోత్సహించేందుకు ప్రజారోగ్య సంస్థలను చక్కగా సమీకరించింది. ప్రభుత్వం జరిపిన ముఖ్యచర్యలివి :—

1. గర్భనిరోధాన్ని ప్రచారం చేసేందుకు "ప్రాక్టికల్ ప్రచారకులను" 40 వేల మంది మంత్రసానులను, నర్సులను తర్ఫీదు చేసింది. వారిలో 2 వేలమందికి జీతాలిచ్చి నియోగించింది.

2. గర్భనిరోధం పద్ధతులను బోధించాలని 900 ఆరోగ్య కేంద్రాలను ఆదేశించింది.

3. గర్భనిరోధ పద్ధతులను అనుసరించగోరేవారికి ఉచితంగా పరికరాలను, ఔషధాలను సరఫరా చేసింది.

4 1956 నుంచీ కుటుంబనియంత్రణం గూర్చి జాతీయ సమావేశాలు ఏటేటా ఆరోగ్యశాఖ, జాపనీస్ కుటుంబ నియంత్రణ సమాఖ్య ఆధ్వర్యాన జరుగుతున్నాయి. 2 వేల మందికిపైగా సమావేశమై చర్చలు జరుపుతారు. గర్భనిరోధన పద్ధతులను ఎలా అభివృద్ధి చేయాలీ అని చర్చిస్తారు. ఉద్యమానికి తమకుతోచిన విధంగా తోడ్పడవలసిందని స్థానిక, కేంద్ర ప్రభుత్వాలను, ప్రజలను అర్థిస్తారు.

5. గర్భనిరోధ ఉద్యమంలో విజయాలు సాధించిన వ్యక్తులకు, సంఘాలకు ఆరోగ్యశాఖ బహుమతులిస్తున్నది.

కుటుంబనియంత్రణ ఉద్యమానికి ప్రభుత్వంతరవాత ఎక్కువగా సహాయపడుతున్నది పత్రికలు లక్షలాది కాపీలు అమ్ముడుపోయేవాటితో సహా జాపనీస్ పత్రికలన్నీ ఈ ఉద్యమ ప్రాధాన్యం గుర్తించాయి. జనాభా పెరుగుదలవలన కలిగే అపాయంగూర్చి ఇవి ప్రజలను హెచ్చరిస్తూ, గర్భనిరోధానికి సంబంధించిన సమాచారం వ్యాప్తి చేస్తున్నాయి. దినవారపత్రికలు, ముఖ్యంగా స్త్రీల పత్రికలు (వీటిలో కొన్ని పదిలక్షలకుపైగా అమ్ముడయ్యేవి ఉన్నాయి) ఉద్యమప్రచారం చేస్తూ ఉంటాయి. గర్భనిరోధానికి అవలంబించవలసిన ప్రతి వివరమూకూడా ఇవి తెలియజేస్తున్నాయి. జపానులో సాధారణంగా ప్రయోజనులందరూ పత్రికలు చదువుతారు. స్త్రీలలో చాలామంది ఏదో ఒక మహిళాపత్రిక చదువుతూనే ఉంటారు. అందుచేత గర్భనిరోధపు వివరాలు తెలియని జాపనీస్ ప్రయోజనులంటూ ఎవరూ వుండరని ఘంటాపథంగా చెప్పవచ్చును.

గర్భనిరోధపు పరికరాలు, మందులు తమంతటతాము అడిగి తెచ్చుకోటానికి స్త్రీలు సిగ్గుపడతారని అంటారు. అయితే జపానులో ఒకపద్ధతి ఉంది! 20 వేల ఫార్మసీలున్నాయి. వీటి తలుపులమీద "గర్భనిరోధం సలహాదారు" అని బోర్డులుంటాయి. అక్కడికి ఎవరైనాసరే సిగ్గూ భయమూ లేకుండా సరాసరి సులభంగావెళ్లి ఏ విషయం కావలసినా అడిగి తెలుసుకొని, ఏ మందు, ఏ పనిముట్టు కావలసినా అడిగి తెచ్చుకోవచ్చును."



# కార్యశూరులు

## 1

ఆయన రైలుదిగాడు. ప్లాట్‌ఫారమ్ మీద ఆచివరినుండి యీ చివరవరకూ దృష్టి సారించాడు. సంతృప్తిగా తల విదిల్చి ముందుకు కదిలాడు. స్టేషన్‌లోని మెర్క్యురీ దీపాల కాంతిలో ఆయన వేసుకొన్న షాంచీవ్‌సూటు నిగనిగ లాడుతుంది. తల మీదనున్న ఫెల్ట్‌హాట్ నీడ ముఖంమీద పడుతూంది. ఒకసారి చెయ్యివిదిల్చి రిస్టువాచీ చూసుకున్నాడు. 'అప్పుడే పదిన్నర అయింది' అనుకొని గేటుదాటి రోడ్డు మీదకువచ్చి చకచకా నడక ప్రారంభించాడు. ఇంతలో ఆయన పర్సనల్ అసిస్టెంట్ చందు-త్వర త్వరగావచ్చి ఆయనను కలుసుకొన్నాడు. ఇదరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు. ఆజానుబాహుడూ, ఋచ్చితంగా ఆరడుగుల భారీ శరీరంగలవాడూ అయిన మొదటివ్యక్తి వేసే అడుగులో అడుగు కలప లేక చందు ఆయాసపడుతుండి, కనపడీ కనపడనట్లు నడకలో నే పరుగుకలిపి, నడకా పరుగు కాని వేగంతో మొదటివ్యక్తి నడకను అనుసరిస్తున్నాడు.

స్టేషన్ ఆవరణదాటి యిద్దరూ చాలా దూరం వచ్చారు. అప్పుడే దగ్గర దగ్గర పదకొండు గంటలవుతూ వుండడంవలన ఊరంతా నిద్రపోతూన్నట్లుంది. ఆవూళ్ళో భీమసేనరావుగార్ని తెలియనివాళ్లు చాలా తక్కువ. ఆవూరేనన్న మాటేమిటి, ఆజిల్లా మొత్తంమీద నే ఆయనకంత పేరుంది. సర్కారు ఉద్యోగస్తుల్లో ఈమధ్య ఆయన పేరు మరీ మారుమ్రోగి పోతూంది. వాళ్లందరికీ ఆయనంటే ఎంతభయం, ఎంతయిది? క్రిందటిసారి ఆయన ఖజానా తనిఖీ చేసినప్పుడు ఆ డిప్యూటీ కలెక్టరు తన ఉద్యోగం ఏమయిపోతుందో నని అల్లలాడి పోయాడు కదూ? కలెక్టరు దగ్గరనుండి బిళ్ల బంట్రోతు దాకా, డి. ఎస్. పి. దగ్గరనుండి బీటు కానిస్టేబుల్ వరకూ, బుద్ధికొలు పయిన వర్తకులనుండి, బిచ్చమెత్తుకు నే ముష్టివాళ్ల వరకూ, ఆయనపేరు తెలియని వాళ్లూ లేరు, ఆయనసంగతి ఎరుగని వాళ్లూ లేరు. అలాంటప్పుడు తను యీ వూరు వచ్చినట్లు వాళ్లకు తెలుస్తే, తనను వదిలిపెడతారా? మాట వుదికల్ల. ఈ గవర్నమెంటు ఉద్యోగస్తులున్నారే వాళ్లు మరీను తను వాళ్లకెందుకొచ్చాడో, వాళ్లేం ఆతిథ్యం తీసుకుని తీరవలసిందే! అయితే, తప్పని సరిగా యీ వూళ్లో తనకు ఒకపని వుండడంవలన యీ వూరు రావలసిన అవసరం ఏర్పడింది. రాత్రికి రాత్రే పని పూర్తిచేసుకొని ఎవరికీ కనబడకుండా తెల్లవారే లోపున వెళ్లిపోవాలని ఆయనఉద్దేశం. అసలు నిజం చెప్పాలొస్తే, వీళ్ల తాకిడికి తట్టుకోలేక పోయే ఉపద్రవం రావచ్చునసే జంకే ఆయన పగలు కాకుండా రాత్రిపూట వూళ్లో దిగడానికి, కారణం.

**వేమూరి వెంకట సూర్యనారాయణ**

'చందూ!', గంభీరంగా పిలిచాడాయన, నడుస్తూన్న వేగాన్ని మందగింపజేస్తూ.

అప్పటికీ ఆరుగజాలు వెనకపడి పోయిన చందు గబగబా ముందుకొచ్చి, 'సార్!' అన్నాడు.

'ఎవరూ?— ఇన్‌కమ్ టాక్సు ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పేవు?'

'రంగస్వామి చెట్టియారండీ!'

'అయితే మనం ఎక్కడికి వెళ్ళాలి?'

'ఇల్లూ, దుకాణం ఒకచోటే నండి. అక్కడికే వెళ్దాం.'

'ఊఁ!—పద.'

ఇద్దరూ ముందుకు నడిచారు. రెండు వీధులు దాటారు. అయిదు నిముషాల్లో ఒక పెద్దమేడ ముందు నిలిచారు.

చెట్టియార్ చేసేది బంగారం వ్యాపారం. ఆ మేడలో ఒకవైపు దుకాణం పెట్టుకుని మరోవైపు నివాసం యేర్పరచుకున్నాడు. ఇద్దరూ మెట్లెక్కి తలుపుముందు నిల్చొన్నారు. చందుతలుపు తట్టిన రెండు నిముషాలకు రంగస్వామిచెట్టియార్ 'ఎవరూ?' అనుకుంటూవచ్చి తలుపుతీశాడు. చందు వెనకనే భీమసేనరావుగారు కూడా లోపల అడుగు పెట్టి తలుపు మూశారు.

'ఎవరు బాబూ! ఏంకావాలి?' చెట్టియార్ ఆశ్చర్యపోతూ అడిగాడు.

'ఎవరో తెలియదేం? ఆయన భీమసేనరావుగారు,' అన్నాడు, చందు గంభీరంగా.

భీమసేనరావుగారు చిరునవ్వుతో బుర్ర మీది ఫెల్టుహాట్‌ను విలాసంగా తొలగించి చేత్తో పట్టుకున్నారు. దీపంవెలుగులో ఆయన ముఖం స్పష్టంగా కనిపించింది, చెట్టియార్‌కి.

ఆయన్ను చూసేసరికి చెట్టియార్ ఆపాదమస్తకం కంపించడం మొదలుపెట్టాడు. 'తమరా బాబూ! పోల్చుకో లేకపోయాను. క్షమించండి,' అన్నాడు. కాస్సేపాగి, 'లోపలికి దయచెయ్యండి బాబూ!' అని ఆహ్వానించాడు.

చెట్టియార్ వెనుక భీమసేనరావుగారూ, చందూ లోపలికి వెళ్ళారు.

'దాహం పుచ్చుకుంటారా బాబూ!' చెట్టియార్ మర్యాద ఉట్టిపడే కంఠంతో అడిగాడు.

'దాహం లేదు, గీహం లేదు. నీనక్క వినయాలు నాదగ్గర కట్టిపెట్టు. దొంగ లెక్కలు వ్రాస్తున్నావా, లేదా? — చెప్పు' భీమసేనరావుగారి ఖంగుమనే కంఠస్వరానికి గదిలోవున్న కంచు చెంబులు మారుమ్రోగాయి. చెట్టియార్‌కి భీమసేనరావుగారి సంగతి యింతకు ముందొకసారి అనుభవముంది. చేతులు నలుపుకుంటూ చెప్పడం మొదలు పెట్టేడు. "ఇందులో తెలియనిదేముందండి. నా నోట వివాలని అలా అడుగుతున్నారు కాని..."

భీమసేనరావుగారు విసుక్కున్నారు' ఈ సోది అంతా వినడానికి నాకు వేళ లేదు. తియ్యి, ముందు నీ చిట్టాపుస్తకం తియ్యి.'

చెట్టియార్ కదలలేదు. మెదలలేదు. స్థాణువులా వుండిపోయాడు.

విందు కూడా కల్పించుకొని, "ఏం, వారు చెప్పేది వినబడ్డంలేదా? ఏదీ చిట్టాపుస్తకం" దబాయించేడు.

చెటియార్ చేసేదిలేక మెల్లగా కదిలివెళ్లి పుస్తకం తెచ్చి వారిముందుంచాడు. రావుగారు సిగరెట్ తీసి సుతారంగా రెండువేళ్ళ మధ్య పట్టుకుని సిగరెట్ కేసుమీద రెండు మూడుసార్లు నెమ్మదిగా తాటించారు. అనుభవజ్ఞుడయిన అసిస్టెంటు, చందూవెంటనే అగ్గిపుల్ల వెలిగించి అందించాడు. భీమసేనరావుగారు తృప్తిగా రెండుసార్లు గాలిలోకి పొగవదలి, క్షుణ్ణంగా చిట్టా పుస్తకం కాగితాలు తిరగవెయ్యడం మొదలుపెట్టేరు. పుస్తకం చూస్తున్న మనిషి ఒక పేజీదగ్గర ఆగిపోయి 'నగదు నిలవ ఎంత వుంది? ఇనప్పెట్టె తాళాలు తియ్యి,' ఆజ్ఞాపించారు.

గజగజలాడుతూన్న చెట్టియార్ బొడ్డులోనుంచి తాళంచెవులుతీసి యినప్పెట్టె తెరిచాడు. చందు ముందుకువెళ్లి అందులోవున్న డబ్బంతా తీసుకువచ్చాడు. లెక్కపెట్టి. యిరవై వేల రూపాయలుందని చెప్పేడు.

భీమసేనరావుగారి కళ్లు క్రోధంతో రక్తవర్ణాన్ని దాల్చేయి 'ఏమిటిమోసం? చిట్టానిలవ ఏభైవేల రూపాయలవరకూ కనిపిస్తూంది. తక్కిన ముప్ఫయివేలూ ఏంచేశావు? కదలవేం? వెళ్లితీసుకురా, ఆ సొమ్ము'

ఈ దెబ్బతో చెటియార్‌కు శరీరమంతా చెమటలు పోసింది. అలాగే లోపలిగదివైపు నడిచాడు. అతన్ని చందు అనుసరించాడు. మళ్లీ డబ్బుపట్టుకుని యిద్దరూ వెనక్కు వచ్చారు. చందు లెక్కపెట్టేడు. 'ఇంకా అయిదు వేలు తక్కువవుంది,' అన్నాడు, భీమసేనరావుగారివైపు చూసి.

'ఏమిటి దీని సంజాయిషీ?' అన్నట్లు చూశారు భీమసేనరావుగారు. చెట్టియార్ దిక్కుమొహం వేశాడు. చందూ కరెన్సీ నోట్లను కట్టలు కట్టలుగా సూట్‌కేసులో పేర్చుతున్నాడు.

భీమసేనరావుగారు తగ్గిపోతూన్న సహనాన్ని కూడదీసుకొంటూ, మళ్ళీ ప్రశ్నించారు. 'చెట్టియార్! మాట్లాడవేం?'

చెటియార్ యింకా నీళ్లు నవుల్తూనే వున్నాడు. రావుగారికోపం అవధులు దాటిపోయింది. 'చందూ!' అని పిలిచారు అది పిలుపుకాదు. సింహగర్జన! 'చందూ! మరి లాభం లేదు ఇతన్ని కనికరించడానికి వీల్లేదు. ఈడబ్బు తీసుకొని నువ్వు స్టేషనుకు పద. అందాకా యితనిదగ్గర నేనుంటాను,' అన్నారు.

చందు వెళ్ళిపోయాడు. ఎదురుగా కుర్చీలో హుందాగా కూర్చున్న భీమసేనరావుగారి యెదుట చెట్టియార్ యింకా చేతులు కట్టుకుని నిలబడే వున్నాడు. పట్టు పరుపుల్ని ఆనుకుని, కడుపులో చల్లకదలకుండా బొజ్జ నిమురుకుంటూ కూర్చోవడానికి అలవాటుపడిన చెట్టియార్ అరగంట నుండి అలా నిలబడే వున్నాడు.



శ్రీ కాళహస్తీశ్వరాలయ ప్రధాన గోపురం.

నీరసం వచ్చింది కాబోలు—అతనికి కాళ్లు లాగుతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి, ఒళ్లు జోగుతూంది. అయినా విసుక్కోకుండా అలా చేతులు కట్టుకుని నిలబడే వున్నాడు

చందూవెళ్ళి చాలా సేపయింది. ఈ పాటికి స్టేషనుకు చేరుకునే వుంటాడు. భీమసేనరావుగారికి అలా కూర్చోవడం విసుగెత్తుతూంది. ఆ వూరు ఏలాగూ వచ్చారు గనుక మరొక చిన్నపని చక్కబెట్టుకుని వెళ్ళిపోవాలనుకున్నారు. కాని తను అక్కడినుండి వెళ్లిపోతే చెట్టియార్ సంగతి? ఒక్కక్షణం ఆలోచించి, చెటియార్‌ను ప్రక్కనున్న గదిలోకి నడిపించారు. గదికి పైన తాళంవేసి తాళంచెవి జేబులో వేసుకున్నారు. వీధిలోకి వచ్చి యీ చివరినుండి ఆ చివరకు ఒకసారి తీక్షణంగా చూశారు. తరువాత చకచకా ముందుకు సాగిపోయారు.

## 2

భీమసేనరావుగారు ఊళ్ళోకొచ్చారనే వార్త ఒక గంటలో ఊరంతా అల్లుకుపోయింది. ఈ వార్త క్లబ్బులో డబ్బేసి పేకాడుతూన్న డిప్యూటీ కలక్టరూ, డి.ఎమ్.ఓ. వగైరా. వగైరా జిల్లా అధికారులవరకూ ప్రాకిపోయింది. ఈ విషయం వినీ వినడంతో మేజస్ట్రేటుగారు పట్టుకున్న పేకముక్కలు అలాపడేసి, బల్లమీదనున్న చిల్లర డబ్బులు జేబులో వేసుకుని గబుక్కున లేచి నిల్చున్నారు.

'పర్సనల్ అసిస్టెంటు చందుకూడా వచ్చాట్ట!' అన్నారు, పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంటుగారు.

'ఇంతవరకూ మనకు తెలిసిందికాదే!' అని ఖజానా డిప్యూటీ కలక్టరుగారు తమ అజాగ్రత్తకు కించిన్మాత్రం కించపడ్డారు.

'కొంపకొలేపోయాం.' పోలీస్ జిల్లా సూపరింటెండెంటుగారు చిన్నపోయినట్లు కనిపించారు.

'నిర్మలాదేవి యింటిదగ్గర మనం కలుసుకోడానికి అవకాశం వుండొచ్చు.' తనఊహామాత్రమయిన అభిప్రాయాన్ని వెల్లడించారు, స్పెషల్ వర్క్స్ ఎగ్జిక్యూటివ్ యింజనీరుగారు ఆయన ఉద్దేశాన్ని యింటలిజెన్సు డిపార్టుమెంటు ఇనస్పెక్టరు ధ్రువపరిచారు.

# కార్యశూరులు

'ఒక్క క్షణం ఆగండి,' అని పోలీస్ సూపరింటెండెంటుగారు కుర్చీలోంచి లేచి టెలిఫోన్ గదివైపు విసవిసా నడచి వెళ్లారు. ఎవరికో డయల్ చేసి అయిదు నిముషాల్లో మళ్లా తిరిగి వచ్చారు. 'మనం యింకా యిక్కడుండిపోతే ఎలాగ? రాదల్చుకొన్న వాళ్లంతా పదండి. వెళ్దాం,' అన్నారు.

క్లబ్బు ఆవరణలో నుండి బయలుదేరిన కార్లు, వరుసగా రోడ్డుమీద ప్రవేశించి గొలుసుకట్టుగా ముందుకు సాగిపోతున్నాయ్! మరో పదినిముషాల్లో నిర్మలాదేవి యింటిముందు ఆగాయి. ఆగిన కార్లలో నుంచి, జిల్లా పరిపాలనా వ్యవస్థనంతటినీ అరచేతుల్లో ఉంచుకొన్న వివిధ శాఖలకు చెందిన అధికారులంతా బిలబిల్లాడుతూ దిగారు. అప్పటికే సినీమా రెండో ఆటనుండి వస్తూన్న జనసమూహం భీమసేనరావుగారి దర్శనార్థం కాబోలు ఆ వీధిలోకి రావడానికి సతమతమవుతున్నారు. వాళ్ల కోలాహలం ఆపుచెయ్యలేకనూ, వాళ్లను ఆ వీధి పరిసరాల్లోనికి రాకుండా చెయ్యలేకనూ పోలీస్ జవాన్లు మహాయిబ్బంది పడిపోతున్నారు. అంతలో అక్కడికి వచ్చిన అధికార వర్గాన్ని చూసి ఎవరిమట్టుకు వారు ప్రక్కలకు తప్పుకొన్నారు.

సూపరింటెండెంటుగారు తన క్రింది ఉద్యోగస్థులకు తొందర తొందరగా ఏవో ఆజ్ఞలు జారీచేశారు. తరువాత ఆయన ఆదేశానుసారం నిర్మలాదేవి యింటి సింహద్వారం ముందు తుపాకులు మూడుసార్లు గాలిలోనికి పేల్చబడాయి. 'సాధారణంగా యిటువంటి మర్యాద ఎవరో మహారాజులకు, చక్రవర్తి హోదాలో నున్న ప్రసిద్ధ వ్యక్తులకూ మాత్రమే లభిస్తుంది.' అనే చర్చలు దూరంగావున్న జనసమూహంలో బయలుదేరాయి.

లోపలవున్న భీమసేనరావు గారికి మూడుసార్లు తుపాకి పేలిన శబ్దం వినబడింది. తానెంత రహస్యంగా గడుపుదామన్నా వీళ్లు విడిచి పెట్టేలా లేరు. మేడమీద నుండి ఆయన కిటికీకి దూరంగా వుండే ఒకసారి

# శ్రీశైల మల్లయ్యా

[పి. శెట్టి వెంకటేశ్వరరావు]

శ్రీశైలనాథుని చిత్తానదలచి
శ్రీ గౌరి రమణుని - భక్తితో గొలచి
సేవించి తరియించరే
శ్రీశైల
క్షేత్రాని కరుదెంచరే.

త్రైలింగోర్వివలిల్లి తేరులేకదలా
వృషభాల రంకెల్లో ఓంకారమెదలా
మల్లేశు ధ్యానించరే
శ్రీశైల
మల్లికార్జును గొల్వరే.

ఘణఘణానాదాల ఘంటలే మ్రోగ
గరళకంఠుని కీర్తి గానమ్ము జేయ
గళ మెత్తి నినదించరే
ఈశుని
కరములా పూజించరే.

హరహరా శంకరా! గిరిజా మనోహరా!
వేదుకో మల్లీశ! శ్రీశైల వాసా!
ఓంకార నినదాలతో
ఈశుని
శంఖాల పూరించరే

కష్టాల నష్టాల కావవే శంభో
కామితార్థము లిచ్చి కాపాడుమీశా!
చే యెత్తి ప్రార్థించరే
ఈశుని
"జై" యంచు వినుతించరే




**Statement about ownership and other particulars about newspaper**

**ANDHRAPATRIKA**
**Illustrated Weekly**

1. Place of Publication: 6&7, Thambu Chetty St. Madras-1.
2. Periodicity of its publication: Every Wednesday
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1
4. Publisher's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Nationality: Indian
   Address: 29, Chamier's Road Adyar, Madras 28.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAME | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29, Chamier's Road, Adyar, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd) S. RADHAKRISHNA,
25-2-1959. Signature of Publisher.

రోడ్డుమీదకు దృష్టి సారించారు. తనకోసం వచ్చిన జిల్లా అధికారులంతా కనిపించారు. వాళ్ళంతా రోడ్డుమీద కనిపెట్టుకునే వున్నారు. ఈ సమయంలో తను వాళ్ళ కంట పడితే తనను కదలనివ్వర నేమాట మాత్రం వాస్తవం. ఇంకా మర్నాడు మరో వూళ్ళో తను హాజరు కావలసిన అత్యవసరమయిన పనులున్నాయి. అందుచేత వాళ్ళదృష్టిలో పడి వాళ్ళముగ్గ్య చిక్కుపడి పోకూడదు.

భీమసేనరావుగారు ఒక్క క్షణం ఆలోచించారు. తల పంకించి మేడదిగి, తలుపులు తెరచుకొని పెరటి ద్వారం సమీపించారు. మెల్లగా అతలుపు గడియ కూడా తీసి అవతల కాలుపెట్టారు. ఆయన వెర్రిగాని, అక్కడ మాత్రం ఎవరైనా వుండరూ? అక్కడే వున్న పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంటు, సర్కిల్ యినస్పెక్టరు భీమసేనరావుగారి రెండుచేతులు పట్టుకున్నారు హఠాత్తుగా కరచాలనం చేసినట్లు. భీమసేనరావుగారు విస్తుపోయారు!

ఒక్కసారి పోలీస్ విజిల్సు ప్రతిధ్వనించాయి. అప్పటికి అంతా అటువైపు చేరుకున్నారు. బాధ్యతాయుతులయిన యిద్దరు పోలీసు అధికారులు తనకు అండదండగా చెరొక ప్రక్కనూ నడుస్తువుండగా భీమసేనరావుగారు ఠీవిగా, గాంభీర్యం యొక్క రూపాంతరమా అన్నట్లు నడుస్తూ వచ్చి పోలీస్ వాన్‌లో అడుగుపెట్టరు. చందు, సబిన్స్పెక్టరు సరసను అప్పటికే దీనిలో కూర్చొని వున్నాడు. నలభై అయిదు వేల రూపాయల నగదుతో నిండిన సూట్ కేసు చందు చేతినుండి సబిన్స్పెక్టరు చేతిలోకి ఎప్పుడో బదిలీ అయిపోయింది. రావుగారు, ఆయన వెనక పోలీసు అధికారులు ఎక్కగానే పోలీస్ వాన్ తలుపులు మూసుకున్నాయి.

రంగస్వామి చెట్టియార్ ముఖంమీదకు మత్తును కలిగించే 'గ్యాస్'ను వదిలినప్పుడు అతను ఊపిరిబంధించి తనకు మత్తుకలగకుండా జాగ్రత్త పడ్డాడని—అయినా తెలివి తప్పిపోతున్నట్లే ఒళ్ళు జోగుతూన్నట్లే నటించాడనీ, తరువాత అతన్ని బంధించిన గదిలో టెలిఫోన్ వుందనీ, అతనే తన విషయం పోలీస్ సిమనుకి ఫోన్ చేశాడనీ, స్టేషనుకు బయలుదేరిన చందుకు రైలు తప్పిపోతుందని—పాపం, భీమసేనరావుగారికేం తెలుసు? డబ్బుతో వెళ్ళిన చందు యీ పోలీసువాళ్ళ కళ్ళపడి పోతాడని మాత్రం ఆయన కలగన్నాడా?

ప్రజల కోలాహలం మధ్య, ముందు వెనుక పోలీస్ జీపులతో భీమసేనరావుగారు కూర్చున్న పోలీస్‌వాన్ పోలీస్ స్టేషన్ వైపు పరుగుతీసింది. ★

# వేదకాలంనాటినుండి...



"तन्तु तन्वन्, रजसो भानुमन्विहि,
ज्योतिष्मतः
पथो रक्ष धिया कृतान् ॥
अनुल्बणं वयत,
जोगुवामपो, मनुर्भव, . . . "

ऋग्वेद

మిలమిల మెరసే, కన్నుల విరిసే
రంగుల నెంచి, అనుకరించి మించి
వడికిన నూలు - జాతికి మేలు
సున్నితమైనవి, సుందరమైనవి
నేయండెన్నో సూత్రాలు....
కవి పుంగవులై, కలాస్రష్టలై
తాతలు చూపిన దారిని చూచి
అనుగమించి సృష్టించండి........

(ఋగ్వేదం ఆధారంగా)






## మగ్గం కదిలితే
## మనోహర సృష్టి
## చేనేతవస్త్రాలు

**ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు**
షాహిబాగ్ భవనం, విటెట్ రోడ్, బొంబాయి.

DA-58/414

# తీరని కోరిక

ఆయనకు నాటకాలంటే మహాపిచ్చి!

ఎంతసేపూ "(మా)ఆయన...మాఆయన" అంటూ తనే చెప్పాలి తిరగాలిగాని "మా ఆవిడ"అని ఎప్పుడన్నా తన నోటివెంట అన్నారా? ఎంతసేపూ 'ఏమేవ్' 'ఒసేవ్'—యివే పేర్లు! ముచ్చటగా పేరెట్టి పిలిచి "నాటకంలో నా వేషం చూద్దువుగాని నాతోరా"అని ఎప్పుడన్నా పిలిచారా? అంతా వారిని పొగుడుతూంటే ఏమిటో!—ఆ వేషంలో వారిని ఒకసారి చూద్దామని పిస్తూంటుంది. ఒకసారయినా తీసుకువెళ్ళితేనా? ఎవరితోనన్నా వచ్చి చూస్తానన్నా వద్దంటారుగదా! పక్కింటి పార్వతి, సీతాలక్ష్మి ఎన్నిమార్లుకూడా రమ్మని బలవంతం చేశారని! వెళ్ళనిస్తేనా? "ఏదో—అనుకుతోందికదా ఒకసారి పంపిస్తే ఏంపోరూ?" అనయినా ఉండదు వారికి! "ఏమిటి చూస్తావులెద్దూ? ఆ నాటకాలు నీకు వచ్చవు" అనేస్తారు. లేకపోతే దానికి సరిపడినవంక ఏదో చెప్తారు. వారికంత యిష్టంలేకపోతే తనుమాత్రం చూడడం దేనికి? ఎప్పుడయినా గట్టిగా పట్టుబడితే తీసుకువెళ్ళేవారేమో, ఎప్పుడయినా పట్టుబట్టి అడిగితేనా? అబ్బే...అనుకుదామనుకున్నా అదేమిటో గాని లేనికోపాన్ని తెచ్చుకొని తను నటించలేదుగదా!

ఏదో వారివేషం చూద్దామన్న కోరిక తప్పితే నాటకం ఎలాఉంటే ఎవరికి కావాలి? చిన్నప్పుడు కురుక్షేత్రం అరడజను సార్లయినా చూసిందిగా తను! ఆ ఊరివారికి చేతయిన నాటకం అదొక్కటే! అందుకే ఏటా కురుక్షేత్రమే ఆడేవారు. ఆ నాటకాన్ని మాసిమాసి విసుగు పుట్టింది. మొదట్లో శెనగపప్పయినా కంది పప్పయినా చిన్నగుడ్డ ముక్కలో మూటగట్టి, కొద్దికొద్దిగా నోట్లో వేసుకొంటూ తెల్లార్లూ నాటకాన్ని చూసేదితను. కాని ఆ తర్వాత తర్వాత అన్నీ అలానే పోయాయి. ఇప్పుడన్నా వారు నాటకం వేస్తుంటే వారి వేషంగురించి వెళ్దాం అనిపిస్తుంటుంది. లేకపోతే నాటకం చూడాలనా?

పెళ్ళయిన కొత్తలో వారిగదిల్లో ఫోటోలు వేలాడుతూంటే చూసి ఎవరివో అనుకుంది తను. ఆ కోరమీసాలు, గిరజాలజుట్టు, కిరీటం, చేతిలో గద- ఇవన్నీ చూస్తే వారని ఎలా అనిపిస్తుంది? మరో ఫోటోలో ముఖం నిండా, ఒంటి నిండా మసి, కౌరునలువు బట్టలు, చేతిలో పొడుగాటి కర్ర, కూడా ఓ కుండ- అది అంతే! ఎక్కడన్నా పోలిక ఉంటేనా? "ఎవరివో ఫోటోలు తెచ్చి అక్కడ ఎందుకుపెట్టారా?" అనిపించింది. పోనీ- వారయినా ఆతర్వాత చెప్పొద్దూ?

ఒకరోజు అవన్నీ తీసి దేవుడి ఫోటోలు తగిలిస్తుంటే అతగారు చూసి "అదేమిటమ్మాయి! వాడేదో సరదాకొద్దీ నాటకాలో వేషాలు వేసినవి ఫోటోలు కట్టించి పెడితే నువ్వు తీసేస్తున్నావ్?" అంది. 'వారా!' అనుకుందితను, అవునుమరి, తనకేం తెలుసు! ఎప్పుడన్నా చెప్పారుగనకనా? అంతకుముందు కొత్తలో ఒదిన ఒకమారు

---

**శీలా వీర్రాజు**

---

వేళాకోళం ఆడిందిగదూ "నువ్విక సినిమాలు చూడక్కర్లేదమ్మాయ్" అని. అప్పుడు ఎందుకలా అందో అర్థంకాలేదు తనకు. ఆ తర్వాత తెలిసింది. అది-మొన్న మాణిక్యం పిన్ని మరెవరితో మాట్లాడుకొంటుండగా తను వింటే తెలిసింది. లేకపోతే తనకేం తెలుసు? ఎప్పుడన్నా చెప్పిఉంటేగా?

ఒకసారి వారితో "ఆ సంగతి నాతో చెప్పలేదేమండీ? మీరు నాటకాల్లో వేషాలు వేస్తారటగా!" అంటే, "అబ్బే, అప్పుడప్పుడు ఏదో కొద్దిగా సరదాకు వేస్తుంటాలే," అన్నారు. ఏమేమి వేశారో, ఎప్పుడు వేశారో అవన్నీ చెప్తే ఏంపోయిందో? ఏదో తెలుసుకుందామని సరదాకొద్దీ అడిగాను. చెప్పకూడదూ?

ఒకమారు అత్తగారిని కదిపి "ఏమండీ, వారు నాటకాలు వేస్తుంటారటగా?" అంటే "అయ్యోరాత! ఆ సంగతి నీతో ఎప్పుడూ చెప్పలేదుటే! వాడు దుర్యోధనుడివేషం మహ బాగా కడతాడనుకో. సుబ్బిశెట్టివేషం వేసి స్టేజిఎక్కితే......అచ్చంగా అవతలివీధిలో చిల్లరకొట్టు పానకాలసెట్టి లేడూ—అలా ఉండేవాడు తెలుసా! ఈ సారి వేస్తే వెళ్ళి చూద్దువుగానిలే," అంది. ఏదీ!—ఒకసారయినా వారు రమ్మంటేగా? వారు రమ్మనకపోయినా తానే కల్పించుకొని "చూడడానికి నేనూ వస్తానండీ" అంటే, "ఎందుకు లెద్దూ" అంటారు. అయినా అదేమిటో గాని ఆ సమయానికి అన్నీ అవాంతరాలే వస్తున్నాయి.

ఏటా నవమికి కోదండ రామాలయం దగ్గర నాటకాలు వేస్తుంటారు. అక్కడ దేవుని కల్యాణం కాస్త ఆర్భాటంగానే జరుగుతుంది. మొదటి సంవత్సరం తను కాపరానికి వెళ్ళేటప్పటికి నాటకాలు అయిపోయాయి. ఆ మరుచటి సంవత్సరం పెద్దపిల్ల కడుపులో పడింది, పుట్టింటికి వెళ్ళిపోయింది. మూడో యేడు—వారసలు ఊళ్లో ఉంటేనా? ఏదో నాటకం కంపెనీతో సంవత్సరం పాటు దేశమలా తిరిగి యీనె పుల్లలా తయారయి వచ్చారు! వెళ్ళేటప్పుడు చెప్పనైనా చెప్పారా? చడీ చప్పుడు చెయ్యకుండా కట్టుబట్టల్తో మాయమయ్యారు. అప్పుడు తను ఎంత భయపడిందని! అనుకోకూడదు కాని 'ఏమయిపోయారో?...ఏమిటో' అని ఒకటే భయం.

తిరిగి తిరిగి మళ్ళీ ఒక ఏడాదికి ఇల్లు చేరుకున్నారు. వారే అని నమ్మలేకపోయింది తను. నిజంగా వేషం వేసుకొని వచ్చారనిపించింది. ఆ గడ్డం, బట్టలు, నల్లగా మసిబొగ్గులా మాడిపోయిన ముఖం—పూర్తిగా ఆకారమే మారిపోయింది! 'ఈ సారి దుర్యోధనుడి వేషం వేస్తే ఎలా?' అనిపించింది. దుర్యోధనుడంటే నరసింహంతాతగారిలా అడ్డంలో ముగురు మనుషుల లావయినా వుండాలిగా మరి! అందుకే ఆ యేడు వారు

## ★ తీరని కోరిక ★

నాటకం వెయ్యలేదు. వారు వెయ్యంది చూడ్డం ఎందుకులే అనిపించింది. ఆ తర్వాత వనమికి డబ్బు వసూలుకోక అసలు నాటకాలే వెయ్యలేదు.

ఆరేడు రెండు రోజులపాటు తోలుబొమ్మల్ని పెట్టించి మిగిలిన రోజులన్నీ అపూరి భాగవతారుగారి చేత లంకాదహనం చెప్పించి వేశారు.

ఆ మధ్య జమిందారుగారి కూతురి పెళ్లికి నాటకం ఒకటి వేయించారు. వారూ అందులో వేస్తున్నారు. అత్తగార్ని తోడు తీసుకొని వెళ్ళి చూద్దాం అనుకుంది తను. వారితోనూ చెప్పలేదు. వస్తే మహా చూడొచ్చారేమిల్లే అని. తీరా వెళ్దాం అనుకుని నాటకం పదకొండింటికి కదా అప్పుడే ఎందుకులే అని చంటిబాబు ఏడుస్తుంటే ప్రక్కన పడుకొని జోకొడుతూంటే మెల్లగా నిద్రపట్టేసింది! వారు తెల్లవారు ఝామున నాటకం నించివచ్చి నిద్రలేపేవరకూ తెలివిరానే లేదు!

ఇంతకూ తనకు వారి వేషం చూసే అదృష్టం లేదనుకోవాలి. లేకపోతే ఏ యేడు కాయేడు అన్నీ ఆటంతరాలేమిటి? ఏమయినా మనం అనుకుంటే సరిపోతుందా? విధి కూడా అనుకూలించవద్దూ? అలా మనం అనుకున్నవన్నీ అయిపోతుంటే దేవతలమయిపోమూ! మర్నాడు ఉదయం పైపు దగ్గర సీతాలక్ష్మి చెప్పింది కదూ" "వదినా అన్నయ్య రాత్రి ఎంతబాగా వేశాడనుకున్నావ్! అచ్చంగా సుబ్బిశెట్టే! ఎక్కడన్నా పోలిక దొరికితేనా? మీ పెద బావగారికొడుకు ఫొటోలు కూడా తీశాడు," అంది!

వాళ్లంతా వారిని అలా పొగుడుతూంటే ఎలాగో అనిపిస్తుంది తనకు. తనలో తను మురిసిపోయినట్టే నే అలా చూస్తూ నుంచుండిపోవలసి వస్తుంది అంతకన్నా తనేం చెయ్యగలదుమరి? వారి వేషం గురించి తనకేం తెలుసు. ఎప్పుడన్నా చూస్తేగా? అప్పుడప్పుడు గదిలో తలుపులన్నీ వేసుకొని వారుపద్యాలు పాడుకోవడం వినడం తప్పించి తనకింకేం తెలుసు? అదీ యీమధ్య పన్నెండి మళ్ళీకొద్దిగా లావెక్కినతర్వాత పాతవేషాలతాలూకుపద్యాలూ అవి పాడుతూండడం మొదలు పెట్టారు.

అంతెందుకు. పెద్దదానికి అయిదేళ్ళు వున్నాయో లేవో, మొన్న పెదబావగారబ్బాయి శేఖరంతో నాటకానికి వెళ్ళి వచ్చి ఉదయం అంటుందికదా "అమ్మ... మరేం...నాన్నం...బలేబలే" అని, ఏం చెప్పేది. నోటిమీద వేలువేసుకుంది తను! కాకపోతే ఇంత ఉందో లేదో అది చూడడమేమిటి? తను చూడకపోవడమేమిటి? కలికాలం! ముందొచ్చిన చెవులకన్నా వెనక వచ్చిన కొమ్ములు వాడెక్కువంటారు-ఇదే!

శేఖరం ఏవో ఫోటోలు వారికి చూపిస్తుంటే తను వెళ్ళి చూసిందిగా. నాటకం నాడు శేఖరం తీసినవట అవి. "ఇదుగో పిన్ని బాబాయ్" అంటూ శేఖరం చూపించేవరకు వారిని తను గుర్తుపట్టనేలేదు. ఎవత్తెకో చేతికి ఉంగరం పెడుతూన్నారు. అది భోగందట! నాటకంలో వేషం వేస్తున్నదట. "నాటకంలో ఇదొక సీనులేవే" అన్నారు వారు. ఎంత నాటకంలో సీనయితేమట్టుకు! అంత దగ్గరగా కూర్చుంటారా? ఎంత అసహ్య

యింగా చేతికి ఉంగరం తొడుగుతున్నారూ. ఎప్పుడయినా అంతదక్కగా తనతో కలిసి కూర్చున్నారా? ఒక్కసారయినా అలా ప్రేమతో దగ్గరకు పిలిచి లాలించారా? "ఏమిటండీ యిది?" అంటే "అంతా నటనే ఇది. నాటకం అంటే ఏమనుకున్నావ్?" అన్నారు.

మహా-నాటకం అంటే తనకు తెలీనట్టు.

ఆ తర్వాత వారే వచ్చి తనెక్కడ బాధపడుతుందో అని గుమ్మడికాయల దొంగంటే భుజం తడుముకున్నట్టు "బాలరాజు సినిమా, రత్నరేఖ సినిమా నువ్వు చూడలేదూ? అందులో నాగేశ్వర్రావు ఎలా యాక్టు చేశాడు?-అచ్చంగా ప్రేమించి పెళ్ళాడినట్టు లేదూ. అంతా నటనే. బయటికి వస్తే మళ్ళీ ఎవరికివారే! ఒకరి నొకరు పలకరించుకోనైనా పలకరించుకోరు," అన్నారు. అంతా నటనే. ఏదో వంక చెప్పారు తనను నమ్మిద్దామని. అంత తెలివి లేనిదా తను? ఆమాత్రం అర్థంకాదూ? అయినా ఈ మగాళ్లంతా యింతే! నమ్మమని ఎవరు చెప్పారు లెస్తూ!

ఇదేమిటి? ఈ పోదంతా ఆలోచిస్తుందేమిటి తను! వారు ఎలాఅయితేనేం యింత కాలానికి నాటకం చూడడానికి రమ్మన్న తర్వాత నాటకం గురించి ఎదురు చూస్తూ ఖాళీగా కూర్చుంటే యీ ఆలోచనలన్నీ వస్తున్నాయి.

మొన్న వారు బయటినుంచి వచ్చి "ఎల్లుండి నాటకం ఒకటుంది. రిహార్సిలుకు వెళ్ళాలి. వంట త్వరగా తెములనియ్" అన్నారు.

ఊర్లో కొత్తగా కట్టిన స్కూలుని ఎల్లుండి పట్నంనుంచి ఎవరో వచ్చి ప్రారంభిస్తారట. ఆ రాత్రికి నాటకంకూడా వేద్దామనుకున్నారట.

వారికి భోజనం వడ్డిస్తూ "ఏమండీ, నేను చూడొద్దూ?" అంది తను. పూర్వంలాగే "ఏమిటి చూస్తావులేవే" అన్నారు. ఇక ఇల్లా అయితే లాభం లేదనుకొని ఈ రెండు రోజులూ ముభావంగా తిరగడం ప్రారంభించింది. వారు పిలిచినా వినిపించనట్టే తిరిగింది. నిన్న అత్తగారితో కూడా చెప్పిందిగా తను. సాయంకాలం అత్తగారు చెప్పినట్టుంది. ఉదయం వారు "సర్లే. రాత్రి నాటకానికి వద్దువుగానిలే" అన్నారు. అప్పటినుండి రాత్రి ఎప్పుడవుతుందా అని ఎదురు చూస్తోంది తను.

వారు ప్రొద్దుటినుండీ నాటకానికి పందిరి స్టేజివెయ్యడంలో మునిగిపోయారల్లే వుంది. లేకపోతే మధ్యాహ్నం భోజనానికి ఎందుకు రారూ? తను మధ్యాహ్నం భోజనం ఏదో-చేసిందిగాని రాత్రికి తినాలనిపించలేదు. నాటకం చూద్దామన్న సంతోషంలో ఆకలే అనిపించలేదు. ఏదో-అలా నాలుగు మెతుకులు నోట్లో వేసుకున్నదంతే!

ఇందాక సీతాలక్ష్మి కనుపిస్తే "నాటకానికి నేనూ వస్తాను వదినా! మనిద్దరం కలిసే వెళ్దాం. వెళ్లేటప్పుడు ఇలా మా యింటికి రా" అని చెప్పింది తను. "అలాగే" అంది. ఏదీ!- ఇంకా రాలేదు. అప్పుడే ఎనిమిది కూడా అయిపోయింది. నాటకం తొమ్మిదింటికేట. పిల్లలు ఇద్దరూ వాళ్ళ నానమ్మదగ్గర నిద్ర పోతున్నారు. చంటి బాబు లేస్తేకూడా తీసుకువెళ్ళొచ్చులే. పెద్దది లేస్తే— మొన్న చూపిందిగా, మళ్ళీ ఎందుకు? పోనీ తీసుకు వెళ్లితే ఏం పోయిందిలే.

అయినా యింకా సీతాలక్ష్మి రాదేమిటి? "కాస్త వేగంగా బయలుదేరు వదినా" అని కూడా చెప్పిందితను. బహుశా వాళ్ళాయనకు భోజనం వడ్డిస్తుందేమో. అవునుగదూ!.. ఇప్పుడిప్పుడేగా వాళ్ళాయన యిలా వెళ్లాడు. ఏమయినా అంతసేపు భోజనం చేస్తాడా?.. ఇప్పుడిప్పుడనుకున్నా అరగంటపైబడింది!.. బహుశా భోజనం అయిపోయి వుండాలి. నాటకానికి వెళ్తావని అడుగుతున్నదేమో...సరి సరి, ఆయన్ను అడగాలేమిటి? అడక్కుండా వచ్చినా ఏమీ అనరు...అయ్యో యిలా అనుకొంటూంటే అరగంటకూడా అయిపోయిందే!...బహుశా వస్తున్నదేమో... అదిగో వచ్చినట్టుంది, తలుపు కొద్దిగా తెరచుకొంది ... ఏమిటి! తలుపు పూర్తిగా తెరచి లోపలికి రాదేం? మా ఆయన ఉంటారనా ఏమిటి? భలేవదినే! నాటకం వేస్తుంటే యిక్కడెందుకుంటారు?"

"రా...వదినా ఫరవాలేదు రా"...

రాలేదేమిటి చెప్మా! వేళాకోళం ఆడుతూందా యేం? అయినా ఎప్పుడూ వేళాకోళం ఆడుకోవడం యిద్దరి మధ్యా లేదుగా...అదిగో!

...ఏదీ?...అదేమిటి అక్కడ! లోపలకు నీళ్ళు వస్తున్నాయేమిటి! బయటి నుండి జల్లు ఆగకుండా మరీ కొడుతోంది. కిటికీ లోంచి రోడ్డుమీద నీళ్ళు కనుపిస్తున్నాయేమిటి! అయ్యో!... కాలవలు కూడా పరుగెడుతున్నాయే. అదంతా ... ఆ వర్షం నీళ్ళే! 



దీర్ఘాలోచన

—చిత్రకారుడు: డి. మూర్తి ]

# కేసరీ విద్యాసంస్థల వార్షికోత్సవం





ఇదరు గవర్నర్లూ (శ్రీ మేధీ, శ్రీ గిరీ) వేదికపై ఆసీనులై వున్నారు; శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడుగారు వార్షిక నివేదిక చదువుతున్నారు.



బాలబాలికలకు బహుమతులు ఇస్తున్న శ్రీమతి మేధీ

త్యాగరాయ నగరంలోని కేసరీ ఉన్నత పాఠశాల విశాలావరణంలో ఫిబ్రవరి 21-వ తేది సాయంత్రం కేసరీ విద్యాసంస్థల వార్షికోత్సవం జరిగింది. విద్యాసంస్థ యాజమాన్యాన నగరంలో నడుస్తున్న మూడు పాఠశాలల (రెండు ఉన్నత పాఠశాలలు, ఒక ప్రాథమిక పాఠశాల) తాలూకు వెయ్యిమంది విద్యార్థులు, వారి తలిదండ్రులు, తదితరులు మొత్తం మూడు నాలుగు వేలమంది ఈ ఉత్సవానికి హాజరైనారు. మద్రాసు గవర్నర్ శ్రీ విష్ణురాం మేధీ సభాకార్యక్రమానికి అధ్యక్షత వహించారు. శ్రీమతి మేధీ బాలబాలికలకు బహుమతులు పంచిపెట్టారు. ఉత్తర ప్రదేశ్ గవర్నర్ శ్రీ వి. వి. గిరిగారుకూడా సభకు హాజరైనారు. కీ॥ శే॥ డా॥ కేసరిగారి ఔదార్యాన్ని, విద్యాసంస్థాపన ద్వారా నగరంలోని తెలుగు బాలికలకు వారు చేసిన సేవను ఇద్దరు గవర్నర్లూ ప్రశంసించారు. విద్యాసంస్థల అభివృద్ధికి దివాన్ బహదూర్ శ్రీ బండి శ్రీహరిరావు నాయుడు గారు చేస్తున్న సేవను ఉగ్గడించారు. బహుమతి ప్రదానానంతరం విద్యాసంస్థల బాలబాలికలు రకరకాల నాట్యనాటికలను ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందపరిచారు. ★



కేసరీ పాఠశాలల ఆగ్జిలరీ కేడెట్ కోర్ విద్యార్థులు, విద్యార్థినులు గవర్నర్ మేధీకి గౌరవాభివందనం సమర్పిస్తున్న దృశ్యం.

—ఫొటోలు: సోమయాజులు]




మూలం
మానిక్ బంద్యోపాధ్యాయ
అనువాదం
మద్దిపట్ల సూరి

[గతవారం తరువాయి]

శశి తెల్లబోయి కుంద ముఖంకేసి చూశాడు. ఇంతసూటిగా మాట్లాడటం ఎక్కడ నేర్చుకుంది కుంద? కుంద చాలా సుఖవంతురాలని, ఆమెది ఆనందమయ జీవితమని హఠాత్తుగా అనిపించింది శశికి. కుంద గాలిమేడలూ కట్టుకుంటూ ఉంటుంది. మేడలున్న వారిని చూసి ఈర్ష్యపడుతూనూ ఉంటుంది. చీరలన్నా నగలన్నా అత్యాశ ఆమెకి. ఆమెభర్త గోపాల్ గుమాస్తాలలో ఒకడు. అయినా కుందమాత్రం సుఖవంతురాలే. తనకి అది లేదని, ఇది లేదని లేనిపోని విచారాల్ని తెచ్చిపెట్టుకోవటం ఆమెకి ఆనందం... ఆమెచేసే ఫిర్యాదులన్నీ అలాంటివే. ఇన్నాళ్లూ కుంద శశికంటికొక జడ పదార్థంలా, ఎందుకూ కొరగానిదిగా కన్పించింది. నిరర్థకమైన ఆమె జీవితంలో ఆనందం ఉన్నట్లు గ్రహించేసరికివాళ శశి కొంచెం దిగ్భ్రాంతుడయినాడు. కుసుమ ఏమిచేసిపోయిందో శశిని. ఎదుటనున్న వ్యక్తులముఖంలో కళ్ళలో శశి దేనికోసమో ఆదుర్దాగా చూస్తూఉంటాడు. ముఖంలో చిరునవ్వుచూసినా, కళ్లలో ఆనంద రేఖల్ని చూసినా శశి మనస్సుకెంతో సంతృప్తిగా ఉంటుంది. ఏడుపుకళ్ళతో, విచారముఖంతో ఎదురుగావచ్చి నుంచున్నవాళ్లని దండించెయ్యాలని అనిపిస్తూంటుంది శశికి. హఠాత్తుగా కుంద చాలా మంచిదిగా తోచింది అతడికి. ఎంతో ఆపేక్షగా "నీకేంకావాలో చెప్పు కుందా? మంచిచీర ఏదైనా కావాలా? బెనారస్‌చీర?" అని అడిగాడు

కుంద తెల్లబోయింది. "హఠాత్తుగా ఇప్పుడు బెనారస్‌చీర ఎందుకు దాదా?" అని అడిగింది.

శశి గంభీరంగా "ఇస్తాను, నీకోచీర కొనిఇస్తాను. ఏంలేదు, ఊరికేనే కొనియిస్తాను కుందా" అన్నాడు.

శశి కుందకి ఊరికేనే చీరకొనిఇచ్చాడు. అక్కడ గోపాల్ గురుదేవులు వేంచేశారు. భోలాబ్రహ్మచారి అని అంటారందరూ ఆయన్ని. మీసాలూ, గడ్డం, తల కనుబొమలూకూడా నున్నగా ఉంటాయతడికి. చేతిలో చిన్న నల్లటిదండం, కాషాయవస్త్రంగా కాషాయరంగు వేసిన కాన్వాస్ బూట్లు కాలికతడికి. గోపాల్ ఈ అయిదేళ్లనుంచి ఇంచుమించు మరిచిపోయాడతడ్ని. కాని హఠాత్తుగా ఎంతో వ్యాకులపాటుతో స్మరించుకున్నాడతడ్ని. అలా స్మరించుకుంటే భగవంతుడైనా కన్పించేవాడే ఈపాటికి. అతడికి సగౌరవంగా సాష్టాంగ ప్రణామం చేశాడు గోపాల్. స్వహస్తాలతో ఆయన పాదాలు కడిగాడు. అంతకుముందే లోపల ఒక గది శుభ్రంచేసి ఆయనకోసం ప్రత్యేకించారు. ఆ గదిలో ఆయనకి బస ఏర్పాటు చేశారు. బ్రహ్మచారి గారిమీద శశికి భక్తిభావముంది. ఈ సమయంలో హఠాత్తుగా ఆయన వేంచేసినందుకు అంతగా ఆనందించకపోయినా, ఆయనకి మామూలుగా భక్తితోనే నమస్కరించాడు శశి.

భోలా బ్రహ్మచారి వారం రోజులున్నారు. ఈ వారం రోజులూ ఒక్క క్షణంకూడా ఆయన్ని విడిచి ఉండలేదు గోపాల్. ఎన్నో నివేదించుకున్నాడు, ఎన్నెన్నో అడిగి తెలుసుకున్నాడతడి వల్ల. గోపాల్ అతడివల్ల బాజిత్‌పూర్ కోర్టులో ఒక దావా ఓడిపోయాడు. దావాపోతేపోయింది. అతడికీమధ్య వైరాగ్యం వచ్చేసింది. ఈ దావాలూ అవీ ఇప్పుడతడి దృష్టిలో తుచ్ఛమైనవి. కేవలం సేన్‌దీదీ మూలంగా కాదు. ఇదంతా ఎవరికోసం అన్నభావం గోపాల్‌కి చాలా కాలం క్రిందే కలిగింది. ఎవరికోసం తానింత కష్టపడి ఇంతసంపాయించడం. ఒక కూతురున్నది సింధు. నాలుగు రోజులు పోయాక పెళ్లి చేసేస్తే ఆ పిల్ల ఓ అయ్యఇంటికి వెళిపోతుంది. అప్పుడిహ ఎవరుంటారు గోపాల్‌కి? శశా? శశి విషయంలో అతడేం ఆశలు పెట్టుకోలేదు. తండ్రిని అసహ్యించుకునే కొడుకు మీద ఆశపెట్టుకుంటాడా ఏ తండ్రి అయినా? ఎంత చిక్కబట్టుకుందామన్నా మనసు విరిగిందతడికి.

కుసుమ మనస్సులాగానే గోపాల్ మనస్సుని కూడా శశి విరిచేయటం చాలా ఆశ్చర్యం! ఈ ఇద్దరి మనసులకి నచ్చినట్లు నడచుకోలేకపోవటమనేది ఎంత అపరాధం శశిది! విరిగిన మనసుతో కుసుమ వైదొలగిపోయింది. గోపాల్ యింకా ఆశవదలుకోలేదు. భోలా బ్రహ్మచారి దగ్గర అంతా నివేదించుకుని గోపాల్ కొంచెం ప్రక్కకి వెళ్ళాడు. బ్రహ్మచారి శశిని పిలిపించారు.

"నాయనా, శశీ! నువ్వు చదువుకున్నవాడివి, బుద్ధిమంతుడివి. నీయీ భయూలికంటె కర్తవ్యం చాలా ముఖ్యమైనదని చెప్పట అనవసరమనుకుంటాను" అన్నాడు.

"చిత్తం"

"తండ్రంటే భక్తిశ్రద్ధలు చూపటంకంటె కుమారుని తరవు కర్తవ్యం ఏముంది?".

సరిగ్గా ఇలాగే-ఉపోద్ఘాతం ఏమీలేకుండా కొంచెం కటువుగా



# జీవనలీల



మాట్లాడాడు బ్రహ్మచారి. ఆమాటలు నచ్చినట్లున్నాయి శశికి. కొంచెం తెప్పరిల్లటం—"తండ్రివిషయంలో కొడుకు ముఖ్య కర్తవ్యం అది కాకపోవట మేమిటి? అది కొడుకు హృదయంలో ఉండే స్వాభావికధర్మం. ప్రత్యేకం నన్ను చెప్పవలసిందేమీ కాదు. తండ్రి స్వభావం మంచిది కాకపోతే—కొడుకు పెద్దవాడయాక ఎదిరించి మందలింపుగా మాట్లాడవచ్చు. కాని తండ్రి ఎలాంటివాడైనా కొడుకు మనస్సులోని మాతృభక్తిమాత్రం ఏమాత్రం చలించదు" అన్నాడు.

శశి తక్కువ వాడేంకాదు. గురువుకితగిన స్థాయిలోనే చెప్పాడు సమాధానం. ఏడెనిమిదేళ్ల క్రితం భోలా బ్రహ్మచారి ఇదే గోపాల్ అతడికి ఉపదేశం చేయించాడు. 'నమోను గుర్వే' అనుకుంటూ ఆ ఉపదేశాన్ని శశి కొన్నాళ్ళు మననంకూడా చేసుకున్నాడు. తర్వాత శశిలో ఎంతో మార్పు వచ్చింది.

తర్వాత భోలా బ్రహ్మచారి స్పష్టంగా ముక్తసరిగా—విజ్ఞానగర్భితంగా చాలా విషయాలు మాట్లాడాడు. వాటి నన్నిటినీ శ్రద్ధగావిని శశికూడా విజ్ఞానగర్భితంగానే యిచ్చాడు సమాధానాలు. గురువుకంటే తనలో విజ్ఞానం చాలా పెంపొందిందని తనలో తాను అనుకున్నాడు శశి. కాని అది బయటపెట్టలేదు. శశి బ్రహ్మచారికి చాలా నచ్చాడు. కొడుకువిషయమై తండ్రిచేసిన ఫిర్యాదు అన్నిటినీ మరిచిపోయి, ఎన్నాళ్ళనుంచో ప్రోగుచేసి పెట్టుకుని ఉన్న ఉపదేశ వాక్యాలను ప్రక్కనపెట్టి, శశితో చాలాసంగతులు మాట్లాడాడు బ్రహ్మచారి. అనేక సంవత్సరాలనుంచి వారిద్దరిమధ్య నున్న గురుశిష్య సంబంధం ఇవాళతో తొలగిపోయిందేమో అనిపించింది. క్రమంగా ధార్మికవిషయాలే కాదు, ఇహకాల—పరకాలాలకి పాప పుణ్యాలకి సంబంధించిన ప్రశ్నోత్తరాలే కాదు, ఈసారి వారిద్దరూ ముఖాముఖి కూర్చుని సమానవయస్కులు కాని స్నేహితుల్లా మాట్లాడుకున్నారు. రెండురోజులు లిక్కడ ఉండటంతో శశిదగ్గిర బ్రహ్మచారి సహజంగాచూపే చాంచల్యం కాస్తా ఎగిరిపోయింది. తన నిజస్వభావం శశికి అర్థం అయేట్లు చేశాడతడు. తాను వస్తుతః భోళామనిషి. పరిస్థితుల ప్రాబల్యంవల్ల బ్రహ్మచారయాడు. అంతేకాని బుద్ధిపూర్వకంగా అయినవాడు కాడు. తర్వాత అభ్యాసంగా పరిణమించింది. క్రమక్రమంగా తనజీవితంలోని ఒకటి రెండు సంఘటనలకి, చిలవలు పలవలు కల్పించి శశికి విప్పించాడు. తొలి యౌవనంలో సన్న్యాస జీవితం, ఏదో ప్రాప్తించని దానికోసమై వెతుక్కుంటూ దేశదేశాలు గాలిస్తూ తిరగటం మొదలైన కథలన్నీ. ఇలా ఇల్లువదిలి బయలుదేరిపోయిన వాళ్ళగాథలు శశిని మొదట్నుంచీ ఆకర్షిస్తూనే ఉండేవి. తనకి ఇల్లువదిలి పోవాలనే వాంఛ ఎన్నాళ్ళనుంచో ఉంది.

గోపాల్ అభ్యర్థనమీద శశి మనస్సును ఇంటివైపు మరల్చపోయి, అతడిలో ఇల్లువిడిచిపెట్టి పోవాలనే ప్రవృత్తినే రెచ్చగొట్టినవాడయాడు బ్రహ్మచారి.

నాలుగురోజులు గురువుని అంటిపెట్టుకుని ఉండి, గోపాల్ అన్నీ ఎక్కడికక్కడ దులిపేసుకున్నాడు. తనలోతానే ఏదో దారికి వచ్చి ఉంటాడు. ఎంచేతంటే—తనకర్తవ్య నిర్వహణలో, శశితో వ్యవహరించటంలో అతడు మామూలు ధోరణిలోకి వచ్చాడిప్పుడు.

"అప్పత్రికి రోగులు రావటం అదీ ఎలా ఉంది శశీ?" అని అడిగాడు.

"ఇదివరకటికంటె కొంచెం సంఖ్య పెరిగింది" అన్నాడు శశి.

గోపాల్ విచారాన్ని వెలిబుచ్చుతూ—"జీతం నాతం లేకుండా ఊరికే కాళ్లు ప్రొద్దుక్కుంటున్నావు. నెలనెలా జీతం కింద కొంత మొత్తం ఎందుకు తీసుకోకూడదు? నీ క్రిందకి విలువ లేదనుకుంటుందిగా! మరోక వ్యక్తి నెవర్నయినా పెడితే అతడికి ఇవ్వక తప్పేదా?" అన్నాడు.

శశి ఏమీ తీసుకోకపోనియ్! అసలు గోపాల్ మనసులో ఉన్నదదికాదు. ఏదో నెపంతో అతడితో కొంతసేపు మాట్లాడటం... కావలసింది! సహజంగా ఇలాంటి స్త్రీ సులభమైన ప్రకృతి కద్దు గోపాల్ కి. మధ్య మధ్య శశిని అతడు తెల్లబోయేట్లు చేస్తుంటాడు. బ్రహ్మచారి చెప్పినదానికి శశి ఏమీ ఎదురుకూడా చెప్పలేదు. గోపాల్ కిప్పటికి ఓ ప్రచ్ఛిభయం ఉంది. బహుశా అది ఎప్పటికీ అలాగే ఉండొచ్చు. గోపాల్ మొదట్నుంచీ అతడి మనస్సునికట్టి ఉంచినవాడు. అతడి అభిప్రాయాల్నెప్పుడు మార్పు కలిగించడతడు?

కాయుర్వేదిని పెడుతున్నప్పుడు ఒక్కొక్కసారి యామినీ కవిరాజుగారింట్లోంచి చంటిబిడ్డ ఏడుపు విన్పిస్తూంటుంది శశికి. మరీ పసిగొంతు ఏడుపది. విపినుడికింత మరీ చిన్నబిడ్డ లున్నారా? ఆ ఇలు దాటి వెళ్ళినా చాలా దూరంవరకు ఆ ఏడుపు చెవిని పడుతున్నట్టే ఉంటుంది. కానిలా వ్రేరి ఊహాలు పెట్టుకోవటం తనకే బాగుండలా. కనుకంటూ పుట్టాక మన్యమన్య ఏడవకుండా ఉంటాడా! అయ్యో తానికి కానింత విచలితుడవటం దేనికి? ఇలాంటి ఏడుపు తనయింట్లోనూ ఎన్నోసార్లు విన్నాడు.

సేన్ దీది చచ్చిపోయిన మూడు నెలలకి — ఒక రోజున శశి చాలా ప్రొద్దు ఎక్కి ఇంటికి వచ్చాడు. ఊరికే అలా ఏడుస్తున్న బిడ్డను ఎత్తుకుని కుంద ఎదురుగావచ్చి నిలబడింది. "సేన్ దీది పిల్లవాడు శశీ దా!" అన్నది.

అప్పటికింకా అతడు స్నానం చెయ్యలేదు, భోంచెయ్యలేదు. ఎండలో తిరిగి తిరిగి రావటంలో మొహం వాడిపోయి ఉంది. దానికితోడు కొంచెం తెల్లబోతూ—"ఎవరి పిల్లవాడన్నావ్? సేన్ దీది కొడుకా?" అని అడిగాడు.

"ఊఁ భూమ్మీదపడే పడటంతోనే తల్లిని మింగాడు రాక్షసుడు కృపానాథ్ మేనకోడలూ పసిపిల్లతల్లి. ఆమెనీ పొట్టను పెట్టుకునే వాడేమో! వాళ్ళంతా ఇవాళ వెళ్ళిపోయారుగా! అందుచేత—మామయ్య తీసుకువచ్చి నాకు అప్పగించాడు. నాపిల్లవాడితోపాటే నాదగ్గిర పాలు తాగుతాడు. తల్లిని మ్రింగినట్లు చివరికి నన్ను కూడా మ్రింగెయ్యకుండా ఉండాలి మరి!" అన్నదికుంద. తర్వాత కుంద నోటినిండా నవ్వుతూ. సేన్ దీది బిడ్డని శశికి దగ్గరగా పట్టుకుని "పిల్లి పెంచినందుకు ఓహారం చేయించి ఇస్తానన్నాడు మామయ్య. ఆయన ఇటీవల పెద్దదాత అయినాడు" అన్నది.

"వీణ్ణి ఎవరు తీసుకువచ్చారు?"

"మామయ్యే తీసుకువచ్చారు. ఇలాగే బొంతకప్పి ఎత్తుకుని తీసుకువచ్చాడు. ఇంట్లో వాళ్ళెవరినీ దగ్గిరకి రానీయలేదు. పరాయి బిడ్డని మామయ్య అలా ఎత్తుకురావటం చూస్తే పొట్టచెక్కలయే నవ్వు వచ్చింది. నాతో ఏమన్నాడో తెలుసా? పిల్లవాణ్ణి నేను తీసుకున్నానుకూడా! పెంచగలవా నువ్వు మరి? పదికాసుల గొలుసు చేయించి పెడతా నీకు! అన్నారు. 'అయ్యో మామయ్యా, నా పిల్లతో పాటే పెంచుతాను. దీనికింత హంగామా ఎందుకు?' అన్నాను నేను".

"ఈ భారాన్ని ఎందుకు పైనవేసుకున్నావ్ నువ్వు? నగల మీద ఇంత ఆశా నీకు?" అంటూ ఝుష్ మన్నాడు శశి.

"నగలమీది ఆశతో అలా అన్నానా ఏమిటి? తల్లిలేని, కన్న

తెరవని పసిగుడ్డుకదా! ఎవరో ఒకరు పాలియ్యకపోతే ఎలా బ్రతుకుతాడు? పైగా పిల్లాజెల్లా ఉన్న ముసత్తలూ నాకైయినా ఎవరూ లేరయె. అదలా ఉంచు. మామయ్య వచ్చి అడిగితే 'నా వల్ల కాదు' అని అనలేక పోయాను." అన్నది కుంద తెల్లబోతూ.

సందేహంగా చూశాడు కే. కొంత అర్థమయింది, కొంత అర్థం కాలేదతడికి. ఇంతసేపటికిప్పుడు చటుక్కున డ్రస్ తీసి వేయటం మొదలెట్టాడు. "అంత కోపం యెందుకు కేదా?" అని అడిగింది కుంద.

"అహ కోపమేమీ లేదు."

సేన్‌దీదీ బిడ్డ ఏడుపు మానాడు. కుంద వాణ్ణి ఆప్యాయంగా అదరంగా ఓ ముద్దు పెట్టుకుంది. కుంద మనస్సులో ఏం కొంటె బుద్ధి ఉందో ఎవరికి తెలుసు? తర్వాత పిల్లవాణ్ణి మరోసారి కే దగ్గరగా పట్టుకుని, "ఎం చక్కగా ఉన్నాడో పిలవాడు, చూడు కేదా! అచ్చంగా సేన్‌దీదీలాగానే ఉన్నాడు. ముఖం చూస్తే జాలివెయ్యటంలా?" అన్నది.

కే కొంచెం చికాకుగా "నువ్వు వెళ్ళు కుందా! తిరిగి తిరిగి వచ్చాను. కాసేపు విశ్రాంతి తీసుకోనియ్" అన్నాడు.

ఎవరిమీద కోపం తెచ్చుకుంటాడు? ఎవర్ని విసుక్కుంటాడు కే? సేన్‌దీదీ బిడ్డ చక్కగానే ఉన్నాడు. చాలా చక్కటివాడు. మశూచికంలో మారించిపోయిన సేన్‌దీదీ చక్కదనమంతా పిల్లవాడిలో ఉట్టిపడుతోంది. గట్టిగా కళ్లు తెరవని పసికందు, ఎంత పసిడి బొమ్మలా ఉన్నాడు. వాడి ముఖం చూసేవరికి గోపాల్‌కి జాలి పుట్టుకొచ్చి ఉండొచ్చు, జాలికొద్దీ గోపాల్ ఈ శిశువుని ఇంటికి ఎత్తుకునివస్తే — ఎవరేమనటానికైనా అవకాశం ఎక్కడుంది అందులో? అది గొప్ప విషయం, ప్రశంసించ తగిన విషయం కదా! విచారంతో బాధతో కే ఇంత కొంతేలు పడిపోవటమయినా ఏమంత భావ్యంగా కన్పించదు.

మొంగలిపువ్వులాంటి సేన్‌దీదీ బిడ్డని చూస్తుంటే కేకి రవంతయినా మమత కలగ నేలేదా? అతడిలో మమత కలగటమనే సహజప్రవృత్తిని కుసుమ అంత మరీ పోగొట్టేసిందా? చిన్నబుచ్చుకున్న ముఖంతో స్నానానికి వెళ్లాడు కే. సేన్‌దీదీ పిల్లవాణ్ణి ఎత్తుకుని వచ్చి, కుంద దగ్గరగా కూర్చోటంతో కే సరిగ్గా భోజనంకూడా చెయ్యలేదు. కాస్త కాస్తే అతడిలోని అలసట తగ్గింది. ఎంత అక లేస్తోం దివాళ!

మధ్యాహ్నమంతా ఊరికనే కూర్చున్నాడు కే. ఇహ ఈ పూటైనా ఏదో ఒకటి చెయ్యాలి. ఇంక కదలకుండా ఊరుకోటానికి వీల్లేదు. ఇప్పుడుకూడా పట్టించుకోకుండా ఉంటే కుదరదు. నిశ్శబ్దంగా ఉన్న మధ్యాహ్న వేళ ఒద్దికంగా పడుకునిఉంటే ఒక దానివెంట ఒకటి ఎన్నెన్నో ఆలోచనలు రావటం మొదలెట్టాయి. నిప్పు అంచున పెట్టిన వస్తువు వాడి ఆరిపోయినట్లు—తన హృదయంలోని ఆర్ద్రతంతా ఇగుర్చుకు పోయిందన్న భావం కలగసాగిందతడికి. ఏమాత్రం విచక్షణ, దయాదాక్షిణ్యాలు, లేనివాడిలా తయారవుతున్నాడు! కుసుమమీదికి లాగుతోందా మనసతడికి! చాలా బాధగాఉందా అతడికి? ఇంత ప్రయోజకుడైన కొడుకు గౌరవానికి భంగంకలిగించి, గోపాల్ ఎంతమార్పు తీసుకువచ్చా డతడి మనస్సులో! ఇదంతా తలచుకుంటే ఈనాడు హాస్యాస్పదంగా కన్పిస్తోందా? అతడు ఉంటున్న ఇంట్లోనే సేన్‌దీదీ కొడుకుని వదురు బెదురు లేకుండా గోపాల్ ఎలా తీసుకురాగలిగాడు? సేన్‌దీదీ చావుబతుకులమీద ఉందని తెలిసికూడా అప్పుడువచ్చి చికిత్స చెయ్యటానికి నిరాకరించాడుకదా కే? ఆ సంగతి మరిచిపోయాడా గోపాల్? కే గౌరవ మర్యాదలనేవి అంత చులకనైనదా గోపాల్ దృష్టిలో? అతడేమనుకుంటాడో అనేది అంత త్రోసి పుచ్చతగిన విషయమా? కేకిముందు రవంతయినా సంకోచించవలసిన అవసరం లేదా అతడికి? సేన్‌దీదీ కొడుకుని ఇంటికి తీసుకువచ్చి, పుత్రవాత్సల్యంతో పెంచుతున్న కే మెసలకుండా ఊరుకుంటాడు, ఏమీ పట్టించుకోడు. అన్న అభిప్రాయమా గోపాల్‌కి? పాపం! కే మెసలకుండా ఊరుకున్నా, ఊరుకోకుండా గొడవచేసినా తానేమీ పట్టించుకోకూడదనేనా గోపాల్ ఉద్దేశం! ఎవరికి తెలుసు?

మర్నాడుదయం ఆస్పత్రి కమిటీసభ్యులకి 'అర్జంటు' చీటీ ఒకటి పంపాడు కే. తిలబాబు ఇంటిదగ్గిర కమిటీసభ్యులు ఆ సాయంత్రం అత్యవసర సమావేశం జరిపారు.

కే తన రాజీనామా పత్రాన్ని సమర్పించాడు వారికి. డాక్టరుకోసం ఒక ప్రకటన చిత్తు వ్రాసియిచ్చాడు. ఆస్పత్రి బాధ్యతంతా అతి సమర్థుడైన ప్రెసిడెంట్ తిలబాబే వహించాలని కూడా చెప్పాడు.

కమిటీ సభ్యులందరూ నిర్ఘాంతపోయి "ఏమిటిది? ఎందుకని?" అని అడిగారు.

"నేను ఊరువిడిచిపెట్టి వెళ్ళిపోతున్నాను" అన్నాడు కే.

ఇహ సంకోచంలేదు, తికమక యేమీలేదు. కే ప్రయాణపు ఏర్పాట్లు నిర్విఘ్నంగా సాగిపోతున్నాయి. ఆస్పత్రికి సంబంధించిన వ్యవహారాలన్నీ తిలబాబుకి నివేదపరిచాడు. జమాఖర్చులు అప్పగించాడు. ఇహముందు జరగవలసినదాన్ని గురించి కొన్ని సూచనలు కూడా చేశాడు. డాక్టరుకోసం పత్రికలకి ప్రకటనలు పంపితే దరఖాస్తులు చాలా వచ్చాయి. కమిటీసభ్యులతో సంప్రతించి, ఆ దరఖాస్తులు పంపినవారిలో ఒకరికి ఇంటర్వ్యూకి రావలసిందని ఉత్తరం రాశాడు కే.

అందరూ గడబిడ పడుతున్నారు. కొందరు 'అన్యాయం' అని అనుకోపోలేదు. ఎక్కడికి వెడుతున్నాడు కే? ఎందుకు వెడుతున్నాడు? అతడు వెళ్ళిపోతే ఊళ్లోవాళ్ళగతి యేమవుతుంది? డాక్టరు అవసరం వచ్చిందంటే తామంతా మళ్ళీ జాజపూర్ వరకు పరుగెత్తవలసిందేనా? కేని సంజాయిషీ అడగాలని ఉంది అందరికీ. కొందరు కేతో వాదన వేసుకోవాలని చూశారు. సంజాయిషీ ఇవ్వలేదు కే, వాదనకి దిగలేదు. ఓ చిరునవ్వుతో వారి అనురాగాన్ని గ్రహించి, ఆ ప్రశ్నలను ఎగరగొట్టేశాడు.

అయినా ఈ మాట ఊరంతా పొక్కినప్పట్నుంచీ పెద్ద అలజడి ప్రారంభమయింది. దానికి కే లోపల్లోపల కొంత చలించిపోయాడు. డాక్టరు కదా అనే ఒట్టి స్వార్థదృష్టితో కాక వ్యక్తిగతంగా కూడా అందరికీ ఆదరభావం ఉండనక తప్పదు. చిన్నచిన్న వ్యవహారాల్లోకూడా తానుకనుక పాల్గొంటే అందరికీ ఉత్సాహం వస్తూఉంటుంది. నిశ్చింతగా తనమీద వదిలి ఊరుకుంటారు ఆ వ్యవహారాల్ని. ఇలాంటిది ఊరికే జరగదు. ఎంత అదృష్టం కేది! అయాచితంగా ప్రజలకింత ప్రీతిపాత్రుడవటం! అది ఉపకారాలు చెయ్యటంవల్ల కలిగింది కాదు. అంత ఉపకారాలు ఏంచేశాడు కే? రోడ్లు బాగుచేయించటానికి నడుంకట్టిన వాడుకాదు. మలేరియా నిరోధానికి చెరువుల్లో బావుల్లో మందు కలిపినవాడూకాదు. రాత్రి పాఠశాలలేం పెట్టలేదతడు, యువజన సంఘాలు, గ్రామసంఘాలు ఏవీ స్థాపించలేదు. అయినా ఇప్పుడు చుట్టుప్రక్కల పది ఊళ్ళల్లో కేకి ఉన్నంత పలుకుబడి ఎవరికీ లేదు. కే అంటే అందరికీ అభిమానం లేకపోతే ఇంత పలుకుబడి ఎలా వస్తుంది?

(ఇంకావుంది)

మండపాక
రాజేశ్వరశాస్త్రి

ఎట్టకేలకు సుందరమ్మ అతికష్టం మీద చివరి రాతి పలుకుమీదికి ఎక్కగా గలిగింది. తలమీద నీళ్లతో నిండిన బిందె; బిందెమీద లోటా; చంకలో గుండిగ, నీళ్లతో నిండినదే; భుజంమీద ఉతికి పిండిన బట్టలు—ఇన్నింటితోనూ కదిలంగా, కాళ్లు తడబడి జారకుండా, అడుగు తరవాత అడుగు వేస్తూ పదిగజాల దూరంలో ఉన్న తన యింటి గుమ్మం చేరగాని ఎలాగో ఇంట్లో ప్రవేశించగలిగింది. నీళ్ళ బిందె, గుండిగ వంటింట్లో దిమ్మమీద ఉంచి, కుంటుకుంటూ పెరట్లోకి నడిచి, భుజం మీద తడిబట్టలు ఆ చెట్టుకూ ఈ చెట్టుకూ కట్టీ, వెదుళ్లమీద వేలవేసీ, ఇంటి పంచల మీద పరచీ ఆరవెయ్యడం మొదలు పెట్టింది.

"ఇంట్లో కూరలేమైనా ఉన్నాయా, లేవా ఏవి ఉంటుందా?" అంటూ విస్సయ్య పెరట్లోకి వచ్చాడు. వస్తూనే భార్య మోకాలు చిప్పమీద దెబ్బ, కారుతున్న రక్తం చూశాడు.

"అదేమిటది, అంత పెద్ద దెబ్బ! ఎక్కడ తగులుకున్నావు?" అంటూ ఆశ్చర్యంతో అడిగాడు.

"అంతటితో సంతోషించండి," అంది సుందరమ్మ.

"ఇంకా రాతి పలుకుల మీద కాలుగాని జారితే నెత్తిమీదా చంకలోనూ ఉన్న నీళ్ళ బిందెలతో సహా దొర్లుకుంటూ, బుర్ర బద్దలైపోయి ఈ పాటికి ఏట్లో కొట్టుకుపోయి ఉందును."

"దిక్కుమాలిన ఈ దరిద్రగొట్టు గ్రామానికి మరి ఈ అవస్థ తప్పదు. గ్రహచారం. ఏంచేస్తాం? మనలాంటి అనామధేయుల మాట ఎవరు వింటాడు?—ముందు దెబ్బకు మందు పెడతానుండు."

విస్సయ్య పెరట్లో ఆమూలా ఈమూలా వెతికి విశ్వకరణి ఆకు దూచుకువచ్చి బాగా నలిపి, రసం, భార్య దెబ్బమీద వేసి, ఆకు పిప్పి గాయంమీద వేసి గుడ్డ పీలికతో బిగించాడు.

* * *

విస్సయ్య 'దిక్కుమాలిన దరిద్రగొట్టు గ్రామం' అని సంబోధించిన ఆ పూర్వాక అగ్రహారం. ఏటిగట్టుకు బాగా ఎత్తుగా ఉంది గనక 'మెట్టూరు' అని అని అందాం. ఏరు కాస్త పెద్దదే కాబట్టి 'పెద్దేరు' అని పిలుద్దాం. మెట్టూరుకు పట్టిన మెట్టమొదటి అదృష్టం ఏట్లోకి దిగడానికి మెట్లు గాని సోపానాలు గాని లేకపోవడం. మెట్టూరు గ్రామం సరాసరి ఏటివొడ్డునే ఉంది. కాని, ఏరెంత పొంగినా గ్రామంలోకి మాత్రం నీళ్ళురావు. అంతవరకూ బాగానే వుంది. అయితే ఏటి గట్టు తాటి ప్రమాణం. అంత ఎత్తు నించి కిందికి దిగితే నేగాని నీళ్ళందవు. ఎవరో పూర్వులు చాలాకాలం క్రిందట రాతి సోపానాలు వేయించారటగాని అవి ఏనాడో వరదలలో కొట్టుకుపోయి నామరూపాలు లేకుండా పోయినవి. తరవాత గ్రామస్థులే ఏట్లో అక్కడా అక్కడా పడిఉన్న రాతి పలుకులు దొర్లించుకువచ్చి, క్రింది నుంచి మీదివరకూ గట్టుమీద పాతి, మనుష్యులు ఎక్కిదిగడానికి వీలుగా పేర్చారు. ఈ రాతి పలుకు లొక క్రమంలో లేవు. పలుకు తగిలి పలుకు లేదు. పలుకుకూ పలుకుకూ అధమం మూరెడు ఎత్తైనా ఉంటుంది. ఏట్లోంచి బరువు బిందెలతో గట్టెక్కి రావలసిన స్త్రీలు నిత్యమూ పడుతున్న అవస్థ ఊహించవలసిందే. వాళ్ళకిది దినదిన గండమైపోయింది. వాళ్ళ మొర్ర విన్నవాడు లేడా గ్రామంలో.

భార్యకు తగిలిన దెబ్బ చూడగానే విస్సయ్యకమాంతంగా గ్రామ పెద్దలమీద కోపం వచ్చేసింది. చింతాకు వాసిలో తప్పిపోయిందిగాని, భార్య బుర్ర బద్దలైపోయి చచ్చిఉండును. ఎన్నాళ్ళీ బాధ ఆడవాళ్ళందరూ పడిఉండడం? ఏ రోజు కారోజే గండమైపోతే ఇక మడిగా ఏట్లోంచి నీళ్ళువచ్చినట్టే. ఏటిగట్టు వ్యవహారం శ్రుతి మించిపోయింది. ఊళ్ళో నలుగురినీ కలుసుకొని మాట్లాడి దీనిఅంతేమిటో తేల్చవలసిన సమయం వచ్చిందనుకున్నాడు విస్సయ్య. విస్సయ్యకు ఊళ్ళో పెద్దల దగ్గిర మాట పలుకుబడి బాగా లేకపోయినా, అతడిని గ్రామంలో నలుగురూ గౌరవంగా మాత్రం చూస్తారు. తాతముత్తాతల దగ్గర్నుంచీ మెట్టూరులోనే ఉంటూ, స్వగ్రామంలోను చుట్టుపట్ల పదిపన్నెండు గ్రామాల్లోనూ పౌరోహిత్యం చేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు విస్సయ్య. అధమం మూడు నాలుగు నెలలకైనా సరిపోయే ధాన్యపు గింజలింటికి వస్తాయి. చాలనికాడికి గ్రామాలలో తిరిగి వారనీ వీరినీ అడిగి తెచ్చుకుంటాడు. పెద్దల దగ్గిర ప్రపత్తితో మాట్లాడుతూ, సమానులతో ఛలోక్తులాడుతూ, పిన్నలతో వచ్చీవచ్చీగా మాట్లాడి మాకు లేస్తూ ఉత్సాహంగా మెసులుకువస్తున్నాడు.

* * *

విస్సయ్య విసురుగా గుమ్మం దిగి, వీధిలోకి నడిచి నాలుగైదిళ్ళు దాటి శివశంకరం గారింటికి వెళ్ళాడు. ముప్ఫై ఏళ్ళలోపు వయస్సులో ఉన్న శివశంకరం మంచి స్ఫురద్రూపి. చిరునవ్వులు చిందుతున్న ఆ ముఖం, తీర్చిదిద్దినట్టున్న ఆ కనుబొమలు, ఆ పలువరస, వైదిక సంపత్తు సూచించే నుదుటిమీది విభూతి రేఖలు, సంపన్నుని దేశాభిమాన చిహ్నంగా 120 నెం. నూలు పట్టంచు ధోవతి, ధోవతికి సరిపోయే పోణితో శివశంకరం తన్నొకసారి చూసినవారికి మరుపురాడు. చిన్న వయస్సునుంచీ శివశంకరం రాజభోగాలనుభవిస్తున్నాడు. తండ్రికి ఒక్కడే కొడుకు. ఇద్దరు అక్కచెల్లెళ్ళు మాత్రమున్నారు. వాళ్ళప్పుడత్త వారింట్లో కాపురం చేస్తున్నారు. వెండి బంగారాల వాతావరణంలో, వందల గరిసెల ధాన్యరాసుల గాలిలో, అడుగడుగుకూ, పనికి పనికీ, ఒకరికి నలుగురు చొప్పున మెసలే నౌకర్ల మధ్యలో పెరిగాడు శివశంకరం. ఇంట్లో ఏమూల చూసినా బహుముఖంగా లక్ష్మీ తాండవమాడుతున్నది. దువ్వాళ్లూ గానంచాలూ పొందూరు సరుకే. దండెముల నిండా, పెట్టెల నిండా బరంపురం పట్టు

పందలో, సేలం చీరలో, కొళ్ళాయకాలువలో తొక్కిరిసి వేలాడుతూ ఉంటవి.

ఐశ్వర్యానికి తగ్గట్టు కార్యదీక్షగల వ్యక్తి శివశంకరం. తండ్రిగారు గతించిన తరవాత తన ఎస్టేటులో ఉన్న బీడుభూమి యావత్తూ పరిష్కరించి సాగులోకి తెచ్చాడు. భూముల బలం చేసే సూత్రం తెల్సుకొని పంటల దిగుబడివృద్ధి చేశాడు. మెట్టు పంటలు విపులంగా వేయించాడు. కొబ్బరి, మామిడి, జీడితోటలు వేయించాడు. పసుపుతోటలు వేయించాడు. అన్ని పంటలమీదా పుష్కలంగా ధనం సంపాదిస్తున్నాడు. ఇంట్లో కొత్తగా అపరధాన్యపు కొట్లూ, రెండు అపరదినుసుల కొట్లూ కట్టించాడు. లోపలి ఇంట్లో ఒక భాగం మీద డాబా వేయించాడు. తన భూముల మీదా ఇంటి మీదా ఇంత శ్రద్ధవహిస్తున్న శివశంకరం ఇంటి ముందున్న రోడ్డు మాత్రం బాగుచేయించ లేదు. వేసవిలో పెద్ద గోతులు, మణికెడు ధూళి, వర్షాకాలంలో మోకాలు దిగిన బురద, పేడ రొచ్చు అలాగే చూస్తూ ఊరుకుంటాడు. అందులోంచే తనూ నడుస్తూ అవస్థపడుతాడు. గ్రామంలో మూడు వీధులు నిలువుగానూ, మూడు అడ్డంగానూ ఉన్నవి. అన్నీ తన వీధిలాగే నానా అసహ్యంగా ఉన్నా గ్రామస్థులెవరూ ఆ ఊసే ఎత్తరు. ఊరు చుట్టూనే కాక ఊరు మధ్యనే అక్కడక్కడా ఉన్న పెంట గోతులు వర్షాకాలంలో మురికినీటితో నిండి ఊరంతా కంపు కొడుతున్నా అలాగే భరిస్తారుగాని ఎవ్వరినీ ఏమీ అనరు.

* * *

శివశంకరంగారి యింట్లో తనకున్న చనువు కొద్ది విస్సయ్య చొరవగా సరాసరి లోపలికి నడిచి వరాండాలో తివాసీమీద కూర్చొని ఏవో దస్తావేజులు చూసుకుంటున్న శివశంకరం దగ్గిరికి వెళ్ళాడు. విస్సయ్యను చూస్తూనే శివశంకరం చిరునవ్వు నవ్వుతూ,

"ఏం విస్సయ్య మామా, పొద్దున్నే ఇలా వచ్చావ్?, రా, ఇలా తివాసీమీద కూచో" అన్నాడు.

"ఏమీ లేదోయ్ నిన్నోమారు చూసి పోదామని" సాధారణంగా అగ్రహారంలలో పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా ఒకరినొకరు ఏవో వరసపెట్టి ఏకవచన ప్రయోగం చేస్తూనే పలకరించుకోవడం ఈ నాటికీ ఉంది.

"మీ పెద్దవాడు ఉత్తరాలు రాస్తున్నాడా డబ్బేమైనా—"

"హాఁ, పంపిస్తాడు, నా మొహం. తన క్షేమం పంపమని నన్నడక్కుండా వుంటే నాకు పంపించినంత ఫలం."

"అంతే మామా. ఈ కలికాలంలో ఎవరికి వారే యమునా తీరే. ఇంత వయసు వచ్చినా నీ చాంద్రాయణాలు నీకు తప్పలేదు గదా!"

"ఏం చెయ్యమంటావు? క్రింద జన్మలో ఆర్జించుకున్న కర్మఫలం అనుభవించక తప్పుతుందా? అయినా, గ్రామంలో మీలాంటి పెద్దలంటూ ఉంటే నాకేం భయమోయ్ శంకరం? నాకు లేదు అంటే మీరు చూస్తూ ఊరుకోరు గదా? ఒక వేళ చస్తే మీరంతా కలిసి పిడికెడు మన్ను వేసి పోరటోయ్?"

"అమ్మమ్మ! అంత మాటెందుకోయ్ మామా? అలాంటి ఇబ్బంది ఇప్పుడేమొచ్చింది గనక?"

"వొచ్చింది గనకనే పనిమాలా నీ దగ్గిరికి వచ్చాను."

"అలాగా? ఏమిటైంది?" అంటూ శివశంకరం విస్సయ్య వైపు చూశాడు.

విస్సయ్య వెంటనే జవాబు చెప్పలేదు. మకాం మార్చి సర్దుకొని కూర్చున్నాడు. "శంకరం" అంటూ మొదలు పెట్టాడు. "శంకరం, మరి మీ వంటి పెద్దవాళ్లు చూస్తూ ఊరుకోవడమేనా—లేకపోతే—ఏమైనా దఖలు పుచ్చుకోవడమంటూ ఉందా?"

శివశంకరానికి అసలు, విషయమేమిటో తట్టనే లేదు.

"ఏమిటి మామా నువ్వంటున్నది? ఇప్పుడేం అవసరం వచ్చిపడింది?"

"ఏం లేదు, ఏటిగట్టు సంగతి. ఏట్లోకి సోపానాలు వేయిస్తారా లేదా అని."

శివశంకరం నిదానంగా అన్నాడు: "మామా, పెద్దవాడివి. నీకు తెలియదని కాదు నేను చెపుతున్నది. మన మెట్టూరు రాజకీయాలు చాలా చిత్రంగా ఉంటాయి."

"నిజమేనయ్యా, నిజమే. అయితే, మన గ్రామంలో ఆడ వాళ్ళందరూ ఏట్లోపడి కొట్టుకుపోయే దాకా మీ రాజకీయాలు ఒక కొలిక్కి రావా రేమిటి?"

"నువ్వలా అంటే నేనేం చెప్తాను?"

"శంకరం, తల్చుకుంటే నువ్వొక్కడివే



పుష్పమువలె...





రెక్సోనాతో



మీ చర్మసౌందర్యము వికసించును






రెక్సోనా సబ్బులో నున్నట్టి కేడిల్– ఒక ప్రత్యేక నూనెల మిశ్రమము–చర్మమును పోషించి. మీ సహజ సౌందర్యమును బయల్పరచును.

ఇది ఒక్కటే కేడిల్‌తోగూడియున్న టాయ్‌లెట్ సబ్బు

# ★ నదీతీరం ★

ఈ స్వల్పపు పని చెయ్యలేక పోదువా?"

"నువ్వన్నది నిజమే. ఈ పాఠంచాల పని ఐదు వందలతోనో, మహా అయితే వెయ్యి రూపాయలతోనో అయిపోతుంది. నాకేం కష్టమూ కాదు. అయితే నేనెందుకు తగ్గుతున్నానో నీకు తెలిస్తే ఈ మాట అనవు."

"శంకరం, ప్రజాబాహుళ్యానికి పనికి వచ్చే పని ఇది. ధర్మజిజ్ఞాసతో చెయ్యవలసిన ఇలాంటి పనులకు నువ్వెందుకు వెనక తీస్తున్నావో నా కర్థం కావడం లేదు."

శంకరం నవ్వాడు. "మామా, నీకిన్నేళ్ళొంటి మీది కొచ్చాయిగాని మన గ్రామ రాజకీయాలు నీకు బోధపడలేదు."

"ఏమిటో సుమా. మా తండ్రి కాలం నించీ ఎరుగుదును. నా చిన్నప్పటి సంగతీ చూశాను. ఆరోజుల్లో ఇలాగే ఉండేదా మన గ్రామం?"

"అప్పటి సంగతులు నా కళ్ళతో చూడలేదు నిజమే. అయితే అందరూ అనుకుంటున్న మాటలు వింటూనే ఉన్నాను గదూ. మన బ్రాహ్మణవీధిలో దిగ్గజాల్లాంటి పండితులుండేవారట. వీరి తాతల కాలంలోనే ఈ అగ్రహారం దఖలు పడ్డదట. ప్రతి వ్యక్తికీ చాలినంత భూమి ఉండేది. వారందరూ తమ విద్యా వ్యాసంగంలోనే కాలంగడుపుకుంటూ, ఎవరింట్లో ఏ కార్యం వచ్చినా అందరూ కలిసి కట్టుగా నెరవేరుస్తూ ఒకడికి వచ్చిన కష్టాలు అందరూ పంచుకుంటూ ఒక్క కుటుంబంలాగే మసులుతూ వచ్చారు. రాను రాను ఏం జరిగింది? వాళ్ళ కుటుంబాలలో వ్యక్తులు బస్తీలకు ఎగబడ్డారు. క్రమంగా వాళ్ళ కుటుంబాలు భూములమ్మడం ప్రారంభించి చివరికి ఏకంగా బస్తీలలోనే కాపురాలు స్థిరపర్చుకున్నారు. ఇప్పుడు మన గ్రామంలో ఆరు మోతుబరి కుటుంబాలున్నాయి—అంటే వందెకరాలు పైగా పండించుకున్న వాళ్ళనుకో. వీళ్ళలో నలుగురు బ్రాహ్మలే. వీళ్ళందరూ ఏలా మోతుబరులయ్యారంటావు? బస్తీలకు వెళ్ళిపోయినవాళ్ళ ఆస్తులన్నీ చవకగా కొనుక్కునేనా? ఐశ్వర్యం పెరిగినకొద్దీ ఏమౌతుంది? ధర్మచింతన నశించదా? స్వార్థం పెరగదా? మత్సరబుద్ధీ ప్రతీకారవాంఛా వృద్ధికావా? ఏమంటావ్?"

"నాకు తెలియకనా శంకరం, ఇవన్నీ ఏకరువు పెడుతున్నావు?"

"విను. సందర్భం వచ్చింది గనుక చెప్పాలి. ఈ ఆరుగురిలో ఒకరినిచూస్తే ఒకరికి పడదు. పైకి పరమమిత్రులలాగు సంచరిస్తున్నా, ఒకరొకరు కనిపెడుతూనే ఉంటారు. ఒకరి కేమాత్రం ధర్మచింతకలిగి ఏ పనైనా చెయ్యడానికి పూనుకుంటే ఆ కీర్తి పుణ్యమూ వాడి కెందుకు దక్కాలని తక్కినవాళ్ళు వెంటనే వ్యూహంపన్ని ఆ పని కాకుండా చేస్తారు."

"అవునోయ్ శంకరం. నిరుడు అమ్మవారి గుడి మరమ్మత్తుకు ధర్మయ్యగారు పూనుకున్నప్పుడంతే అయిందికాదా?"

"అవునుకదా? ఎందుకు మరమ్మత్తులు కాలేదనుకున్నావు? తక్కినవాళ్ళు పూజారిని రెచ్చగొట్టి వాడిచేత అక్కర్లేదనిపించారు."

"అదా సంగతి!"

"ఇంకా విను. ఊళ్ళో గ్రామచావడి లేదు. నేను మూడువేలు ఖర్చుపెట్టి ఒక చావిడి కట్టిద్దామనుకున్నాను. స్థలంకోసం ప్రయత్నించాను. ఈ సంగతి పసికట్టి తక్కినవాళ్లు విశ్వప్రయత్నంచేసి నాకు జాగా అమ్మకుండా ఆ ఆసామీకి యెభ్భై రూపాయలు లంచమిచ్చారు. నాకు గొప్ప తమాషా పుట్టిందిసుమా. ఏంజేశా ననుకున్నావు? ఆ మూడువేలూ ఒక ఉత్తరాది మఠానికి ధర్మంచేసేశాను."

"మూడువేలే! అయ్యయ్యో, అంతడబ్బు మన గ్రామంలో ఖర్చయితే"—

"వినవోయ్ మామా. నువ్వు చీటికీమాటికీ గ్రామాంతరం వెళ్ళిపోతూ ఉంటావుగనక కొన్ని విషయాలు నీ చెవివరకూ రావు. పిల్లల పాఠశాలకు దిట్టమైన ఇల్లులేదు. ఇప్పుడున్న మకాం ఒక పాత ఆవులశాల. ఏ క్షణంలో పిల్లలమీద కూలిపోతుందో! నేను వెయ్యిరూపాయలేనా ఖర్చుపెట్టి దిట్టమయిన ఇల్లు కట్టిద్దామనుకొని, ఒక పాత ఇల్లు బేరంచేశాను, రెండువందలకు. ఈ సంగతి ఎలాగో తెలిసింది మనవాళ్ళకు. వెంటనే ఆ యింటి ఆసామీనిపిల్చి, యిల్లు అమ్మవద్దని వాడికి బోధచేసి, మరమ్మత్తు చేసుకుందికి వందరూపాయలు అప్పుకూడా పెట్టారు."

విస్సయ్యకి ఇదివరకే యీ విషయాలు చూచాయగా తెలుసును. ఈ ధోరణిలోనే ఇతరుల మాటాడడమూ విన్నాడు. తన వైదికవృత్తిలో అందరింటికీ వెళ్లుతూనే వుంటాడు. ఇప్పుడు శివశంకరం ఇతరుల మీద చెపుతున్నట్టే ప్రతి పెద్దమనిషీ తన పారమార్థిక చింతా, ఇతరుల కుత్సితబుద్ధీ ఏకరువు పెడతాడు. అందుచేత నలుగురి దగ్గరా మంచిగా బతకనేర్చిన విస్సయ్య శివశంకరంమాటలు విన్నాడుగాని వ్యాఖ్యానం చెయ్యలేదు. మరోవిషయం ఎత్తుకున్నాడు.

"పోనీ, ఏటిగట్టుమాట అలావుంచవోయ్. మన వీధిలో గోతులు కప్పివేసి, కొంచెంనించి రాళ్లు తెప్పించి రోడ్డు మరమ్మత్తు చేయించలేవటోయ్?"

"మామా. ఇంతసేపూ నా మాటలు వింటున్నా నీ పాతధోరణి మరి మానవే! మనవీధిలో ముగ్గురు పెద్దవాళ్ళున్నారు. ఎవళ్ళు రోడ్డుమరమ్మత్తుకు పూనుకోవాలో నువ్వు చెప్పు."

"బాగుందోయ్ శంకరం! ఏమను కున్నావు? మీ ముగ్గురూ కలిసి చేయించెయ్యండి."

"ఈ జన్మలో మేం ముగ్గురం కలవడం అసంభవం."

"అయితే ఇలాగే యీ వీధి గతుకులతో అఘోరిస్తూ వుండవలసిందేనా?"

"అహా! ఒకడు పూనుకుంటే తక్కిన వాళ్ళు వొప్పరు. ఊరందరూ దోమలతో యమబాధ పడుతున్నా కోనేరు మరమ్మత్తు మాట ఏమైంది?"

"తక్కిన వీధులూ ఇలాగే ఏడుస్తున్నా రోయ్ శంకరం."

"అవన్నీ శూద్రవీధులు. అవి మరమ్మత్తు చెయ్యాలంటే ముందు రోడ్డు ఆక్రమించి కట్టినసాలలన్నీ ఖాళీ చెయ్యాలి. అలా చెయ్యడానికి ఎవరికి సాహసం వుంది?"

ఇదే ధోరణిలో శివశంకరంతో ఎంతసేపు మాట్లాడినా ప్రయోజనంలేదని గ్రహించి, అతడివద్ద శెలవుతీసుకొని విస్సయ్య ఇంటికి వచ్చేశాడు.

* * *

రెండుమూడు నెలలవరకూ మెట్టూరు గ్రామం స్థితిగతులేమీ మారలేదు. ఒకనాటి ఉదయం అవతలివీధిలో ఉన్న పెద్దరయితు రంగనాయకులి యింటికి జగన్నాయకులు వచ్చాడు. అక్కడికి పదిమైళ్ళదూరంలో ఉన్న సింహాద్రిపురం గ్రామమునసబు జగన్నాయకులు. పెద్ద భూవసతితో పాటు స్వంతంగా ధాన్యంమిల్లుగల జగన్నాయకులు విశాలహృదయుడు, దైవచింతగలిగిన ధర్మదాత, సౌమ్యుడు. ఎట్టి స్వల్పఅవకాశం వచ్చినా బ్రాహ్మణ సంతర్పణలూ బీదలకు అన్నదానాలూ చేస్తూనే ఉంటాడు. అతడి న్యాయబుద్ధి చాలా నిశితమైనది. అందుచేత చుట్టుపక్కల గ్రామాలలో అనేకులతడినే మధ్యవర్తిగా నిర్ణయించుకొని తమ తగవులు తీర్చుకుంటూ ఉంటారు. తన

(62-వ పేజీ చూడండి)




ఎం. ఎస్. సుందరమ్మ

హిందువులకు మహాశివరాత్రి అతి ప్రీతికరమైన పర్వదినము. ఇది మాఘమాసములోని కృష్ణచతుర్దశినాడు వచ్చును. ఆ దినమున శివునకు మంత్రయుక్తముగ అభిషేకము చేయించుట మన హిందువులలో యెక్కువమంది కాచారమైయున్నది. అందును అగ్రవర్ణములవారి సంఖ్య యెక్కువ. ఆరోజు ఉపవసించుట, ఆరాత్రి జాగరణ చేయుట, శివునకు పూజచేసి ధ్యానించుట, అందువలన జన్మసాఫల్యము కలుగునను విశ్వాసము మన హిందువులలో అనాదిసిద్ధముగ వచ్చుచున్నది. ఈ మహాపర్వదినమునకు కారణము శివలింగోద్భవము. ఈ శివలింగోద్భవమునకు విచిత్రమైన పురాణగాథ కలదు.

ప్రళయకాలంబున మున్నీట మునిగిపోయిన వసుంధరాగోళంబునకై దేవతలు శ్రీ మహావిష్ణువును ప్రార్థింపగా విష్ణుదేవుండును లోకకళ్యాణార్థము నూరు యోజనముల పొడవుగలిగి మేరు పర్వతమును బోలిన విశాలమును, రజతవర్ణమును, తెల్లనివాడియైన దంతములును, వాడియైన గిట్టలును గలిగిన వరాహరూపంబు దాల్చి భూగోళంబు కొరకు వెదకి రసాతలంబున నీట మునిగియున్న పృథివిని తన కొమ్ముతో పైకెత్తుకొనివచ్చి యథాస్థానంబున నుంచెను. శ్వేతవరాహ రూపంబున భూదేవి నెత్తుటచే అప్పటినుండి యీకల్పమునకు శ్వేతవరాహకల్పమని పేరు వచ్చెను.

పిమ్మట శ్రీ మహావిష్ణువు ప్రళయకాలమందలి ఉపద్రవంబును దీర్చి భూదేవిని యథాస్థానమున నుంచుటవలన కలిగిన ఆయాసమును దీర్చుకొనుటకై పాలసముద్రమున శేషశాయియై పరుండి తన మనస్సునందు నాయంతటివాడు లేడనియు, భూదేవి నుద్ధరించిన తనకుతానే సాటియనియు గర్వించుచుండెను.

అంత పరమశివుని యిచ్ఛవలన మహావిష్ణువు నాభినుండి వెలువడిన కమలమునందు జన్మించిన బ్రహ్మయు మరల సృష్టియంతయు నొనర్చి శివుని మాయాజాలమునకు లోనయి తానంతటివాడు లేడనియు, అఖిల ప్రపంచంబును నిర్మించిన తనకు తానే సాటియనియు, గర్వించి తాను సృజించిన భువనంబులు చూడదలచి విలాసముగా తన హంసవాహనమెక్కి బయలుదేరెను. కొంతదూరమేగు సరికి యెదుట శేషశాయియగు శ్రీ మహావిష్ణువును గాంచి తనకెదురు వచ్చి నమస్కరింపలేదను అహంభావమంకురించి 'ఓరీ! పాలసముద్రమున శేషశయ్యపై విలాసముగ పవ్వళించిన నీవు సృష్టికర్తనగు నన్నే కనజాలకుంటివా? జగత్కర్తనగు నేను రాగా పాన్పు దిగవు. ఎదుర్కొనవు. ఎవ్వడవురా నీవు?' అని పలుకగా మహావిష్ణువు చిరునవ్వు నవ్వి 'కుమారా! ప్రళయకాలంబున నీట మునిగిన భూదేవిని వరాహరూపమెత్తి ఉద్ధరించిన నన్నే యెరుగవా? నా నాభికమలమునుండి పుట్టిన నీవు నన్నే యెరుగవా? త్రైలోక్య రక్షకుండను నేను ముక్కోటి దేవతల నమస్కారంబు లందుచుండ నీవు నాకు నమస్కరింపక నన్నెవడవని అడుగుచుంటివా?' అనెను.

ఇట్లు వాదోపవాదంబుల చెలరేగుచు ధరాతలంబునెత్తి రక్షించిన గర్వంబున విష్ణుండును, సృష్టియొనర్చిన గర్వంబున బ్రహ్మయు శివుని మాయవలనైన అహంభావంబుల నీ ప్రపంచమంతయు తనదే యనుకొని యెవరికివారే గొప్పవనుకొనుచు పరస్పరము తగ్గుండలేక రజోగుణ ప్రవృత్తిచే చిట్టచివరకు యిరువురును యుద్ధంబునకు గడంగిరి.

అట్లు ఇరువురును యుద్ధమునకు సిద్ధులైరి. అందు విష్ణువు శార్ఙ్గము నెక్కు పెట్టెను. బ్రహ్మయు గాండీవంబు నెక్కు పెట్టెను. ఒకరిపై నొకరు వదలుచున్న బాణపరంపర విశ్వమంతయునిండి సూర్యుని కిరణములను చొరనీయక అంతట అంధకారము అలముకొనునట్లు చేయుచుండెను.

విష్ణువు కడకు విసిగి ఎదుర్కొన శక్యంబుగాని చక్రంబును బ్రహ్మపై విసరెను. బ్రహ్మయు బ్రహ్మశిరోనామకమను అస్త్రమును విడువగా ఆ అస్త్రము ఆ విష్ణుచక్రమును మ్రింగివైచెను. అంత హరి పాశుపతాస్త్రంబును విడువ, బ్రహ్మయు పాశుపతాస్త్రంబును విడిచెను. అట్లు పురాణపురుషులచే విడువబడిన రెండు పాశుపతాస్త్రంబులును ఒకదానినొకటి ఢీకొనుచు దిక్కులు పిక్కటిల్లెను. త్రిభువనములు వణకజొచ్చెను. ముక్కోటి దేవతలు తల్లడమందిరి. సూర్యచంద్రులు గతులుతప్పిరి. ఎల్లరును మరియొక ప్రళయమని భయమందిరి.

తన మాయాజాలమున మునిగి అహంభావమున మునిగి తన్నెరుంగక తమలో తామే



గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలోని కోటీశ్వరుని కొండవద్ద మహాశివరాత్రినాడుజరిగే ప్రభలసంబరం

గొప్పవారిమని కుమ్ములాడు బ్రహ్మ విష్ణువులను పరికించుచున్నవాడై పరమేశ్వరుడు తన శక్తినిచూపి వారి జ్ఞాననేత్రమును తెరువ దలచి ఆదిమధ్యాంతములు లేనట్టియు, పెరుగుటయు, తరుగుటయు లేనట్టియు, అగ్నిజ్వాలలచే ఆవరింపబడినట్టియు, నొక లింగరూపమున వారిరువురి మధ్యను ఆవిర్భవించెను. ఆ లింగోద్భవ సమయమే మాఘ కృష్ణ చతుర్దశినాటి మధ్యరాత్రి. ఆ దినము నే మనము మహాశివరాత్రి యనుచున్నాము.

అంత నా యిరువురును పోరు మాని ఆ లింగమునుజూచి ఆశ్చర్యచకితులైరి. జయ జయ ధ్వనులతో సనకాదియోగీంద్రులు శివుని నుతించిరి. దిక్కులనిండ దుందుభి నాదంబులు మారుమ్రోగను. అంత పాశుపతాస్త్రంబులు రెండును తమ తమ శక్తులుడిగి చల్లబడెను. అంత నా అగ్నిచే చుట్టబడిన స్తంభమునందు నీడవలె శివుని ప్రతిరూపము కానబడెను.

అప్పటికిని తమ అజ్ఞానాంధకారమునుండి బయటపడలేని ఆ పురాణపురుషులిద్దరు శివలీలలను కనుగొనలేక 'ఈ స్తంభమెట్లు వచ్చెను. ఇట్లు వచ్చుటకు కారణ మేమి? దీని కాద్యంతములు కన్పించుటలేదేమి?' అను ఆలోచనలతో ఆ యిరువురు సతిమత మగుచు విష్ణువు ఆ లింగము యొక్క మూలము కనుగొనుటకును, బ్రహ్మ ఆ లింగముయొక్క తల భాగము గనుగొనుటకును ఒడంబడిక బయలు దేరిరి

విష్ణువరాహరూపంబునుదాల్చి భూమిని త్రవ్వుకొనుచు లోనికిని, బ్రహ్మ హంస రూపము దాల్చి పైకిని పోవుచుండిరి.

అట్లా యిరువురును యెంతదూర మెంత కాలము పోయినను ఆ లింగముయొక్క ఆద్యంతములు గనజాలకుండిరి. విసిగి వేసారి యిరువురును వెనుదిరిగి యథాస్థానమున కేతెంచి, స్తంభమునందు నీడ మాత్రముగా గోచరించుచున్న పరమశివుని జాడగాంచి యిది యంతయు యాశివుని మహిమయే యని గుర్తెరింగి పరిపరి విధముల యిరువురును యీశ్వరుని ప్రార్థించిరి.

అప్పుడా స్తంభమునుండి మరల ఓంకార శబ్దము వినబడంజొచ్చెను. కొద్దిక్షణములలో ఆ ఓంకార శబ్దము అకార ఉకార మకారములను మూడు భాగములై ఆ స్తంభమునకు కుడిచేతివైపు అకారమును, యెడమచేతివైపు ఉకారమును, మధ్యగా స్తంభంబుపై మకారమును గోచరముగు చుండెను. ఆ పైన స్ఫటిక లింగమునుండి కరుణాసముద్రుడగు పరమ శివుడు కోటిసూర్య ప్రకాశంబైన కాంతి



శ్రీశైలనందీశ్వరుడు



శ్రీశైలఆలయ ఆవరణంలోని సహస్రలింగేశ్వరుడు




## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

ఉ. లోకములందుఁ బొందుఁ దమ లందు మహాగుణరత్నపూర్ణర
త్నాకరుఁ డత్యుదారమతి సంధుఁడు నైనను నన్ను రాజుఁగాఁ
జేకొని నాకు భక్తిఁ బని సేయుచు సర్వజగజ్జిగీషుఁడై
యీకురువంశరాజ్యభర మింతయుఁ దాల్చెఁ బరాక్రమంబునన్.

క. పరచక్రపతులచే భీకరుఁడై ధనరాసు లడిమి కప్పము గొని చె
చ్చెరఁ దెచ్చి యిచ్చి నన్నును, భరతకులశ్రేష్ఠుఁ డనిచె బహుయజ్ఞంబుల్.

వ. మఱియు వానికంటె గుణంబుల మిక్కిలి యయి జనంబులకు ననురక్తులై పరఁగుచున్న పాండురాజకుమారుల నెవ్విధంబునఁ బాపనేర్తు నని దుఃఖించిన ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డిట్లనియె.

సీ. పైతృకం బగులక్ష్మి పాండుభూపతి మున్న, తాల్పుటఁ జేసి తత్తనయుఁ డైన
ధర్మజుఁ డిప్పుడు దాల్చిన నాతని, తనయుండు మఱి దానిఁ దాల్చు మీఁద
నిప్పాటఁ బాండువంశేశుల వసుమతి, రాజ్యస్థు లగుదురు రాజ్యమునకుఁ
బరువడి మే మింతఁ బాసిన మాపుత్త్ర, పౌత్త్రవర్గంబునుఁ బాయు నింక

ఆ. సౌతులఁ గొలిచి కుడువ నోప మే మట్లు గా, కుంత మమ్ముఁ జేయ నోపు దేని
పాండురాజులోంటి భక్తియు నప్పాండు, తనయులందు దయయుఁ దలఁపకుండు.

వ. ఈ రాజ్యంబు మొదలింటంగోలె భవదీయం బయినం బ్రకృతిజనులు వశ్యులు గాకున్నను గ్రమాగతం బయి మాకు నప్రయత్నలభ్యం బగుఁ దొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటం జేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబ వలతురు దాని నెఱింగికాదె దానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు సేయుచు నుండుదు నిందులదుష్టజనుల పక్షపాతవచనంబు లుడుగునంతకు నుపాయంబున గొంతిని బాండవులను దదీయభృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకుం బుత్తము మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱివార లిందులకు వత్తురనిన దుర్యోధనునకు ధృతరాష్ట్రుం డిట్లనియె

తరువో. ఏ నిట్లు ప్రొద్దు నా యెడలోఁ దలంతు నీ యభిప్రాయంబు యిది దారుణంబు
గాన వాకునకుఁ జెల్లన తేర నోపఁ గడఁగి పాండవుల నేకత మెట్లు లనుపఁ
గా నగు మఱి దీని గాంగేయవిదుర కలశజాశ్వత్థామ గౌతముల్ బుద్ధి
గా నొకంబడుమరి కాదయ్య యనినఁ గౌరవజ్యేష్ఠుండు ఘనుఁ డిట్టులనియె.

వ. భవదనుజ్ఞాగౌరవంబున గాంగేయాదులు దీనికి నొడంబడుదురు వారు కౌరవుల కెల్ల సములై యుండియు నావారల యెట్లనిన నశ్వత్థామ నాకిష్టుం డగుటంజేసి పుత్త్రస్నేహంబున ద్రోణుండు నన్ను విడువఁడు భారద్వాజుని భాగినేయుం డింకాయనేరయుంజేసి కృపాచార్యుండును నాయొద్దన యుండు మఱి భీష్ముండు మధ్యస్థుం డగుటఁ బాండవులం బరిగ్రహింపఁడు విదురుండు పాండవపక్షపాతి యయ్యును నొక్కరుండు నాకహితంబు సేయ నోపండు గావున నిక్కార్యంబున దోషంబు లేదు వినిద్రకరణం బయిన నాహృదయశల్యంబు నుద్ధరింపు మని ధృతరాష్ట్రు నెట్టకేనియు నొడంబఱిచి దుర్యోధనుం డప్పుడు.

క. వలనుగల మంత్రివరులం, బిలిచి పృథానందనులకుఁ బ్రియముగఁ బోరి
మ్ముల వారణావతంబును, వెలయఁగ, బొగడుండు వారు విని తగుల నడన్.

**వ.** అనిపంచిన వారును వారణావతంబు ననవరతసురభికుసుమఫలభారనమ్రశాఖావిశాలతరువనరేఖాలంకృతం బనియును వనజలకేళీకందుక మృగయాది వివిధ విహారహారి ప్రదేశాభిశోభితం బనియును నవసుధాధౌతసౌధసుధాకరనికర ప్రభాపటల ప్రధ్వంసితాసితపక్షదోషం బనియును నిరస్తదోషానుషంగ మంగళమహారత్నరాజివిరాజిత విపుల విపణివీథీవిహసితాలకా విలాసం బనియును మనోరమానేక సుఖానుభోగభాగి మహాభాగజనసమృద్ధం బనియును బుణ్య నదీప్రవాహశోభితం బనియును వర్ణించి యప్పురంబునందు పాండునందనుల జాతకౌతూహలచిత్తులం జేసియున్నఁ గొండొకకాలంబునకు ధృతరాష్ట్రుండు దుర్యోధనదుష్టవచన ప్రబోధితుం డయి యొక్కనాఁడు

## ధృతరాష్ట్రుండు పాండవుల వారణావత నగరంబునకుం బోవ నియమించుట

**ఉ.** పాండుకుమారులం బిలువఁ బంచి సుహృన్నివహంబునొద్ద న
ప్పాండుఁ దలంచి నిర్గళిత బాష్పకణాళికపోలయుగ్ముఁడై
పాండుమహీశుకంటె నతి భక్తుల మిమ్మొకఁ జేను బంచెదం
బాండుయశోర్థులార యిది పథ్యము గాఁగఁ దలంపుఁ డాత్మలోన్.

**క.** విదితంబుగఁ బుణ్యామర, నదీ సమీపమున వారణావతనగరం
బది సర్వసుఖాస్పద మని, పదలక వర్ణింతు రెల్ల వారును దానిన్.

**క.** మీరును గుంతియు సహాపరి, వారమహామాత్యభృత్య వర్గుల రై నా
నారాజ్యలీలతోఁ జని, సారమతిం జేయుఁ డందు సతతోత్సవముల్.

**వ.** పశుపతినివాసం బయినయప్పుణ్యస్థానంబునం బాండుహితంబుగా నగణ్యగోహిరణ్యాదిమహావదానంబుల బ్రాహ్మణ తర్పణంబు సేసి యందుఁ గొండొక కాలంబుండివచ్చునది యనిపంచిన వల్లెయని పాండవులు గాంధారి ధృతరాష్ట్రులకు మ్రొక్కి వీడ్కొని దుర్యోధనాదుల నందఱం బ్రియపూర్వకంబుగ సంభావించి భీష్మద్రోణవిదురకృపాదులకు మ్రొక్కి యనేక వృద్ధబ్రాహ్మణులకు నమస్కారంబు సేసి వారలవలన దీర్ఘాయురారోగ్య స్వస్తివచనంబులతోఁ బునర్దర్శనం బయ్యెడుమని దీవనలు సేకొనుచు జననీసహితంబుగా వారణావతంబునకు గమనోన్ముఖు లయిన.

**క.** తనవగచినకార్యము దీరఁ గొనుటకు ధృతరాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురో
చనుఁ బిలిపించి రహస్యంబున వానికిఁ గరము నెయ్యమున నిట్లనియెన్.

**తరలము.** అలఘుతేజుల వారణావత మన్పురంబునఁ బాండవే
యులఁ బ్రియంబున నుండఁ బంచె గుణోత్తరుండు కురుప్రభుం
డలయ కిప్పుడ నీవు మున్ చని యందు వారికి నుండఁగా
నిలయముల్ రచియింపు నీదగు నేర్పుఁ జూతము చెచ్చెరన్.

**వ.** నాకుం బరమవిశ్వాసవిషయుండవీ వొక్కరుండవిది యనన్య విషయంబయిన కార్యంబు గాదనక నీవ దీనిం జేయవలయు వాయుజవంబు లయిన రాసభంబులం బూనినయరదం బెక్కి నేఁడ చని వారణావతంబున లాక్షాసర్జకరసమిశ్రంబై ఘృత తైలార్ద్రంబయిన మృత్తికాపుంజంబున నొక్క చతుశ్శాలంబు విశాలంబుగా నాయుధశాల సమీపంబున మనోహరంబుగా సవిరళసుధాధవళితంబుగా నిర్మించి యందుఁ బాండవుల నునిచి వారలేమఱి నమ్మి కొండొకకాలంబుండ నెవ్వరు నెఱుంగకుండ నిమ్మయినయవసరంబునం దద్గృహద్వారంబునందు దహనంబు దరికొలిపి పగరపంచత్వం బెఱింగి రమ్ము.

**క.** ఈకార్యసిద్ధి యగుడును, నీకతమున నఖలధారుణీరాజ్యము నా
కేకాధిష్ఠిత మగు నిది, నీకును నిత్యోపభోగ నిలయము గాదే.

**వ.** అని పంచినం బురోచనుం డతిత్వరితగతి నరిగి దుర్యోధనుకఱపినరూపున వారణావతంబున లాక్షాగృహంబు రచియించు చుండె నిట యుధిష్ఠిర భీమార్జునయములుం గ్రమంబునం దొల్లి షోడశ పంచదశ చతుర్దశత్రయోదశ వర్షజాతులయి శతశృంగంబున నుండి హస్తిపురంబునకు వచ్చి యందుఁ గౌరవులం గలసి యస్త్రవిద్యలం గఱచు చుంబదుమూఁడేండ్లుండియపుడు ధృతరాష్ట్రుని యోగంబున వారణావతంబునకు జననీసహితంబుగాఁ బోవ సమకట్టి మహాజవవత్త్వసమేతంబు లయినహయంబులం బూనినరథంబు లెక్కి ధనుర్ధరు లయి హస్తిపురంబు వెలువడు నపు డప్పురంబునంగల బ్రాహ్మణక్షత్త్రియ ప్రముఖానేక జనంబులు శోకసంతప్తహృదయులయి.

# ఆద్యంతాలనడుమ అరవింద

పోరంకి దక్షిణామూర్తి

పట్టుపావడా, పల్చటిఓణీ, పచ్చటి ముఖానికి ఎర్రటి పెదవులూ—సన్నగా, నాజూకుగ్గా నిలుచొని చూసింది.

ప్రసాదరావు కోసం చాలా కాలానికి మళ్ళీ వాళ్ళింట్లో అడుగుపెట్టాను. ఆ యిల్లు నిండుగా నవ్వుతున్నట్లు కనిపించింది.

వయ్యారంగా సిగ్గుపడుతూ మళ్ళీ వచ్చినట్లుగానే వెళ్ళిపోయింది.

మరుక్షణంలో ప్రసాదరావు వచ్చాడు.

"ఏవోయ్ దక్షూ! ఏమిటిలా ఊడిపడ్డావ్? రారా. కూర్చో! ఏమిటి విశేషాలు? ఎప్పుడొచ్చావు? ఉత్తరం ముక్కైనా వ్రాయలేదేం?"

వర్షపుజల్లులా ప్రశ్నలు కురిపించాడు.

"దక్షయ్య వొచ్చాడు యిలారావే అమ్మా!" అంటూ వాళ్ళ అమ్మగారిని పిలిచాడు. నాన్నగారూ, తమ్ముడూ, యింట్లో మిగిలిన వాళ్ళందరూ ఒక్కుమ్మడిగా చొచ్చుకొని వచ్చారు. మావూరి విశేషాలూ, చుట్టాలూ, స్నేహితులూ అందరిగురించీ ఎన్నో సంగతులు మాట్లాడుకున్నాం. ఇంత కాలానికి మళ్ళీ వెళ్ళిన్నా! కడుపు నిండినట్లయింది.

అతని చెల్లెలు కాఫీ తెచ్చియిచ్చింది. ఇచ్చి వెళ్ళిపోబోయింది. పోబోతూంటే ప్రసాదరావు ఆమె చెయ్యిపట్టుకుని యిటు లాగాడు. నవ్వుతూ మావైపు తిరిగింది.

"వీడెవరో తెలుసుటే అరవిందా?"

తెలియదన్నట్టు చూసింది.

"ఎప్పుడూ చూడలేదూ?"

నవ్వులోనే లేదంది. ఆ నవ్వు గలగలమన్నది.

"నువ్వోసారి సైకిలు మీదనుంచి పడ్డావు జ్ఞాపకం ఉందా?"

"ఆఁ! జ్ఞాపకం వచ్చింది. ఈయనే నన్ను పడేశారు. మోచేతిమీద యింకా మచ్చకూడా ఉంది."

ఘొల్లున నవ్వుకున్నాము. నవ్వుతూనే అరవిందా వెళ్ళింది.

"ఆ డొక్కు సైకిల్మీద నువ్వు స్వారీ చేస్తున్నావా ప్రయాణాలు యింకా?"

"లేదు. ఈ మధ్య హంబర్ ఒకటి కొన్నాను. పాతదాన్ని మా తమ్ముడు లొంగదీసుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు."

"బాగానేఉంది! ఇంకేమిటి విశేషాలు?"

"ఏముంటాయి నాయనా? నువ్వే ఏమయినా పడేస్తావని జాగ్రత్త చేసుకొని వచ్చాను."

"నీ చేతులు మునుపటికంటె సైజు ఏమీ పెరిగినట్లు కనబడవే!"

"పదేళ్ళలో మీ యిల్లు యెంత మారిపోయిందిరా బాబీ!"

"మనుషులే మారిపోతూ వుంటే యింకా యిల్లంటా-వేమిటోయ్?"

"అప్పుడు నాకెరుకుంటే అరవింద! ఇప్పుడు యెంత మారిపోయిందో చూడు. ఇది పుట్టిన రోజున అర్ధరాత్రి మంత్రసానికోసం వెళ్ళాం జ్ఞాపకం ఉందా?"

"అవును"

"నవ్వొస్తోంటే నాకు నాల్గో కేంటూరా పట్టింది!"

చక్కని మాటల్లో అది చెప్పలేక గిజగిజలాడేవాడిని. తిలవేశ్యలైతే నేమి గాక రంభా, ఊర్వశులతో ఆమెను పోల్చడం చాలా చిన్నతనం. అందమున్నది, ఇలా ఉన్నది. అని నిర్ణయించి చెప్పడానికి వీలు లేనిది. అది చూసేవాడి కళ్ళలో ఉంటుంది. కేవలం సినిమాలో చక్కని బొమ్మను చూసినట్లు కాదు. ఇది చూడడానికి అంతర్ దృష్టి కావాలి. నఖశిఖ పర్యంతమూ జరిగే సప్తవర్ణాల కాంతి సమ్మేళనమూ, ఆ సందర్భాన్ని ఆయా అంగాలలో లిగింపలేగా, వేరువేరుగా పాదవే విశ్లేషణా; సాధారణ రక్తమాంసాలతో నిండిన ఆ శరీరంలోని అవయవాల్లో—మనిషి మనసును పట్టుకొని లాగి, నిరంతరమూ ఉత్సాహపరచి, ఎంత చూచినా, తాకినా, అనుభవించినా తరగనిది, తనివి తీరనిదీ దాహం పుట్టించి, రెట్టించగలిగే చక్కని ఒక పొందికా; ఆ మనిషిని మైమరచేటట్లు చేయగలగాలి. అట్లా చేయగలిగే శక్తి ఆ వస్తువుకి ఎప్పుడూ ఉంటుంది. కాని అది చూడగలిగిన శక్తి మనకు ఉండదు. నూరు రూపాయల నోటు చిన్న పిల్లవాడి చేతికి యిస్తే మామూలుగానే అనుకుంటాడు. కాని దాని విలువ మనకి మాత్రం ఎప్పుడూ స్ఫురిస్తూనే ఉంటుంగ!

ప్రొద్దుటే అరవింద యింటికి వెళ్లాను. తన బంధువులందరినీ ఒకేసారి చూసినంత సంతోషం కలిగింది ఆమెకు. అందమైన రేడియో సెట్టూ, పెద్దపిల్లకి చిన్న సైకిలూ, మిత్రాడికి ఉంగరమూ చూపించారు. వాళ్ళ పిల్లల్లో పెద్దపిల్ల మూగదట. నాకు చాలా జాలికలిగింది. అయ్యో తల్లిపోలిక! ఆ లోటు లేకుండా ఉంటే భగవంతుడికి నష్టమేమి కలిగిందో! అఫీసు ప్రమోషన్ల గురించి, పంచవర్ష ప్రణాళిక గురించి అతను చాలా సేపు మాట్లాడాడు. ఒకపూట వాళ్ళ యింట్లో గడిపి, ఆ సాయంత్రమే మళ్ళీ మా ఊరికి బయలుదేరాను.

పెళ్లి నాకు తెలియకుండా అయిపోయిందన్న నిర్లక్ష్యం వల్లనేమో అరవింద అంత సుఖమైన సంసారం గడుపుతోందని అంతకుముందు నేను ఊహించలేకపోయాను. చాలినంత ఆదాయమూ, అనుకూలవతియైన భర్తా, నిండయిన సంసారమూ అందరికీ లభ్యం కావు. అక్కడికీ ఆ పెద్దపిల్లగురించి ఆమెలో దిగులు కనిపించక పోలేదు. ఇరవైయేళ్ళక్రితం నేను ఊహించిన అరవిందకీ, యీమెకీ చాలా భేదం ఉంది. ఆమె రంగు చాలా వన్నె తిరిగింది. వన్నెగా బొద్దుగా ఉన్నది. అయినా వాళ్ళకుటుంబం నాకేమీ యిబ్బంది లేనిగానే కనిపించింది.

ఇంటికి వెళ్ళాక ఆమెకోసం ఉత్తరం వ్రాశాను. వాళ్ళ ఆతిథ్యానికి అభినందించానని అప్పుడప్పుడు యోగక్షేమాలు వ్రాస్తూ ఉండమనిన్నీ.

చూచాయగా అతను ఒకసారి వ్రాశాడు. అరవిందకు అన్నకోశంలో ఏదో జబ్బు బయలుదేరిందని!

కొంపతీసి 'గాస్ట్రిక్ అల్సర్' కాదు కదా. అని భయపడాను. అది యిదే అయింది కొంతకాలం హోమియోపతీ మందులు వాడారట. చివరికి ఆ పంచదార మంత్రల్లో నమ్మకం కుదరక యింగ్లీషు మందులు యిస్తున్నారట. 'ఎక్స్ రే' ఫోటో తీసేవరకూ ఏదైనది స్పష్టంగా తెలిసిందికాదట. అది చాలా ప్రమాదమయిన జబ్బే అయినా, లేతలో ఉంది కనుక సరియైన వైద్యం చేయిస్తే తగ్గకపోదని నాకెందుకో నమ్మకం కలిగింది.

అరవిందకి అలాటి జబ్బులువస్తాయని నేనెప్పుడూ ఊహించలేదు. శరీరతత్వం ఆరోగ్యమయినది. అయినా ఏ ఘడియకు ఏది అనుభవించాలో నేనెవర్ని నిర్ణయించడానికి!

మంచి వైద్యమే చేయిస్తున్నారనీ, తగ్గుముఖం పట్టిందనీ వ్రాశాడు అతను. సంతోషించాను.

ఎప్పుడూ లేనిది ఒక రోజున దల్లగా ఉత్తరం ఒకటి వ్రాశాడు ప్రసాదం.

అరవింద బావిలోపడి మరణించిందట!

తల్లక్రిందులయ్యాను.

వెంటనే హైదరాబాదుకి ప్రయాణం కట్టాను. ఇంకో రెండుపనులు కల్పించుకొని.

అరవింద భర్తను విరగగొట్టినట్లుంది!

ఆమె ఆత్మహత్యకు ప్రబలమైన కారణాలు నాకేమీ తెలియవు. యాభయ్యోపడిలో, నా మెదడుకూడా సరిగా పనిచేయలేదు. అతను చెప్పినది చాలా ఆశ్చర్యంగానే ఉంది.

ఆ రోజు మధ్యాహ్నం పదిగంటలకు—పేషెంట్లందరూ చాలావరకూ వెళ్ళిపోయారనీ, ఇంకొందరే ఉండేవారనీ, అంతవరకూ ఇంట్లో తిరగా—హాస్పిటల్ కు మందు కోసం వెళ్ళిందట! ఆమె కూడా పెద్ద పిల్ల ఉన్నది. సాయంత్రం అయినా ఆమె యింట్లో కనిపించలేదు. రాత్రి పదిగంటలకు యింటికి అవతల బావిలో శవం కన్పించిందట!

చాలా అగమ్యంగా ఉంది!

నేను వెళ్ళిన రోజు రాత్రే మూగపిల్లకి ఘోరమైన జ్వరం కాసింది. తండ్రి వెళ్లి డాక్టరును తీసుకుని వచ్చాడు. అయనను చూసి ముఖం త్రిప్పుకుంది, ఆ పిల్ల. నోటిమీద చెయ్యి వేసి ఫెడేలున త్రోసేసింది. కోట్లో మందుసీసా కిందపడి పుటుక్కున పెంకులైపోయింది. ఉక్రోశించింది. వాళ్ళను తలవంచుకొని వెళ్ళిపోయాడు. నయాన్నీ, భయాన్నీ దానిని ఒప్పించడానికి ప్రయత్నం కూడా చెయ్యలేదు.

మర్నాటికి ఆ అమ్మాయి జ్వరం చాలా వరకూ తగ్గింది. బహుశా అది తల్లికోసం బెంగా, భయమూవల్ల వచ్చినదేనా అనుకున్నాను. ఆమె తండ్రి హాస్పిటల్ కిపోయి మళ్ళీ మందు తెచ్చాడు. ఈసారి ఆ పిల్ల సీసాయే గిరవాటేసింది. అతను విసుక్కున్నాడు. నేను మంచం దగ్గరకెళ్ళి కూర్చొని తల నిమిరాను. నుదిటిమీద చెమటబొట్లు మెల్లిగా తుడిచాను.

ఆ అమ్మాయికి మాటలురావు. మన మాటలు మాత్రం అర్థం అవుతాయి. కాని వినకట్లే నటిస్తుంది. 'మందు ఎందుకు పోశావని' సంజ్ఞచేసి ఆమె భాషలోనే అడిగాను. చేతులు వెడల్పుగానూ, ఎత్తుగా చూపించి, యీ చెవిలోనుంచి ఆ చెవిలోకి సైతిస్కోపు చూపెట్టి, కీకీ మని యేదో అరచి, నేలమీద తుపుక్కున ఉమ్మేసింది.

అప్పుడర్థమైంది. డాక్టరుమీద ఆమెకి అమితమైన కోపం ఉందని! ఇంత చిన్న పిల్లకు అంతటి కోపమా? అయితే ఆ కోపానికి కారణం ఏమై ఉంటుందా అని ఆలోచించాను. నాకు అంతు పట్టలేదు. అరవిందకు ఉండినంత ఆత్మాభిమానమూ దీనికి ఉన్నది! సంగతేమిటని ఆ పిల్ల తండ్రినీ అడిగాను. అతనూ తెలియదన్నాడు. ఎట్లాగయినా దానిని ఒప్పించి మందు త్రాగించాలనుకున్నాను. బతిమాలాను. లాలనచేశాను. మందు త్రాగితే రూపాయి యిస్తానన్నాను. ససేమిరా, వినలేదు.

చేతితో ఏదో సంజ్ఞలు చేసింది. అమ్మ ఫోటో కేసి కూడా చూపెట్టింది. నా చేయి పట్టుకొని లాగి, బుగ్గమీద ముద్దుపెట్టుకున్నది. దిండుమీద తలదూర్చి వెక్కి వెక్కి యేడ్చింది.

మూగపిల్ల చేష్టలకీ, అరవింద మరణానికీ ఏదో సంబంధం లీలగా స్ఫురించింది. ★

# ఇనస్పెక్టరయ్యా ఇంతే పిసరయ్యా

ఓసారి ఏమయిందంటే, ఓ స్కూలుకి ఓ ఇనస్పెక్టరుగారు వచ్చేరుట. ఆయనేం ఇలాంటి అలాంటి 'అరటిక్కాయ్లుగారు'— కాదు. కన్నెత్తి చూడవలసిన నిలువెత్తు మనిషి. మహానుభావుడూ, ఆజానుబాహుడూను. పిత్రు కార్యకలాపమంతా ముగిశాక మాస్టార్లనీ, గురువుల్నీ ఓచోట కూచోబెట్టి 'మీరు మా పిల్లలకో సందేశం ఇవ్వాలి' అన్నారు హెడ్మాస్టరుగారు.

ఇనస్పెక్టరుగారు 'స్పెషల్ దోశ' లాంటి సందేశం ఇచ్చారు.

ఫైనలుగా స్కూలు విడిచిపెట్టే స్కూలు ఫైనలు విద్యార్థులందరికీ ఒక్కమాట. చూడండి. పిల్లలూ, మహావేగంగా 'మార్చి' చేసుకుంటూ మార్చి పరీక్షలు మీ మీదకు వస్తున్నాయి. మీరు ఇప్పుడు చదివిన ప్రశ్నకే మార్చి మార్చి మార్చిలో ఇస్తారు. ఏమాత్రం ఏమార్చినా అన్నీ మర్చిపోయి చెమర్చి దక్కాక వస్తారు. ఇలాంటప్పుడు ఎంతో ఏకాగ్రత అవసరం. ఒకే దృష్టి పెట్టుకుని ధనుర్విద్య నేర్చుకున్నాడు కాబట్టే ఎరుకల బాలుడు ఏకలవ్యుడు అన్నారు...'

'...అవునవును. మా అన్నయ్య స్నేహితుడు యం. వి. రమణ ఒకటే దృష్టి పెట్టుకుని ఒకే పిల్లను ప్రేమించి ఎన్ని కష్టాలు వచ్చినా, ఆమెనే పెళ్ళి చేసుకున్నాడు. అందుకే కాలేజీలో అతన్ని అందరూ 'ఏకలవ్-యుడు' అని పిలుస్తారు!' అందొక కుర్రకాడు కొంటె సోము! అందరూ నవ్వేరు.

'సైలెన్స్' అన్నారు, ఆమాట అనకుండా పాఠం చెప్పలేని మేష్టారు. ఇనస్పెక్టరుగారు కూడా తెగనవ్వి...మళ్లీ అందుకున్నారు.

'ఏకలవ్యుడు మాట వచ్చింది, కాబట్టి అర్జునుడి గొప్పదనం కూడా చెబుతాను. ఓసారి ద్రోణాచార్యులవారు శిష్యులందరికీ విలువిద్య నేర్పుతున్నారు. దూరంగా చెట్టు మీద ఒక పక్షిబొమ్మ పెట్టి బాణంతో దాని తల ఎగరగొట్టమన్నారు. మొట్టమొదట ధర్మరాజు బాణం వేస్తూంటే 'ఒరేయ్ ధర్మిగా, నీకేం కనిపిస్తోందిరా?' అని అడిగేరు. 'అదేమిటి మేష్టారూ, నన్ను 'లెండ్ ఫెలో' కింద కట్టేరూ...పెద్ద చెట్టూ, చిన్న కొమ్మా, బుల్లి పక్షీ'...

'ఇక చాలించు...నీకురా ఉద్యోగనం!'

'వీడికంటె నాకు విశాలదృష్టి ఉందిగురూ! ఒక్క చెట్టేనా...చుట్టూ అడవీ, పక్కని సరస్సూ, దూరంగా కొండలూ'...

ద్రోణాచార్యులు నవ్వుకొన్నాడు. మిగిలిన శిష్యుల్ని ఎవర్నడిగినా ఇంచుమించు ఇల్లాగే చెప్పేరు. ఆఖర్ని అర్జునుణ్ణి అడిగారు.

## అవసరాల రామకృష్ణారావు

'అబ్బాయ్ అర్జునా, నీకేం కనిపిస్తోంది?'

'నాకు పక్షితల ఒక్కటే కనిపిస్తోంది. మేష్టారూ, ఇంకేం కనిపించడం లేదు'

'శభాష్ బేటా. అదీమాట!' అని మెచ్చుకున్నారు బియ్యేడీ పాసవని ద్రోణాచార్యులు గారు.

ఈ కథ మీలో చాలామందికి తెలిసే ఉంటుంది. ఇది ఇక్కడ ఎందుకు చెప్పేనంటే మీ పరీక్షలు పట్టుమని పదిరోజులు కూడా లేవు. మీరు సాటిలేని మీ ప్రవర్తనవల్ల పాఠశాలకూ దేశానికీ ధరించలేని కీర్తి ప్రతిష్ఠలు తీసుకురావడం తరువాతిమాట. డిగ్రీని బట్టి చదువూ, ధనాన్ని బట్టి సుఖమూ కొలిచే ఈ రోజుల్లో ప్యాసయిన పెర్సెంటేజిని బట్టి స్కూలు గొప్పదనం కొలిచారంటే పెద్ద ఆశ్చర్యమేమీ లేదు. అంచేత నేను చెప్పేదేమిటంటే ప్రస్తుతం మీ గమ్యం, లక్ష్యం, సర్వం ఒక్కటే. అదేమిటంటే పబ్లిక్ పరీక్షలో పాసవడమే. ఆ ప్యాసవడానికి ఒడ్డూ పొడుగూగాని, తెలివితేటాగాని కేవలం అనవసరం. పదహారు రూపాయల పరీక్ష ఫీజు కట్టిన ప్రతివాడికీ రూపాయికి పదహారణాలా ప్యాసయే అధికారం ఉంది. ఈ నాలుగురోజులూ, రాత్రి పగలూ, అనకుండా చదువుతే 'ఈజీ' గా ప్యాసౌతారు. దుక్కంత ఏనుగు ముక్కంత సింహాన్ని చూసి ఎందుకు జడుస్తుందంటారూ? సింహం పసిగట్టడానికి శత్రువుని పట్టడానికి తీసుకునే కాలం ఏనుగ దోమలు తోలుకోడానికీ, వీపు గోక్కోడానికీ ఉపయోగిస్తుంది. ఏమయితేను ఉన్న అంత ఏనుగ ఏకాగ్రత ఉన్న ఇంత సింహం దగ్గిర ఓడిపోయిందే! పట్టుదలా, ఏకాగ్రతా ఉంటే పరీక్ష పాసవడానికి ఒక్కరోజు చాలదా? ఆ ఏకదృష్టి మీరందరూ అలవర్చుకోవాలి. మీరు పబ్లిక్ పరీక్షకి వెళుతున్నారు. తక్కిన విషయాలు మీకెందుకు? ఇప్పుడు మీరు ఏ స్థితిలో ఉన్నారంటే—

'పబ్లిక్ పరీక్ష కనిపిస్తోందా?'

'ఓ'

'డిటెక్టివ్ నవల్సు కనిపిస్తున్నాయా?'

'ఓ'

'సినిమా పత్రికలు కనిపిస్తున్నాయా?'

'ఓ'

'సిగరెట్ బీడీలు కనిపిస్తున్నాయా?'

'ఓ'

'బిళ్లపేకలు కనిపిస్తున్నాయా?'

'ఓ'

'సినిమాలాబ్బాయ్ కొత్తని, కనిపిస్తున్నాయా?'

'ఓ'

'చివరి బెంచీ అమ్మాయి కొత్త చీర కొనుక్కుంది, కనిపిస్తోందా?'

'ఓ'...

ఇలా ఎన్నైనా చెప్పొచ్చు. ఇలా మీరు జవాబు చెప్పే స్థితిలో ఉంటే లాభం లేదు. పరీక్షమీద మనస్సు లగ్నం చేసిన విద్యార్థికి

ఇకేమీ కనిపించకూడదు. కనీసం ఈ కొద్ది కాలంలో అయినా పరీక్షకు సంబంధించిన విషయాలమీద తప్ప—ఇక దేని మీదా దృష్టి ఉండకూడదు. అందులో మీ సినిమా పిచ్చి వెలకొల్ల ప్రమాణం దాటిపోయింది. నేను ఒక పుస్తకంలో చదివిన చిన్న కథ చెబుతాను. "ఓ సారి పేరుకెక్కిన ఒకనటుడికి అతన్ని త్రికరణ శుద్ధిగా ప్రేమించిన కొందరు విద్యార్థి ప్రేక్షకులు ఉత్తరం రాశారుట. 'నటకాగ్రణీ!... అన్నిటి మాటకేం గాని సముద్రతరంగాల్లా ఉన్న మీ క్రాపింగు మాత్రం మమ్మల్ని పిచ్చెత్తించేస్తోంది. ఆ ఆ సోమరాజములకు మాటలలో వర్ణించనలవి కాదు. మీకు క్షౌరంచేసే మంగలి...నిజంగా ఏ జన్మలో ఏం పూజ చేశాడో...మీ తల మీద తిలంటుకాడు మాని చుక్క పెట్టే మీ అత్త ఏం నోమునోచిందో...మీకు చిక్కు తీసేవారూ, పేలు నొక్కేవారూ ఎంత అదృష్టవంతులో...కళాజ విరాజమానా!... చక్కని మీ క్రాఫింగు తలుచుకుంటే మాకు మతిపోతోంది. కన్ను మూస్తే జుత్తు! కన్ను తెరిస్తే జుత్తు! మా అజ్ఞానమును మన్నించి మాకు కాస్త 'శాంపుల్' పంపి మా గృహం పావనం చెయ్యగలరా? ఈ చిన్న ఉపకారం చేసినా మేము బతికి ఉన్నన్నాళ్ళూ మీ పేరు చెప్పుకుని దాన్ని ప్రాణప్రదంగా దాచుకుని మీకు సదా కృతజ్ఞులమై ఉంటాము. రసికరాయా, ఇక శెలవా?' ఈవిధంగా సాగింది ఉత్తరం. పాపం ఆ నటుడు అడిగినవాడికి లేదనకుండా అందర్నీ ఆనంద పరచాడు. ఈ సంగతి తెలిసిన అతని మిత్రుడు పరియోక్తి, మెల్లో అన్నాడు.

'అదేమిటి అప్పన్నా, అందరికీ తల వెంట్రుకలు కత్తిరించి పంపుతున్నావుట, కొద్ది రోజుల్లో నీ తల రాగిచెంబు అయిపోదూ?'

"నాకేం భాగ, నా వల్లకుక్కకి గాని!' అన్నట్టు ఆ మహానటుడు." కుర్రాళ్ళు, గురువులూ, గుమాస్తాలూ అందరూ నవ్వేరు,

'కాబట్టి నే చెప్పేదేమిటంటే...సినిమా పిచ్చి అంత విపరీతంగా మీలో ఉండవి: సినిమాకి వెడితే తప్పా? అంటే అదికాదు నేననేది. సినిమా అంటే మా అందరికంటె ఎక్కువ పిచ్చి ఉంది నాకు. ఇవాళ బహుశా సెకండు షోకి వెడితే వెడతాను కూడాను... మీరూ వెళ్ళొచ్చు. కాని ఇప్పుడు కాదు. మీ పరీక్షలు అయిపోయాక ... ఈ పది రోజులూ మాత్రం సినిమాకు వెళ్ళనని ఏ తల్లి తోడో వేసుకోండి. ఒక్క సినిమాయే కాదు. పరీక్షను మించి ఇంక ఏ ఉద్రేకమూ మీ బుర్రలోకి రాకూడదు. అలా పట్టుదలతో చదివితే అందరూ తప్పక ప్యాసవుతారు... మీ స్కూలికి నూరుశాతం రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను...'

అందరూ గట్టిగా చప్పట్లు కొట్టేరు. ఆ రొదలో 'అవును...పట్టుదల ఉంటే సాధించలేనిదేమిటి? ఒక దృష్టి ఉంటే లభించనిదేమిటి?' అని జగ్గు అనుకోడం ఎవరికీ వినిపించలేదు.

* * *

రాత్రి తొమ్మిది దాటి ఉంటుంది. ఊరికి కాస్త దూరంగా ఉన్న ట్రావెలర్సు బంగళాలో ఇన్స్పెక్టరుగారు సిగరెట్టు కాలుస్తూ ఈజీచెయిర్లో కాళ్ళమీద కాళ్ళేసుకుని పడు



# ★ ... ఇంత పిసరా ★

కుని ఆలోచిస్తున్నారు. ఏదుగు గుండా క్రోటన్సు చెట్ల ఆకులు చప్పుడయ్యాయి.

'ఎవరూ? ఎవరది?'

'నమస్కారమండి ... నేను ... ఆరత్ ఫారమ్ విద్యార్థినండి... నా పేరు జగన్నాథ రావండి... అంతా జగ్గూ అంటారు...

'ఏం ఎందుకూ వచ్చావ్? ఏదైనా కన్సెషన్ కోసమా...'

'అబ్బే, అదికాదండి...పొద్దుట మీరు మా స్కూల్లో యిచ్చిన ఉపన్యాసం చాలా బాగుందండి...ఆ మాట మీతో చెబ్దామని వచ్చాను...'

ఇన్స్పెక్టరుగారు సగర్వంగా కాలరు సవరించుకొన్నారు. ఆయన బుగ్గలు కొంచెం ఎరుపెక్కాయి...మాట రత్నాలు విసిరాం, ఒక్కటి తగులితే చాలదా? మాట విత్తనాలు వేశాం, ఒక్కటి మొలిస్తే చాలదా!

'చాలా సంతోషం ... అలా కూర్చో అమ్మా... ఇంకా చాలా చెబ్దామను కున్నాను, చెప్పగలను కూడా .... కాని అప్పటికే పొద్దెంత టైము అయిపోయింది. ఇంకా మిమ్మల్ని ఏడిపించడం ఇష్టంలేక..'

'... నిజమే లెండి ఆ మాట...'

'ఆఁ ఏమిటి?'

'అదేనండీ, నవ్వలేక ఏడ్చుకున్నాం... ఒక్క మాట మాత్రం నాకు బాగా నచ్చిందండీ...ఒక పనిపట్టుకున్నామంటే దాని అంతు తేల్చాలి. అది అయ్యేదాకా రెండోది ఏదైనా సరే ముట్టుకోకూడదు. ఆ భావమే నన్ను మీ ముందుకు ఇంతదూరం తీసుకొచ్చింది...ఈ క్షణం నుంచే కష్టపడతాను. తప్పక ఫలితం కళ్ళ జూస్తాను'

ఇన్స్పెక్టరుగారు మరో అంగుళం పొంగిపోయారు.

'ఆ మాట చెప్పడానికి ఇంత రాత్రి ఇక్కడికొచ్చావా?'

'అవునండీ ... మళ్ళీ 'ఫస్టు బస్సు'లో పొద్దుటే మీరు వెళ్ళిపోతారటగా! వెళ్ళిపోతే ఎలాగ?'

'మళ్ళీ ఇంతరాత్రి యింటికి ఎలా వెడతావ్?'

'ఈ పది రోజులూ రాత్రీపగలూ అన కుండా కష్టపడమని మీరేగా చెబుతు?'

'అయితే సరేలే ... చూడూ సెకండు షోకి వేళయింది. ఈ టి. బి. వాచ్‌మేన్ 'లీవు'లో ఉన్నాట్ట. మా ప్యూన్ బంధువుల్ని చూస్తానని ఊళ్ళోకి వెళ్ళేడు. నే వచ్చేదాకా చదువుకుంటూ ఉంటావా? దగ్గిలేసి లోపలికెళ్ళి పడుకో అమ్మా, మరేం ఫరవాలేదు'

'అక్కర్లేదండీ, వరండాలో లైటు వెలిగించుకుని చదువుకుంటూంటాను. మీరు గదికి గొళ్ళెం పెట్టి వెళ్ళిరండి...'

మఫ్లరు తలకి చుట్టుకొని బ్యాటరీలైటు పట్టుకొని ఇన్స్పెక్టరుగారు వెళ్ళిపోయారు. జగ్గు పని ప్రారంభించాడు.

* * *

ఇన్స్పెక్టరుగారు మళ్ళీ వచ్చేసరికి జగ్గు అదే స్థానంలో కూచొని గడగడా చదివేస్తున్నాడు. గది తలుపులు తీసి ఉన్నాయి. లోపల ట్రాంకు తెరిచేసి ఉంది. అందులోని పర్సు విప్పేసి ఉంది. లోపలేముంది? కావలసినంత ఖాళీ! ... గబగబా జగ్గుని పట్టి అడుగుతే వాడు చెప్పిన జవాబు ఇది: 'మీరు సినిమాకి వెళ్ళినమొగాని రాసినదేదే ఎరగను! ఈ లోపలగా గదిలోకి ఎవరు వచ్చారో అంతకన్న ఎరగను! దొంగ తేదా రావచ్చు దొంగలేదా మూతపు... నా చూపే వేరు... నా దృష్టే వేరు...నా ఏకాగ్రత అలాంటిది ... నా గ్రహణశక్తి అటువంటిది...పట్టుదల ఉంటే పట్టుబడనిది ఉందా ఇన్స్పెక్టరుగారూ?' ఆయన దృష్టి ఇక్కడలేదు. తను ద్రోణాచార్యులు, జగ్గు గాడు అర్జునుడు.

'దొంగ కనిపిస్తున్నాడా?'

'లేదు'

'ఎవరేనా లోపలికెళ్ళడం కనిపించిందా?'

'లేదు'

'కోటు జేబులో తాళాలు కనిపించాయా?'

'లేదు'

'ట్రాయిలు సొరుగు కనిపిస్తోందా?'

'లేదు'

'మరేం కనిపిస్తోంది?'

'నేను చదువుకోవలసిన కోర్సు' అన్నాడు పైకి

'నేను దొంగిలించవలసిన పర్సు' అంటున్నాడు లోపల.

ఇంత తెలివైన అయన వీడి జేబులో పర్సు ఉంటుందా? పసిగట్టలేకపోయాడా? చిక్కినాడికేదీ? 'మద్దినం గురుదర్శనం' అన్న పూర్వపు రోజులు కావు,

'మద్దినం గురుదుర్గీనం' అనే రోజులు. నీతిబోధలకి ఇంత ఈతిబాధలా?

నమస్కారం ఇన్స్పెక్టరుగారూ, మీ 'మేలు మరువను' అన్నాడు జగ్గు అజాను బాహుడూ, మహానుభావుడూ అయిన—కన్నార్పి చూడవలసిన నిలువెత్తు ఇన్స్పెక్టరు 'ఇంత పిసరు' అయి ఊరుకున్నాడు!

 

# నక్షత్రఫలితాలు



### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

ఈ వారము మీకు మంచి భాగ్య యోగము. అనుకున్న డబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీకు యోగదాయకము. ధన యోగము వుంటుంది. సంగీతసభలు, కవితా గోష్ఠివంటి వినోదాలలోపాల్గొంటారు బంధు మిత్రులతోకలిసి మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభకార్యాలలో పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయ వలసివస్తుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగావుంటుంది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారముకూడా గతవారమువలె నీ యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. శుభపుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నాలు చేస్తారు. వాహనయోగము కలుగుతుంది. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువలాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగం.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము రాబడి తక్కువ. ఖర్చులు ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్ధలు వస్తాయి. ఆరోగ్యము చెడుచున్న చిహ్నాలు కనబడగానే ఔషధచికిత్స పొందడం, రవికి శాంతి చేయించడం మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు చదువుసరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము, కార్యలాభము, ప్రయాణము కలుగుతవి.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము నిరాశగావున్నా మిత్ర సహాయమువల్ల కార్యలాభము అవుతుంది. ఇంట్లోవున్నవారి ఆరోగ్య భంగమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకముతో వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూప వస్తువుల సంపాదన వుంటవి. 11 12 అధిక ఖర్చులు 17 ఆత్మీయుల ఆరోగ్య భంగము. విద్యార్థులకు చదువుబాగా సాగదు.

### * విశాఖ [తీ, తూ, తే, తో]

ఈ వారము మీకు మిశ్రమయోగము. ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక అశాంతి కలుగుతుంది. అయినను ఈశ్వరాను గ్రహమువల్ల కష్టములుగడిచి కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు చాంచల్యము ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా, వస్త్రద్రవ్య లాభము పొందుతారు. 11, 12 అశాభలగము, అధికఖర్చులు.

### అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈవారం అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకోవటాల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల లేకుండాపోతుంది. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు

—ధరలు:—

నూలు వస్త్రములు: స్వల్పముగా పెరుగును.
నూనెగింజలు: పెరుగుదలచూపును.
ఆహారధాన్యములు: స్వల్పముగా హెచ్చును.
బెల్లము, పంచదార: స్వల్పముగా తగ్గును.
చింతపండు: తగ్గుదలలో వుండును.
పప్పుదినుసులు: మందముగావుండును
వెండి, బంగారము: స్వల్ప తేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామ నక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, హృష్టుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అను పేర్లకు పూర్వాభాద్రయున్నూ చూచుకోనునది.

లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 11, 12 బంధువులరాక. అధిక ఖర్చులు. 17 భార్య ఆరోగ్యభంగము.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయినను పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్ప వచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 17న ప్రమాదభయం, అధిక ఖర్చులు.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధన లాభము కలుగుతుంది. ఈశాన్య దిక్కు నుండి క్షేమవార్త తెలుస్తుంది శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణిత, జ్యోతిషశాస్త్రచర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము. 10, 11 అధిక ఖర్చు, అపైని ధనలాభము, కార్యసిద్ధి.

### *పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢా]*

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాదరణ, శాస్త్రచర్చలు, ప్రభుత్వ సన్మానము వంటివి జరుగుతవి. విద్యార్థులు నూతనాంశలను చేర్చుకుంటారు. ఇంట్లో వున్నవారి ఆరోగ్యము బాగుపడుటచే ఆందోళన తొలగుతుంది. పిల్లల క్షేమలాభముల కొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు. బంధుమిత్రులతో మృష్టాన్నభోజనము చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ప్రోత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థజనిత వస్తువుల వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

### * శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది. వివాహాది శుభ కార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇవస్తు లాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతాయి. విద్యార్థులకు చదువుచురుకుగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగదాయకము.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమముగల ఘనత, ప్రయాణము, ధనలాభము ఉండును. అకాల భోజనమువల్ల అనారోగ్యము కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు బాగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత 13, 14, 15 పితృవర్గ సహాయము, కార్యలాభము. 17 అనారోగ్యము.

### శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము యత్న కార్యములకు ఆలస్యము, వర్తకులకు లాభముతక్కువ. ఆత్మీయుల అనారోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించ బడుతారు. వారమంత చికాకుగా వున్నా వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి జరుగుతుంది.

### * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]

ఈ వారము ధనాభావము ఎక్కువ ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామను కున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతాయి. అయినా దైవబలమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది ఇంటోవారి ఆరోగ్యం బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఆందోళన వున్నా సాధుసాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్య లాభము కలుగును.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, థా]*

ఈ వారము అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా వుండదు. ఇచ్చి పుచ్చుకొనేపట్ల వివాదాలు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి వున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. విద్యార్థులకు బాగా సాగదు.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినను పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభమును పొందుతారు. ఆశించిన డబ్బు అనుకున్నట్టుగా అందక అప్పుచేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతోకూడిన లాభము. 17న ప్రమాద భయం. ★

రహస్యంగా ఉంచినంతకాలం నా గౌరవానికి భంగం వాటిల్లదు.

కానీ ఇది నా లాంటి బుద్ధిమంతులు చెయ్యవలసిన పనేనా అని?

—అప్రయత్నంగా సునాయాసంగా లభ్యమయిన ఆభరణాన్ని, అనవసర ఆయాసాన్ని కొనితెచ్చుకున్నట్లుగా ఊరల్లా తిరిగి ఎవరిదో తెలుసుకొని ఇచ్చేఅవసరం నాకేముంది గనక?

పోనీ ఒకవేళ అటువంటి శ్రమ పడేటందుకు ఇష్టపడి సిద్ధపడ్డా, ఆ అమ్మాయిని నేను సరిగ్గా పోల్చుకోగలనా అని? నిజానికా అమ్మాయి ముఖంకేసి అంత పరిశీలనగా చూడలేదసలు. ఏదో ప్రక్కవాటుగా ఒకటి రెండు దఫాలు చూస్తేనే గానీ—ఆమె రూపాన్ని మనస్సులో చిత్రించుకోగలిగేటంత బాగా చూడలేదు. అంచేత ఆ అమ్మాయిని గుర్తుపట్టడం కష్టమైనపని.

పోలీస్ స్టేషనుకిచ్చేస్తేనో? రిపోర్టిచ్చేటందుకు వాళ్ళు వాళ్ళు ఎలానూ వస్తారు. ఎంచేతో ఆపని చెయ్యడానికి మనస్కరించలేదు.

ఆ అమ్మాయి శ్రీమంతుల కుటుంబంలో జన్మించి ఉంటుందని ఊహించేను. ఒక 'నెక్ లెస్' పోయినంతమాత్రంలో ముష్టెత్తుకొనే స్థితికి దిగజారిపోరు. తాత్కాలికంగా విచారించినా త్వరలోనే మరచిపోవచ్చు. వెతుక్కోడం—తరువాత పోలీస్టేషనుకు రిపోర్టివ్వడం వగైరా పనులను ఆమె తాలూకువాళ్ళే చేస్తారు. ఈ 'నెక్ లెస్' ను వెతుక్కోడికయినా అమ్మకానికి తీసుకెళ్ళితే కదా చిక్కొస్తుంది? దీనిని నేను అమ్మడమనే ప్రశ్నే లేదు! పెళ్లయేక దాన్ని నా భార్య కంఠసీమలో అలంకరించొచ్చు. కాబట్టి ఈ భోగటా పైకేవిధంగానూ పొక్కనివ్వకూడదనుకున్నాను.

కానీ...

ఆ అమ్మాయి ఎంత బాధపడుతున్నాదో ఏమిటో?

ఒకవేళ వెతుక్కోటందుకు హాలు కొచ్చిందో ఏమిటో!

వెళ్ళి చూస్తేనో?

హాలుదగ్గరకామె వచ్చిఉంటే—నే నే వెళ్ళేసరికామె అక్కడుంటే—నెక్ లెస్ ని ఆమెచేతికి చేరిస్తే ఎంతో ఆనందిస్తుంది. ఆనందించి అభినందనలర్పిస్తుంది. నెక్ లెస్ కంటే ఆ లావణ్యవతి సమర్పించే అభినందనాలకు విలువెక్కువ. ఒకవేళ ఆమె పెళ్ళికాని పిల్లే అయితే...రకరకాల ఊహాలు, మధురమైన ఊహలు నా మదిలో మెదిలేయి!

రాత్రి తినడం, టీ త్రాగడం పూర్తయింది. బిల్లు చెల్లించేసి హాలు కేసి నడక సాగించేను.

సరిగ్గా గంటస్థంభం దగ్గర కొచ్చేసరికి నా మనస్సు నన్ను వెనక్కులాగింది.

ఒకవేళ ఆ అమ్మాయి వివాహితే అయితే నా ఊహాలన్నీ ఏమవుతాయి? ఇంతకీ ఆమె అవివాహిత అయినా కట్నకానుకలు—కులగోత్రాలు—తల్లిదండ్రులు—అబ్బో చాల అవకట్లు!—దమ్మిడీ ప్రీతి మాత్రం దక్కదు!—

అంచేత భద్రంగా జేబులో ఉంచి ఆ రాత్రి వెయిటింగ్ రూమ్‌లో గడిపేసి తెల్లారక రాయపూర్ ప్యాసింజరులో మా రాయఘడా వెళ్ళిపోడానికి నిశ్చయించుకున్నాను.

* * *

ఒక సంవత్సరం గడిచింది. పెళ్లయింది నాకు.

దసరా వచ్చింది. మంచి చీర కొనమంది శ్రీమతి.

"చీరేమిటి?—అంతకంటే విలువయిన దిస్తాను" అని గొప్పగా 'నెక్ లెస్' ని ఇచ్చేను.

ఆమె ఊహాతీతమయిన వస్తువు! ఆశ్చర్యపోయింది.

"ఎప్పుడు కొన్నారు? నాతో ముందెందుకు చెప్పలేదు?" అడిగింది శ్రీమతి నెక్ లెస్ వేపు ముచ్చటగా చూస్తూ.

"క్రితం ఆదివారం విజయనగరం వెళ్ళినప్పుడు కొన్నాను. ఒక్కసారి నిన్ను ఆశ్చర్యంలో ముంచెయ్యాలని ముందుగా చెప్పలేదు. బాగుందా?" అని అడిగేను.

"మీరూహించినకన్నా ఎక్కువ ఆశ్చర్యంలోనే ముంచేసేరు నన్ను. సరిగ్గా ఇలాంటి నెక్ లెస్ నే విజయనగరంలో ఓ సంవత్సరం క్రితం పారేసుకున్నాను. మా అమ్మ, నాన్న, చిన్న తమ్ముడూ, నేనూ సినిమా కెళ్ళేం. వెళ్ళేటప్పుడుంది. హాలులో కూడా ఉన్నట్లే గుర్తు. తిరిగి వస్తున్నప్పుడు చూసుకున్నాను; లేదు. ఎక్కడయినా జారిపోయిందో లేక ఎవడయినా దొంగిలించేసేడో? అది మరి దొరకదని నిరాశ చెందుకున్నాము లెండి. తమాషా ఏమిటంటే మళ్ళీ అటువంటి 'నెక్ లెస్' మీరూ కొన్నారు. కానీ ఈ రకం నెక్ లెస్ మీద నాకెప్పుడంత సరదా లేదు. మన పొరుగింటి సరోజ అమ్మగారి నెక్ లెస్ కొనుక్కుంది. చాలా బాగుంది. నాతో మీరీ విషయం ముందుగా చెప్పుంటే నేనూ మీతోపాటు విజయనగరం వచ్చి నాకు నచ్చినది ఎంచుకోనుందేదానిని. ఇంతకీ ఇది ఎన్ని తులాల బరువు? ఖరీదెంత?" అని అడిగింది.

వచ్చేను! నా అసన ఇకతుని చెప్పను? ఎన్ని తులాలో ఏమిటో? బస్తు బాబుని... ఇచ్చేనుండ తూచి ఉండవలసింది. ఎంతో కొంత ఉజ్జాయింపుగానైనా చెప్పాలి. లేకపోతే మర్యాద దక్కదు. "మూడు తులాలు!—మూడువందల ఏభై రూపాయలు పాళ్ళతో కలిపి!" అన్నాను వెనక్కుతూ.

"బిల్లూ—పూచీ కత్తు చీటీ జాగ్రత్తగా ఉంచేరా?"

వెనక ప్రశ్నలూ ఇదిని. "ఎక్కడో పోయేయి!" అని సమాధానమిచ్చేను.

"పోయినా ఫరవాలేదు లెండి! ఆ షాపు వాడి దగ్గర ఓ డూప్లికేటు రసీదు ఉంటుంది. ఏ కొట్లో కొన్నారో గుర్తుంచేచాలు. వచ్చే ఆదివారం మీకు సెలవు కదా. ఇద్దరం విజయనగరం వెళ్దాము. దశమినాటికెలానూ వెళ్లాలనుకున్నాము కదా. ఓ రెండు రోజులు ముందయితే నేమి లెండి. మా నాన్నగారికి విజయనగరంలో ఆ మాత్రం పలుకుబడుంది. వస్తువుని మార్చడానికి వాళ్లు నప్పుకుంటారు. ఒకవేళ అదనంగా ఏమయినా పడితే మా నాన్నగారు ఇచ్చేస్తారు లెండి" అంది.

సందిగ్ధావస్థలో పడ్డాను. ఏం చెయ్యడం? ఆ బంగారు వర్తకులకు జ్ఞాపకశక్తి ఎక్కువ. నాల్గు సంవత్సరాల క్రితం ఎప్పుడో ఓ చిన్న ఉంగరం కొన్నా, ఆ వ్యక్తినీ, అతని ఊరునీ గుర్తుంచుకోగలిగే ధీమంతులు. పైగా మా చెల్లి పెళ్లి సందర్భంలో వెండి బంగారు సామానులు కొనే నిమిత్తం ఆ ఊళ్ళో ఉన్న షాపులన్నీ తిరగడంవల్ల నేను వాళ్ళకు బాగా పరిచయమయినవాడినే. వాళ్లదగ్గర నా దొంగతనం బయటపడక తప్పదు. కథ విషమించక ముందే నిజం చెప్పేస్తేనో—

"హే భగవాన్! మా ఉభయులకూ ఈ సంబంధం కలపడంలో నీ ఉద్దేశ్యం ఇదా?" అని మనస్సులో అనుకున్నాను.

కథ ఇంకా అనవసరంగా తయారు చెయ్యడం ఇష్టంలేక శ్రీమతికి నిజం చెప్పేసేను!—

ఆమె అంతులేని ఆశ్చర్యంతో—అదొక రకమయిన ఆనందంతో—"దొంగలు దొరికిపోయేరు. నేరం చేసిన వాళ్ళు శిక్ష అనుభవించాలి మరి!" అంది.

"ఇంతకీ నే చేసిన తప్పేమిటో?"

"దొరికినది సవ్యంగా అప్పజెప్పక పోడం ఓ తప్పు. కొన్నట్లు అబద్ధమాడడం రెండో తప్పు. చివరకు నిజం చెప్పేరు కాబట్టి ఈ రెండు నేరాలకూ కలిపి ఒకే శిక్ష విధిస్తున్నాను. ఈ నెక్ లెస్ నిలాగే ఉంచి నన్ను విజయనగరం తీసుకెళ్ళి సెంటు కొన్న నెక్ లెస్ కొనాలి. ఏమంటారు?"

ఆరుమాసాలు గడువడిగేను.

"ఔను గానీ...ఇది పెళ్ళిలోనే ఇవ్వక ఇంతవరకూ దాచడంలో మీ ఉద్దేశ్యం?"

"అప్పట్లో ఇస్తే నా గుట్టు తేలేటుంది గనక! మా నాన్నగారు పెట్టిన నాటకంలో జమవుతుంది. అంచేత అప్పట్లో ఇవ్వలేదు. అన్నీ మన మేలుకే అన్నాడు నా దేవుడో కాని!..." అమె నవ్వుతున్నా నాకు నవ్వురాలేదు. ★

# బాలసాహితి

చిట్టి చిట్టి పాపలార!
బడికిపోవు పిల్లలార!
చదువుసంధ్య కట్టిపెట్టి,
ఆటపాట విడిచిపెట్టి,
రండిమీరు ఒక్కసారి;
కథ ఒక్కటి చెప్పతాను.
చెప్పబోవు చిన్న గాథ
కల్లకాదు పిల్లలార!
నిజంగాను గుజరాతున
జరిగినట్టి గాథ అండి. —

రాజకోట చెంతనున్న
చిన్న పల్లెటూరునందు
ఉన్నదొక్క మాతృమూర్తి,
పుణ్యవల్లి ప్రేమవెల్లి.
మూడుయేండ్లపిల్ల ఒకతె,
మూడునెలలపాప ఒకడు,
ఇంటికెంతో వెలుగు అయిరి
ఆమె కడుపుపంట పండి.

పిల్ల, పాప భర్తతోను
వున్నంతలో తృప్తిచెంది
గుట్టుగాను పుణ్యమూర్తి
కాపురంబు చేయుచుండు.

ఇటులుండగ ఒక్కరేయి
వింత ఒకటి జరిగెనండి.
వింతకాదు బాలలార!
వారిపాలి మృత్యువండి.
మాతృమూర్తి ప్రేమమూర్తి
చంటిపాప కంటికొరకు
కంటిపాప చలువకొరకు
కాటుక తా చేయనెంచి
వెలిగించెను నూనె ప్రమిద.

నేర్పుమీర దివ్వెపొగను
అద్దమునకు పట్టుచుండ

## తల్లి ప్రేమ

నిద్రపోవు చంటిబిడ్డ
నిద్రలేచి ఏడ్వసాగె.
బిడ్డయేడ్పు విన్నతోడ
దీపమచట విడిచిపెట్టి
ఒక్కపరుగుతీసె తల్లి
తన ముద్దులపట్టి దరికి.

ఇంతలోన గాలివీయ
చిలకకొయ్యకున్న చీరె
జారిదివ్వెమీద పడగ
నిప్పుచీరె కంటుకొనియె.

గుడ్డ కాలువాసన, తా
పసిగట్టిన మాతృమూర్తి
సంగతేమొ తెలియలేక
బాబు నొదిలివచ్చిచూడ
చీర కంటుకున్న జ్వాల
ఇంటిచూరు కంటుకొనియె.

చూరుకంటుకున్న జ్వాల
కొప్పు కెగసిపోయెనండి.
భర్తమాడ జబ్బుతోడ
పక్కనంటి పట్టివుండె.
మంటచూడ నల్దిక్కుల
ఉవ్వెత్తుగ కమ్ముకొనియె.

ఏమిచేయగలదు ఆమె
ఊరు నిద్రపోవువేళ!
చంటిబిడ్డ చంకనెత్తి,
తాను భర్త రెక్కపట్టి
ఎట్లెట్లో ఎట్లెట్లో
తడుముకొంటు తూలుకొంటు



"రాజశ్రీదేవి"



అగ్నిజ్వాలబారినుండి
బ్రతికి బయటకొచ్చె 'తల్లి'.
బాబు బ్రతికిచాలు ననుచు
పొంగిపోయె కన్నతల్లి.
నిద్రపోవు పిల్లనైన
పిచ్చితల్లి మర్చిపోయి.
ఇంతలోన నిద్రపోవు
పెద్దపిల్ల గుర్తురాగ
తల్లడిల్లిపోయెనండి
కన్నతల్లి వెన్న మనసు.
"బిడ్డ, బిడ్డ" అంటూనే
మిన్నునంటు మంటలోకి
ఒక్కసారి జొరబడియెను
మాతృమూర్తి ప్రేమమూర్తి.
తన సంగతి ఎడగదామె
బిడ్డ బ్రతుకు తనకుగాని.
ఎగసినట్టి దీపశిఖలు
కమ్ముకొనెను ఆమెచుట్టు
అయిననేమి కన్నకడుపు
నాపగలద అగ్నిజ్వాల!
ప్రేమకట్ట తెంచుకుంది;
దీపశిఖల చీల్చుకుంది.
బిడ్డదరికి చేరుకుంది;
"తల్లి" అంటు హత్తుకుంది.
కమ్ముకున్న అగ్నిజ్వాల
కాహుతైరి తల్లి, పిల్ల.
బిడ్డకొరకు కన్నతల్లి
ఆహుతయ్యె ఆశ్చర్యం!
కథకాదిది పిల్లలార
కన్నతల్లి కడుపుతీపి!



# కూసే గాడిద

అందరికీ అందుబాటులో వుండే అనువైన జాగా చూసి అంగడి పెట్టాడు - చాకలిసీతయ్య. ఆనాటి నుండి అతని వ్యాపారం చిలవలూ పలవలూ వేసేచెట్టులా పెరగ సాగింది. కొట్టుపెట్టినాడైతే పెట్టాడో ఆనాటినుండే బట్టలు జేరవేసే విధానంకూడా మారిపోయింది—పూర్వం మాసినబట్టలన్నీ గాడిదవీపుమీద వేసి చాకిరేవుకి వెళ్లివచ్చి, ఉతికిన బట్టలన్నీ నెత్తిన పెట్టుకుని ఇంటింటికీ వెళ్ళి యిచ్చివచ్చేవాడు. అలాంటిది ఇదివరకు ఒక గాడిద మోసిన బరువు యిప్పుడు అరడజను సైకిలు రిక్షాలకుపైగా మోస్తున్నాయి. తన యజమాని కుటుంబం ఎన్నాళ్ళు చూసినా గొర్రెకుబెత్తెడు తోకలా కాకుండ నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుండాలని—ఎంత బుద్ధి లేనిదైనా—చిన్ననాటినుండి సీతయ్యకు 'చాకిరీచేస్తున్న గాడిదకు తెలుసు. కాని కొత్తగా వచ్చిన మార్పులవల్ల తన ఆలనాపాలనా చూసేవారెవరూ లేకపోయేసరికి ఆ గాడిదకి దిక్కూ తెన్నూ తోచకుండా పోయింది. ఇప్పుడిక తనకి యింత తిండిపెట్టేవాడు, ఎక్కడ తిరిగినా పట్టించుకునేవాడూ లేకపోవడంతో ఆ గాడిద వీధినపడినడక సాగించింది. అంతమహాపట్టణంలో అన్నీ తారురోడ్లు, సిమెంట్ రోడ్లే సాయె! ఎంత తిరిగినా కాళ్ళు పీకడమే గాని కడుపునిండేదారి కనపడలేదా గాడిదకి. అక్కడక్కడ కలవారి యిళ్లవాకిళ్లముందు పచ్చగా పెరిగిన పచ్చికవుండికూడ ఇనపకటకటాలు, ఎత్తైనగోడలు వుండడం మూలాన కేవలం చూపులతోనే కడుపు నింపు

**పసల కృష్ణకుమార్**

కోవలసిరావడంతో ఆ గాడిద ఆకలి మరింత ఎక్కువయ్యింది

ఒకచోటమాత్రం గేటు తీసివున్న దృశ్యం ఆగాడిదకెంతో ఆశకలిగించింది. మెల్లగా అడుగులో అడుగేసుకుంటూ గేటుదాటి ఆవరణలోకి వెళ్ళి అందంకోసం పెంచుకున్న ఆ పచ్చికను ఆవురావురుమంటూ తిన సాగింది. అంతలోనే సింహాల్లాంటి రెండుకుక్కలు, [బివేర్ ఆఫ్ డాగ్స్ అని ఇంగ్లీషులోను; కుక్కలున్నాయి జాగ్రత్త' అని అచ్చతెలుగులోను; నాయ్‌గళ్ జాగ్రదై' అని అరవంలోను మూడుబోర్డులు స్పష్టంగా అందరికీ తెలిసేలా ఆగేటుకు కట్టివున్నాయి. అన్ని భాషలలో ఏ ఒక్క భాష వచ్చివున్నా ఆ గాడిద చచ్చినా ఆ ఆవరణలో అడుగు పెట్టివుండేదే కాదు......—] ఏనుగు గున్నలాంటి ఒక మనిషి, మీదకి దూసుకువస్తుంటే గాడిద పరుగు పుచ్చుకోవలసిందే. కాని ఆకలి సందడిలో అదేమీ గమనించకుండా మేత మేయడంలోనే లీనమైపోయివుంది. కాని ఏనుగుగున్న

## ★ కూనేగాడిద ★

లాంటి వ్యక్తి వూరుకుంటాడా! కుక్కల సహాయంతో బాగా దేహ శుద్ధి చేసి గేటుదాటించేశాడు.

అప్పటికి ఎన్ని రోజులు గడచాయో, అక్కడికి తనెలా వచ్చిందో! ఒకనాడు కళ్లు తెరచి చూసేసరికి గాడిదకి చుట్టూ వున్న వాతావరణమంతా కొత్తగా కనిపించింది. కనుచూపుమేర ఎటు చూసినా పొలాలే. పుట్టుఅంధునికి ఒక్కసారిగా దృష్టివచ్చినట్టు ఆ పరిసరాలను చూసేసరికి, తనకి తెలియకుండానే తనకాళ్ళు అలాంటి ప్రదేశంలోకి తీసుకువచ్చినందుకు ఎంతో పొంగిపోయింది. అవి వేసవికాలపు ఆరంభదినాలు కావడంవల్ల పొలాలలో పచ్చిక అంతగా లేకపోయినా ఆ బక్కగాడిద కడుపే నిండక పోతుందా! అదలాగే తింటూ, తాగుతూ ఎక్కడికి పడితే అక్కడికి పోసాగింది. అలా తిరుగుతున్న గాడిదకి ఒకనాడొక కాలవగట్టున చాకిరేవు, మాంచి కోలాహలంగా పనిచేసుకుంటున్న చాకళ్లు ఆ దరిదాపుల్లోనే నేలనంటిపెట్టుకొనిఅందీ అందకుండా వున్న గరిక పరకల్ని బరుకుతున్న కొన్ని గాడిదలు, కనిపించాయి. ఈ గాడిద వాటిని సమీపించేసరికి అవన్నీ చుట్టూ చేరి తప్పిపోయిన తమ స్నేహితుడు కనిపించినట్లు కుశలప్రశ్నలు కురిపించసాగాయి. అవి చూపించే ఆదరంవల్ల కలిగే అంతులేని ఆనందం ఒకప్రక్క, వాటి ప్రశ్నలమూలంగా గడచిపోయిన కష్టాలు జ్ఞాపకంరావడంవల్ల కలుగుతున్న బాధ ఒకప్రక్క—వీటివల్ల ఉక్కిరిబిక్కిరి అయిపోతూన్న సమయంలో—

"ఇదెక్కడిదెహా! యీ కూనె గాడిదొచ్చి మేసేగాడిద లన్నిట్నీ సెడగొడతోంది" అంటూ ఒక చాకలి కావడిబద్ద బుజాన్నేసుకుని బయలుదేరాడు. ★



### ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘం

GROUP A లేక B

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జూలై 1 నాటికి వయస్సు ....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తిపేరు : ....

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ....

పాఠశాల పేరు : ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

అర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1959]

(సంతకము)

* షరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **11-3-59**] ఈ దరఖాస్తు **14-3-59** నాటికి మాకు చేరాలి]

# డిబేట్‌లో మొదటిసారి

ఫోర్తుఫారం చదువుతున్నాన్నేను. ప్రతి పదిహేనురోజుల కొకసారి శుక్రవారం రోజున డిబేట్ జరుగుతూవుంటుంది క్లాసులో.

ఇంతకుపూర్వం నేనెప్పుడూ డిబేట్‌లో మాట్లాడలేదు. ఈ దఫా మా రామం బలవంతంమీద నా పేరిచ్చారు. రామం నాకున్న యిద్దరు ముగ్గురు ప్రాణమిత్రుల్లో ఒకడు. వాడు బాగా మాట్లాడుతాడు. నన్నుకూడా మాట్లాడించాలని వాడి పట్టుదల.

'మొదటిసారి ఐనప్పటికీ చాలా బాగా మాట్లాడాడు' అనిపించుకోవాలని వుందినాకు.

ఆరోజు గురువారం. మరుచటి రోజునే డిబేట్ జరిగేది. అందుచేత నేను విషయ సేకరణకోసం చర్చనీయాంశానికి సంబంధించిన పుస్తకాలు పోగుచేసి రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు నోట్సు రాస్తూనే వున్నాను.

డిబేట్ ప్రారంభమయ్యింది. కొందరు మాట్లాడినతర్వాత మాష్టరుగారు పేరు పిలిచారు. నేను లేచాను. చకచకా మాష్టరుగారి టేబుల్ దగ్గరకు వెళ్లాను. మాట్లాడ్డం ప్రారంభించాను. ప్రతిపక్షుల వాదాన్ని ఒక్కొక్క పాయింటు తీసుకొని ఖండిస్తూ నా వాదంలో వుండే బలాన్ని సోదాహరణంగా రుజువుచేస్తూ అనర్గళంగా మాట్లాడేస్తున్నాను క్లాసులో షాట్సు మ్రోగిపోతున్నయి. రామం నోరు తెరుచుకొని అట్లాగే చూస్తున్నాడు. మొదటిసారైనా వీడింత నల్లేరుపై బండిలాగా మాట్లాడేస్తున్నాడేమా! అని వాడి అబ్బురం. వాడేమిటి? అందరిమొహాల్లోను అమిత ఆశ్చర్యం కనబడుతోంది. నాకిచ్చిన టైం యింకా పొడిగించారు మాష్టారు.

**రాచబత్తుల వీరరాఘవయ్య**

ప్రతిపక్షుల వాదాన్ని తుత్తునియలు చేస్తూ మాట్లాడి నేను ముగించడంతోటే పెద్దపెట్టున చప్పట్లుకొట్టడం ప్రారంభించారు.

"లేవవేమిరా యింకా ఎనిమిదిన్నర ఐతేనూ" అంటూ చప్పట్లు కొడుతూ నన్ను లేపుతున్న రామం కనుపించాడు నా మంచందగ్గర నేను కళ్లుతెరచి చూచేసరికి.

"ఓరి! యిదంతా కలటరా!" అంటూ లేచికూర్చున్నాను నేను.

"ఏదో గొప్పకలే వచ్చిందిలాగుందే" అన్నాడు వాడు. "ఔను" అని నా కల వృత్తాంతమంతా చెప్పాను వాడికి.

నవ్వి "సరేలే. లే, చాలా ప్రొద్దెక్కింది. స్నానానికి పోదాం" అన్నాడు రామం. ప్రతిరోజు ప్రొద్దున్నే రామం, నేను కాలవకు వెళ్లి స్నానంచేసి రావడం అలవాటు నేనులేచి ఒక టవల్ కట్టుకొని యింకొక టవల్ పైనవేసికొని పయనమయ్యాను స్నానానికి...

తరగతిలో డిబేట్ ప్రారంభమయ్యింది.

# ★ డిబేట్ లో మొదటిసారి ★

ఎవరెవరు మాట్లాడుతున్నారో చూస్తూనేవున్నాను. కాని వాళ్లేమి మాట్లాడుతున్నారో నా చెవిని పడడంలేదు 'మాట్లాడే విధానాన్ని రిహార్సల్ వేసికొంటోంది నా మనస్సు.

నాపేరు చదివారు మాస్టారు. నేను లేచాను. గబగబా మాస్టరు గారి టేబుల్ దగ్గరకు వెళ్లాను.

అధ్యక్షుని సంబోధించి మాట్లాడ్డం ప్రారంభించారు.

అరె! కాళ్లు గజగజా వణికి పోతున్నయ్యేం? ఎన్నిసార్లు మననం చేసికొన్నా మాట్లాడలిసిన విషయాన్ని మరచిపోయానేం? జేబులోనుంచి హింట్స్ వ్రాసిన కాగితం తీశాను. కాగితంలోని అక్షరాలు మాత్రమే కనపడుతున్నాయి. అంతే తప్ప హింట్స్‌కు సంబంధించిన విషయం మనస్సుకు తట్టడంలేదు. చేతిలోని కాగితం కంపించిపోతోంది. ఎట్లా అరికట్టేది చేతివణుకు?

అందరి ముఖాల్లోను అపహాస్యం తొంగిచూస్తోన్నట్టుంది. ఊహు యిక మాట్లాడలేను - నోరుకూడా పిడచకట్టుకు పోతోంది. ప్రతిపక్షుల వాదాన్ని తునాతునకలు చెయ్యాలి. నా నోటివెంట మాటే పెగలక పోతోంటే!

మాట్లాడ్డం ముగించేసి నాచోటులోకి వెళ్లి కూర్చున్నాను. ముఖమెత్తి ఎవరివంకా చూడలేక పోతున్నాను. నాతరవాత ఎవరు మాట్లాడింది కూడా నేను చెప్పలేను' అసలు ఆధ్యానలో వుంటేగా నేను? ఇంత అధ్వాన్నంగా మాట్లాడి అపహాస్యం పాలయ్యానే అనే చింత నా మనస్సును కలచివేస్తోంది.

స్కూలు విడిచిపెట్టారు.

"ఒరేయ్! ఆగరా!" అని వెనక రాముం కేకేస్తూవున్నా ఆగకుండా గబగబా నడుస్తూ యింటికి చేరాను.



## వేలం వెర్రి

వేలం పాట పూర్తయింది. అందరూ నెమ్మదిగా వెళ్లిపోతుండగా, వేలం పాడినవాడు హఠాత్తుగా "ఆగండి ఆగండి. ఇక్కడ ఈ పెద్దమనిషి వెయ్యి రూపాయిల పర్సు పోగొట్టుకున్నారు. అది తెచ్చి ఇచ్చిన వారికి యాభై రూపాయలు బహుమతి ఇస్తామంటున్నారు" అన్నాడు.

"అరవై," అని వెనకనుంచి ఎవరో పాడరు.





కందుకూరి లింగరాజు

# సమర్పణ

## 12

అవధాని జైల్లో 'సి' క్లాసులో ఉన్నప్పుడు తనతర్వాత వచ్చిన రమణమూర్తిమీద ఎందుకో తెలియకుండానే అనురాగం కల్గింది. ఎన్నోవారలకొరకు ఎదురుచూస్తున్నట్టుగా వున్నతోటి వాళ్ళందరూ కొత్త ఖైదీమీద ప్రశ్నలవర్షం కురిపించేసేరు.

అవధానివచ్చి ఆరునెలలయ్యింది. ఇంచుమించుగా అదికాలంలో తిక్కనవాళ్లా వచ్చేరు. ఈలాగా తెలిసిన విషయాల్లో గాంధిగారి ఆమరణ ఉపవాసదీక్ష తప్ప మరోకవార్త వారికి అందనేలేదు. తనతర్వాత వచ్చిన అరడజనుమంది రమణమ్మ, శచి, వెంకట్రామయ్య మొదలైనవారి వార్త చెపుతారేమో అన్న ఆశతో ఎదురుచూడ్డం, అది వృధాప్రయాస అయిపోవడంచేత అవధానికి మనస్సు క్షుభితం అయిపోయింది.

రమణమ్మ 'ఈ సత్యాగ్రహంలో చేరడానికి ఒకవిధంగా తనుమనస్సును సమాధాన పరుచుకున్నాడు. శచివిషయంలో, తనను ఆవహించిన విషమపరిస్థితులనకూడా అధిగమించ గలిగాడు.

నిజంగా ఆలోచిస్తే శచి ఆ ఇంట్లో కలోగంజో త్రాగుతూ పడివుండేది. ఏదో ఉద్ధరించి సంస్కరణ సాగిద్దామని బీరాలు పల్కి దాన్ని తనతో తీసుకువచ్చేడు. ఈ తీసుకురావడం దానికి కల్యాణప్రదమై వుంటే తనమనస్సు ఇంత క్రుంగిపోయి వుండేదికాదు. పైగా అలా తీసుకురావడం వల్ల తను తండ్రికిదూరమై పోయేడు. ఈ భావం అవధానిని కృంగతీసింది.'

ఆరాత్రితోటి ఖైదీలో కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు అతడు తనది గుంటూరుజిల్లాఅనీ చదువు మానేసి దేశభక్తుని ఆదేశానుసారం ఉద్యమంలో చేరిపోయేననీ చెప్పగా విని పట్టలేనంత సంతోషం కల్గింది.

"ఉన్నవ దంపతులు క్షేమమా?" అని అవధాని ప్రశ్నించాడు.

"వాళ్లను ఎరుగుదురా?" అని ఆ ఖైదీ ఎదురుప్రశ్న వేశాడు.

"లేదు; మాలపల్లిమాత్రం చదివేను."

దానిమీద ఏవేవో మాటలూ కబుర్లూ అయ్యేయి. కొద్దిసేపాగి "రమణమ్మగార్ని మీరు ఎరుగుదరా?" అన్నాడు.

ఉలిక్కిపడ్డాడు అవధాని. అంతవరకూ నాలుక చివరవరకూ వచ్చేస్తున్న అదే ప్రశ్నను తాను అడగకుండా నిబ్బరం చూపలిగాడు.

తలూపుతూనే 'కొన్నాళ్ళు ఒకేదళంలో పని చేసేం."

"ఏమి ధైర్యస్తురాలండి ఆవిడ! కాకినాడ వీథుల్లో ఉప్పు అమ్మి తీరుతానని పట్టుపట్టి, పోలీసుల్ని మూడు చెరువుల నీళ్ళు త్రాగించింది!"

"అల్లాగా!" అన్నాడే కాని మరేమీ మాట్లాడలేకపోయేడు. తనూ ఉప్పు తయారు చేయగల్గేడు లాఠీపోట్లు తినలుతున్నా, కాని దాన్ని స్వతంత్రంగా అమ్మి నిధి ప్రోగు చెయ్యలేకపోయేడు.

"ఆవిడ మిరపకాయ అయితే—శచి గారట—ఆవిడ సీమ్మిరపకాయే!" అంటూ పరధ్యానంలో పడ్డాడు రమణమూర్తి.

తట్టిలేపినట్లు అయింది అవధానికి.

"వాళ్ళిద్దరూ క్షేమమేనా నాయనా! ఈ పోలీసు మృగాలచేతుల్లో కాళ్ళూ చేతులూ విరిగిపోక మామూలుగా వున్నారా?"

ఆ మాటలలోని అంతరార్థం తళుకున మెరవగా రమణమూర్తి "మీరు వారిని బాగా ఎరుగుదురా?" అని ప్రశ్నించాడు.

"ఎరక్కేం! మాకీ వాళ్ళకీ చాలాదగ్గర సంబంధం. వూళ్ళుకూడా దగ్గర," అని మొఖం త్రిప్పుకున్నాడు. తన కార్యాచరణకు పసుపూ కుంకుమా పెట్టి దివ్యజ్యోతి వెలిగించినవాళ్ళకు ఏ విధంగా కృతజ్ఞత చూపించాలో తెలియలేదు. సుఖ దుఃఖాల్లోని అశ్రువులు కనుపాపల్లో ప్రత్యక్షమయేయి.

ఈ విచిత్రభావ పరిణామాలు అర్థం కాలేదు రమణమూర్తికి. కొంతసేపు మౌనం వహించి:

"శచిగారి కేసూ, నాదీ ఒకేరోజు విచారణ జరిగేయి. ఆవిడకు ఎనిమిది నెలలు, నాకు సంవత్సరం. ఆవిడతోపాటు నన్నూ రాయవెల్లూరే పంపమని కోరుకున్నా, ఇటు త్రోసేసేరు" అన్నాడు. అందులోని బాధ అవధానికి వ్యక్తమైంది.

అవధాని ఉండబట్టలేక "నీకు పెళ్ళి అయిందా?" అన్న ప్రశ్న త్రుళ్ళిపడేట్లు చేసింది, రమణమూర్తిని.

"లేదు. ఈ నరకాల్లోంచి విముక్తి వస్తే, నాకు అదృష్టం వుంటే శచినే చేసుకుందామన్న ఆశ వుంది. అది ఫలిస్తే నేను చాలా అదృష్టవంతుణ్ణి" అని రహస్యంగా అనేసేడు. దాంతో ఆవిడతో తన ప్రథమ పరిచయం, కలసి సాగించిన ఉద్యమ కలాపం, ఆవిడ ఆదేశాలలోని చతురంగపు ఎత్తులు మొదలైన విషయాలెన్నో చెప్పేడు.

# సుఖ జీవనానికి కీలకం అధిక ఉత్పత్తి

*మీ జీతంలో కొనుక్కోగలిగే వస్తువులు, సౌకర్యాలపై మీ సుఖజీవనం ఆధారపడి ఉంటుంది. పారిశ్రామిక శాంతి, అధిక ఉత్పత్తి సాధించబడితేనేగాని, ప్రణాళిక జయప్రదం కాజాలదు. పూర్తి ఉత్పత్తి అంటే పూర్తి వేతనాలూ, అధిక ధరలూను*



 

# సమర్పణ



అవధాని అన్నీ విన్నాడు. ఒక్కొక్క విషయమే వింటుంటే శరీరం మనస్సు తేలిక పడినట్లు అయ్యింది. ఒక్క అనుమానమాత్రం పీడించింది. “కులమేమంది?” అని అడగాలను కున్నాడు. పైగా అతని ఇంటిపేరును బట్టి చూస్తే శాఖాభేదం కన్పడింది. ఈ శాఖా భేదాల పట్టింపులు గుంటూరుజిల్లాలో చాలా ఎక్కువగా వున్నాయన్న ప్రతీతి ఒకటి వుంది. మరి ఓ వేళ ఇతను ఆమె ఒప్పుకున్నా. వాండ్లవాళ్ళు ఆమోదిస్తారని ఎక్కడుంది? పైగా శశి వితంతువని రమణ మూర్తికి తెలుసోలేదో అన్న అనుమానం కూడా కలిగింది.

“ఆవిడ వితంతువు. అది మీకు తెలుసా రమణమూర్తిగారూ?”

ఎగిరి గంతేసేడు రమణమూర్తి వెంటనే.

“నిజంగా?” అని ప్రశ్నించాడు.

“అవును.”

“ఎప్పుడూ అలా వ్యక్తీకరించలేదే.”

“చిన్నప్పుడే పోయేడు. ఆమెకు తెలియనే తెలియదు.”

రమణమూర్తి మౌనంలో పడిపోయేడు. ఆ రాత్రల్లా అతను నల్లులమధ్యకంటె, మనస్సులోని సంక్షోభంతో నిద్రపోలేదన్నది, ఉదయాన్నే కనుపాపలు పీచివుండి కళ్ళు ఎర్రగా వుండడంతో అవధాని పసికట్టేసేడు.

శశీ నిద్రపోలేదు. ఆశించిన ఫలం తనకు కాకుండా మాయమైపోతుందేమో అన్న కల్లోలంలో పడిన తను ఏమంటాడు? ఒప్పుకుంటాడా? త్రోసిపుచ్చేస్తాడా? ఈ ప్రశ్నకు ఒకవేళ త్రోసిపుచ్చడమే సమాధానమైతే తను ఎలా సహించగలదు?

అయినా ఆ రాత్రి అతను చెప్పిన శశి గుణాలను చర్యలను విని శశి ఎంతగా మారి పోయిందో అన్న,భావంవల్ల కలిగిన వాత్స ల్యంలో కళ్ళు చాలాసార్లు తుడుచు కున్నాడు.

“మీరు సి. పి. ని ఎరుగుదురా?” అన్నాడు ఉదయం.

“అంటే?”

“చలపతి. కమ్యూనిస్టు నాయకుడు. అగ్ర హారం సోమయాజులుగారి కొడుకు.”

“కమ్యూనిస్టా!”

“అవును. పెద్ద పక్కగోడుగు నాయ కుడు అయిపోయేడు ఇప్పుడు. పైగా నీతి జాతిలేని ఆ రెడ్డి సీతమ్మని పెండ్లి చేసుకుని ప్రభుత్వానికి కుడిభుజంకూడా అయ్యేడు!” అని రమణమూర్తి చెప్పడంతో అవధానికి దిమ్మతిరిగి నట్లయ్యింది.

“వాడి వివాహమే పెద్ద సంస్కరణ, పెద్ద చైతన్యంట! వాడి వాక్కులు వేదా లట. వీళ్ళందరూ కలసి దేశాన్ని మంట పెట్టేస్తున్నారు.”

“మరి....”

“ఉన్నవాళ్ళంతా జైళ్ళల్లో వున్నారు. ఇంక మిగిలినవాళ్ళు పగపట్టినట్లు తరుముతు న్నారు. మూడువాళ్ళ ముచ్చట గాక పోతే గదా వీళ్ళ బతుకు!” అని అక్కసు ప్రదర్శించేడు.

తాను ఎంత గొప్పవంశంలో పుట్టేడు! ఒకతల్లి రక్తం పంచుకుని పుట్టిన వాళ్ళల్లో ఒకరు వంశ సంప్రదాయాల్లో నడవడం, రెండోవాడు వ్యవసాయం చెయ్యడం, తను ఈ రాజకీయాల్లో జైల్లో ప్రవేశం, ఆఖరి వాడు పాశ్చాత్యుల వ్యామోహాల్లో పడి తిరుగు బాటు సాగించడం విచిత్రంగానే తట్టింది.

ఇక ఆ మిగిలిన ఒక్క ఆడపడుచూ కూడా, తనలాగే దేశం, స్వాతంత్ర్యం అంటూ శిక్షలు అనుభవించడం అన్నది ప్రత్యేక సృష్టి వైచిత్ర్యంలాగే వుంది. తండ్రి హృదయం ఎంత అటుమటించి పోతోందో, మాతృదేవత ఎంత కృంగి పోతోందో అన్న మానసికమైన అలజడి బయలుదేరింది.

విడుపాయలు ఎప్పటికైనా కలుస్తాయా? అవి మళ్ళీ ఆకొంప చేరుకుని అడిగిమణిగి వుంటాయా అన్నది పెద్ద సందిగ్ధంగా వుండి పోయింది అవధానికి.

చైతన్యం, మార్పు, సంస్కరణ కావాలని ఏంత ఎలుగెత్తి అరచినా, ఆ మార్పు ఆ చైత్యం ఎందులో వస్తే విషయం నిర్ధారణ కాకపోతోంది. పురోగమనం తోపాటు తిరోగమనం, వెలుగుతోపాటు నీడలా ఇరు కథలా ఎంతచూసినా ప్రతిబింబిస్తూనే వున్నాయి. సమన్వయంగాక తరమతమై పోతూనే వున్నాయి.

మత ప్రాబల్యం తగ్గడానికైనా అన్న అపోహ కల్గింది. వర్ణాశ్రమ ధర్మాలు లేనే లేవు. అవన్నీ చరిత్రలో అలాగే ఉండి పోయేయి. మతాచారాలా అవి ఎక్కడో నక్కేను. ఇక మిగిలినవా? .....

తను చదివేడు క్రైస్తవమత గ్రంథం బైబిలు మహమ్మదీయ పవిత్ర గ్రంథం ఖురాను క్రీస్తుదేవుడైతే జననం ఎవరికి అన్న విషయంకాని, షియ్యా సున్నీ విభేదాల్లో కూడిన ఆచారాలను తర్కించడంకాని అన ర్థంగా కనిపించింది. దాంతో ఇవన్నీ ఓ సామాజిక వ్యక్తిత్వం కొరకు సృష్టింప బడినట్లు కన్పించేయి.

ఇక హిందూమతమా? ఆదియుగాల నాటి నుండీవుంది. దానిలో ఏమున్నదో ఏదీ లేదో కూడా ఎవరికీ తెలియకపోయినా నిండుకుండ నడుగాని తొణకది. ఇక దాని విషయం కాస్తో కూస్తో తెలిసినవారు తమ స్వార్థ సంతృప్తినిమిత్తంకోసం దాన్ని సంపుటీకరించేరు. భాష్యాలు చెప్పేరు. ఒక్కరుకూడా దాని పొలిమేరల్లోకి వెళ్ళి నట్లు కన్పించటంలేదు.

ఒకరిగొడవ ఎందుకు? దాని తత్వ మేమిటో తనకే తెలియదు. తెలియదని తనే ఒప్పుకోలేదు.

తనను పూర్తిగా తనే చెప్పుకోవాలంటే మతం, రాజకీయం, ప్రగతి, కీర్తికండూతి, సంక్రమించాయి రూపులేని ఓ మట్టిబొమ్మ లాగే వుండిపోవడం జరిగింది.

ఊహలా వచ్చేసరికి అవధానికి నవ్వరాని నవ్వు వచ్చేసింది. రమణమూర్తి తెల్లబోతూ “ఏం? అల్లా నవ్వుతున్నారు?” అన్నాడు.

“యుగధర్మం.” అన్నాడు.

“ఏమిటది?”

“ఇదంతా” ఓసారి చెయ్యికలయ చూపిస్తూ...

అర్థంకాక రమణమూర్తి తికమకపడ్డాడు.

అతర్వాత వారంలో జాలకు మొత్తం జైల్లోవున్న కాంగ్రెసు వాళ్ళంతా “జైలు అధికారులు పెట్టేభోజనం గొడ్లుకూడా తినవు. వారు చూపించే కాఠిన్యం మితిమీరు తోంది. వీటి పరిహారార్థం సమిష్టిగా నిరాహార దీక్షకు పూనుకున్నారు అన్న వార్త ఆమూలనుండి ఈ మూలవరకూ ప్రాకి పోయింది. గుండెల్లో రైళ్ళు పరిగెత్తేయి. కాళ్ళు తప్పట్లు ఎక్కువయ్యేయి. ముక్కు లోంచి పాలు కక్కించడంకూడా వమ్మయి పోయింది.

ఇరవై నాలుగు ఘంటల్లో రమణమూర్తిని రాజమండ్రీ సెంట్రల్ జైల్లోవున్న ఐసో లేటెడ్ సెల్లో పెట్టేందుకు ఉత్తర్వులు వచ్చేయి. —ఇంకావుంది]



# వనితాలోకం

## సుందరశిల్పాలతో

# విలసిల్లు పానుగల్లు

టి. వి. అనసూయాదేవి
(సికిందరాబాద్)

నల్లగొండ జిల్లాలో పానుగల్లు అను గ్రామము శిల్పకళకు ప్రసిద్ధిగాంచినది. మేమందరము దీనిని చూచుటకుగాను వెళ్ళినాము. ఈ గ్రామమునందు మూడుదేవాలయములున్నాయి. (1) ఛాయల సోమన్న ఆలయము. (2) చెన్నకేశవాలయము (3) వెంకటేశ్వర్ల ఆలయము.

మేము మొదట ఛాయలసోమన్న ఆలయము చూచుటకు వెళ్ళాము. ఇది గ్రామమునకు తూర్పున ఉన్నది. ఈ ఆలయమున కన్నివైపులా చల్లని మెల్లని పిల్లగాలులు వయ్యారముతో ప్రవహిస్తూ ఉంటాయి. ఎల్లప్పుడు కోలాటాల ఆటపాటల కోలాహలం వినిపించే రైతుకూలీల కలకల ధ్వనులు—పక్షుల కిలకిలారవములు, సొంపు నింపుచుండును. అటువైపు సముద్రము వంటి చెఱువు దానితూములనుండి ప్రవహించు జలముయొక్క ధ్వనులు, ఇటు ఆలయము ముందర టెంకాయలోని నీరువలెనుండు చక్కని కోనేరు, ఆ కోనేరుచుట్టూ కనులపండువ చేయు జమ్మిచెట్లు, తుళ్ళితుళ్ళిపడే చేపల మెరుపులు——...అంతా అందమైన కలలా ఉంటుంది.

ఈ ఆలయముచుట్టు పెద్దశిలలచే నిర్మించిన ప్రాకారము కలదు. ఈ ప్రాకార కుడ్యమునకు, తూర్పున, పడమర జనులు పోవుటకు దారులున్నాయి. ఈ దారులపైన మండపములు నిర్మించారు. పడమటి దారివద్ద నిర్మించిన మండపముపై మరియొక మండపము నిర్మించారు. ఒకచోట కొన్ని నాగుపాముల విగ్రహములున్నాయి. వీనిని చూచినచో భయము కలుగును.

ప్రధానాలయములోని ప్రతిమ కెదురుగా అబ్బురమును కలిగించు నొక దివ్యమైన నంది కలదు. ఇది మూర్తీభవించిన శిల్పకళా దేవతయో యనునట్లు చూచువారిని ముగ్ధులను చేస్తుంది. ఈ విగ్రహము శిల్పకళా మండితమై ప్రకాశించునట్లు శిలలను వెన్నపూస చేసుకుని శిల్పులు తమ ప్రౌఢిమను చూపినారు. ఈ నిర్మాణములో ప్రతి అంశమునందును సౌందర్యమును పోత పోసినారు. ఈ విగ్రహము అద్దముకన్న నునుపుగా నున్నది. ఆనాడు పెట్టిన మెఱుగు యిప్పటికిని చెక్కుచెదరక తళతళ మెరయుచు, చూచువారి ప్రతిబింబములు కన్పించు నన్పించును. దీని మూపురము దృఢముగా, దీర్ఘముగానుండి వెనుతిరిగి, పోటీ కోపెలమేటివలె కన్పించును. ఈ నంది మెడకు చుట్టబడిన గొలుసు చెక్కడము గాంచినచో నిజమైనగొలుసే అనిపించును. దానిని బంధించి త్రాడు వేసినవిధము—ముల్లు వేయు క్రమము, త్రాటినిర్మాణము మెడకు వీపునకు అలంకరించిన గంటల వరుసలు, ముత్యాలవరుసలు, గజ్జెలవరుసలు దానిపైనున్న మెఱుపు వర్ణనాతీతము. ఆనంది పడుండినరీతి. దాని కాళ్ళమడుపులు చూచిన—యదార్థముగా నిచ్చట నొక యాంబోతు పడుండినదా యనిపించును. ఆ శిల్పమును చూచిన నే తనివితీఱను. కాని ఎంత చెప్పినను తక్కువే! ఈ శిల్ప విగ్రహము శిల్పకళ అనుపాలను చిలికి తీసినవెన్న వంటిది.

ఈ ఆలయమునందు ఇరువదిరెండు స్తంభములున్నవి. ఈ స్తంభములలో నొక దానిపై మూడంగుళముల చతురములో—చేపలు, బల్లి, తాబేలు, మొసలి, ఏనుగు, ఎండ్రకాయలు మొదలగు జంతువులున్నవి. అన్ని స్తంభములపైనా శిల్పకళ ఉట్టిపడుచున్నది. ఇచ్చట శిల్పములగాంచిన ఆ కాలములో ఉన్న పలువిధములైన ఆయుధములు, వాహనముల గురించి విశేషములు తెలిసికొనవచ్చును.

గర్భాలయములో ఎల్లప్పుడు లింగము మునుగునంతవరకు నీరుండును. ఈ ఆలయమునందొక చిత్రమైన విశేషము కలదు. అది ఏమనగా! ఆలయద్వారమువద్ద మనము నిలుచుండి చూచిన మననీడ లింగముపై బడక, లింగమున కెడమ, కుడివైపుల మాత్రము పడును. ద్వారము వద్ద మనము కుడిప్రక్క నుండి చూచిన మన నీడ లింగమున కెడమ పార్శ్వమున కన్పించును. ఎడమప్రక్క నుండి చూచిన లింగమునకు కుడివైపున నీడ పడును. లింగమునకు చక్కగా పై భాగమున స్తంభపునీడ పడును. ఇది ఏ స్తంభపు నీడో తెలుసుకోలేము. ప్రధానాలయమున కీశాన్యమునమున్న ఆలయములో మనము ద్వారమువద్ద నిలుచున్నప్పుడు మనకు యెదుట గోడపై మూడు నీడలు, ప్రక్క రెండు గోడలపై రెండు నీడలు, మొత్తము ఐదు నీడలు పడును. కప్పు లోపలి వైపు తొమ్మిది విగ్రహములు ఉండేవట. వీటిని పిండారీలు ధ్వంసం చేశారట. ఆ

పాపాత్ములకు చేతులెట్లా వచ్చాయో! వానిని ఖండించటానికి.

* * *

ఈ ఆలయమును చూచినతరువాత పచ్చల సోమన్న ఆలయమునకు వెళ్ళాము. ఈ ఆలయము గ్రామమున ఉత్తరభాగమున నున్నది. ఈ ఆలయమునకుచుట్టూ పచ్చనిచెట్లు చల్లని నీడనిస్తూ శీతలంగా ఉంటాయి. పూల మొక్కలు ఏపుగా పెరిగి మధుర పరిమళాలు గుబాళిస్తూ ఉంటాయి. ఇందలి శిల్పకళ అత్యద్భుతమైనది.

ఈ ఆలయమునకు చుట్టనున్న కుడ్యము క్రిందినుండి పెద్దరాళ్ళను తామరరేకులవలె చెక్కి మూలలుమూలలుగా ఒక గజమువరకు అమర్చారు. ఆపైన ఏనుగుల వరుసలు, ఇతర జంతువుల వరుసలను చెక్కినారు. అచ్చటచ్చట కొన్నిచోట్ల చక్కని పనివాడితనం గల చిన్నచిన్న ద్వారములు కన్పించును. ఆపైన క్రమముగా వెడల్పు తగ్గుచు పైకి పోనుపోను శిఖరము అగుపడును. ఆలయ కుడ్యములపైన అనేక స్త్రీ పురుషుల రూపములు కన్పించును. స్త్రీలు అనేక నగలు ధరించియు, పలువిధములుగా నాట్యము చేయుచును కాన్పింతురు. స్త్రీల సిగలకు, మెడలకు హారములవంటి నగలు, దండకడియములు, ముంచేతి కంకణములు, కాళ్ళకు కడియములు, గొలుసులు మట్టెలు చక్కగా చెక్కారు. ఇంకను మొలనూలువంటి ఆభరణములు, దండలు, శింకులు, గోచీ కలిగయుండిరని కావులకుకూడ చక్కని ఆభరణములు కలిగియుండిరని తెలియును.

స్త్రీలు అద్దము దువ్వెనతో తమ శిరోజములు ముడుచుకొనునట్టి శిల్పములు కలవు. నృత్య గీతవాద్యము లున్నట్లు తెలియును. మద్దెల డక్క, వీణవంటి వాయిద్యములును, బాణము. అమ్ము, సుత్తి గొడ్డలి మొదలైన పనిముట్లను ప్రజలు వాడినట్లు గోచరించును.

స్త్రీలు పొడవైన జడలు కలిగియున్నట్లు తెలియుచున్నది. ఇందలి స్త్రీ విగ్రహము లన్నియు, నాట్యభంగిమలలో ఉన్నవి. నాటి ప్రజలు, కుక్కలను, పావురములను పెంచుచుండినట్లు యిందలి శిల్పములచే ద్యోతకమవును. బాలభానుని అరుణ కిరణములచే అప్పుడే వికసించి గాలి కల్లోలాడినట్లు కనిపించు సుకుమార కుసుమములు చూపరుల తన్మయుల నొనర్చును ఆ కాలమునాటి, రథగజతురగ పదాతిదళముల యుద్ధరీతులు చక్కగా చిత్రించారు.

ఇందలి స్తంభములపై రామాయణ, మహాభారతములలోని కొన్నిఘట్టములను చక్కగా చిత్రించారు. దశావతార చిత్రములు, క్షీరసాగరమథనము, దేవాసుర సంగ్రామము, అప్సరసల నృత్యములు, సౌందర్యము తాండవించునట్లు చిత్రించారు.

ఇందు ఒక ప్రధానాలయము ఏనుగులు మోయుచున్నయట్లు ద్వారమున కిరు ప్రక్కల రెండు ఏనుగుల తలలు మాత్రము కన్పించును. ఈ ఆలయములో మధ్యన ప్రఖ్యాతి చెందిన స్తంభములు నాలుగున్నవి. ఇవి యిప్పటికిని నునుపు, మెఱుపు చెక్కు చెదరక చక్కగా యున్నవి.

ఇందు ఒక పెద్ద నందికలదు. ఈ నందితలను కొట్టి చూచిన లోహముల (కంచు) శబ్దము వినిపించును మిగిలిన భాగములో నట్లు వినిపించదు.

తరుపరి వెంకటేశ్వర ఆలయమునకు వెళ్ళాము. ఇది మిక్కిలి వున్నతమైనది ఈ ఆలయమునందు ముప్పదియారు స్తంభాలున్నాయి. ప్రధానాలయమునకు ప్రక్కన నొక రాతి ఫలకముమీద ఈ ఆలయమునకు సంబంధించిన విషయములు వ్రాయబడి వున్నాయి. ద్వారమున కిరుప్రక్కల రాతిపై చక్కని ముత్యాల తోరణములు అలంకరించినట్లు చెక్కబడినవి. ఆలయమునకు పై భాగమున దశావతారములు చెక్కబడినవి. ఆలయమునకు నాలుగు మూలలకును, మధ్య భాగమునను రాక్షస విగ్రహములు వంగినట్లును వారి విపులమైన ఆలయము నిర్మింపబడినట్లుండును. శ్రీ మహావిష్ణువు చేతిలో శంఖ చక్రములు చక్కగా నేటికిని మెరయుచున్నట్లున్నవి.

ఇట్టి శిలాఖండములను ఆ శిల్పులెన్ని సంవత్సరము లెంతమంది తమ జీవితములను ధారపోసి నిర్మించారో కాని నేటికిని ఈ అద్భుత శిల్పకళ వారి నేర్పరితనమును చాటుచున్నది. ★

### అధిక ప్రేలాపన

ఒకడు: "మీ ఆఫీసులో బోనసు ఇచ్చారటగా?"

మరొకడు: "ఏం లాభం? నిద్రలో బిగ్గరిగా మాట్లాడటం నాకలవాటు. ఆసంగతి కాస్తా మా ఆవిడ వినేసింది."

# [illegible] వంటకాలు ★

## ఢోక్లా

కావలసిన సామగ్రి: పచ్చి శనగపప్పు, చాయ మినపప్పు, బియ్యం మూడూ సమపాళ్లలో తీసుకొని బాగుచేసి మిషనులో సన్నని రవ్వ పట్టించాలి.

చేయు విధం: ఢోక్లా ఉదయం చేస్తామనగా రాత్రి ఒక కళాయిపాత్రలో చిటికెడు పసుపు, తగినంత టేబుల్ సాల్టు వేసి, చిక్కని మజ్జిగతో గాని, పెరుగుతో గాని, యీ మూడూ, యిడ్డీపిండివలె కలిపి, మూత వేసిఉంచి, ఉదయం చిటికెడు సోడా వేసి కలిపి, యిడ్లీలవలె ఆవిరిమీద ఉడికించి, తరువాత పదునైన చాకుతీసుకొని దానికి నెయ్యి రాసి డైమన్సుకోసి, కళాయిలో పోపు వేసి సన్నని సెగలో పది నిముషాలు వేగనిచ్చి, సాయంత్రం టిఫనుగా తీసుకోవచ్చు.

ఒకమాట: మిషనులో పట్టించిన రవ్వలో పిండి గనక ఉంటే పిండిజల్లెడతో జల్లించి తీసెయ్యాలి. పోపు వేశాక, గరిటతో కలపకుండా గిన్నె పళంగా కుదపాయించాలి. గరిటతో కలియబెడితే ముక్కలు (డైమన్స్) చితికిపోతవి. గుజరాతీలు సోడాకు బదులు 'పప్పిడీ'అ నేది వాడతారు. వారికి అది దొరుకుతుంది గనుక. దానిని వారు అప్పడాల్లో, అప్పడప్పువ్వుల్లోకి కూడా ఉపయోగిస్తారు.

## చక్లీ

దీనికి కావలసిన సామాన్లు: సవాశేరు బంగాళాదుంపలు, పౌను సగ్గుబియ్యం, అర్ధశేరు సన్నని బియ్యంరవ్వ.

తయారుచేసే పద్ధతి: చక్లీ ఉదయం తయారుచేస్తామనగా సగ్గుబియ్యం బాగుచేసి రాత్రి నానవెయ్యాలి. ఉదయం ఉర్లగడ్డలు ఉడికించి పొట్టు తీసి మెత్తగా పిసికి రవ్వ జల్లెడలో (యినపది) యీ గుజ్జు వేసి రుద్దితే క్రిందికి మెత్తగా కాటుకవలె పడుతుంది. ఏమాత్రం ఉండ ఉండకూడదు. పిసికితే మెత్తగానే ఉంటుందనుకోకండి. ఈ రుద్దిన ఉర్లగడ్డ గుజ్జును ఒకప్రక్క ఉంచి బియ్యం రవ్వ పిండి లేకుండా జల్లించి ఒకే సైజు రవ్వ (అంటే కొంచెం పెద్దదీ, కొంచెం చిన్నదీ కాకుండా అన్నమాట) కళాయి గిన్నెలో ఉప్మావలె మెత్తగా ఉడికించి (పోపు అవసరంలేదు) నానిన సగ్గుబియ్యం శుభ్రంగా కడిగి, బంగాళదుంపల గుజ్జు. ఉడికించిన రవ్వ, కడిగిన సగ్గుబియ్యం, తగినంత టేబుల్ సాల్టు కొద్దిగా పచ్చికారం, కొద్దిగా సోడా యివన్నీ వేసి జంతికలపిండివలె కలిపి పువ్వుల బెజ్జాలుండే చక్రాలగొట్టంలో వేసి, తడిగుడ్డమీద వడియాలవలె వత్తాలి. బాగా ఎండిన తరువాత, గుడ్డకు వెనుకవైపు నీళ్ళు చిలకరిస్తూ ఊడదీసి ఒకపూట మళ్ళీ ఎండనిచ్చి డబ్బాలో పోసుకొని, కావలసినప్పుడు కొంచెం తీసి, కళాయిలో చమురుపోసి పొయ్యిమీద పెట్టి కాగనిచ్చి యీ చక్లీ వేస్తే పొంగుతవి. అప్పుడు తీసేసి తింటే భలే రుచిగా ఉంటవి. ఆటునైపువారు సాయంత్రం ఎవరయినా వస్తే 'టీ' చేసి యివి వేయించి నిముషంలో అతిథిని గౌరవిస్తారు. గుజరాతీవారు యీ బియ్యం రవ్వ బజార్లో కొనుక్కుంటారు. చక్కగా రవ్వగా గుండ్రంగా ఉంటుంది వారి రవ్వ. మనం జాగ్రత్తగా పట్టించుకొని ఒకేమాదిరి రవ్వ చెరిగి తీసుకోవాలి. యీ చక్లీ, టిఫిను క్రిందా, కూరలేనప్పుడు చారులోకి, ఆధారంగా రెండువిధాలుగా ఉపయోగపడుతుంది.

**కొత్తపల్లి రాజ్యలక్ష్మి**
**కొవ్వూరు**

## బటాటో వడ

కావలసిన వస్తువులు :- ఉర్లగడ్డలు సవాశేరు. తాజాశనగపిండి అర్ధసవాశేరు. డాల్డా అరపౌను, కొద్దిగా పచ్చికారం, చిటికెడు సోడా.

చేసేవిధం :- ఉర్లగడ్డలు బాగా ఉడికించి పొట్టు తీసి, పిసికి ఒకప్రక్కయుంచి, కళాయిలో కొంచెం నూనెగాని, డాల్డాగాని వేసి, కొద్దిగా ఉల్లిచెక్క పచ్చిమిర్చిచెక్క కొంచెం ఆవాలు, మినపప్పు కరివేపాకు వేసి వేగాక, పిసికిన ఉర్లగడ్డముద్ద వేసి, తగినంత మెత్తని ఉప్పు చిటికెడు పసుపు వేసి పదినిముషాలు సన్నని సెగలో వేగనివ్వాలి. కారం ఎక్కువ కావలసినవారు, కొంచెం పచ్చికారం వెయ్యవచ్చు. దించేముందు కొంచెం జీడిపప్పు చిన్న ముక్కలు చేసి విడివిడిగా అందులో పెట్టి, వెడల్పయిన స్టీలు పాత్రలో మెత్తని ఉప్పు, కారం, సోడా శనగపిండి వేసి, నీళ్ళతో గరిటజారుగా కలిపి, పొయ్యిపై బాణలి పెట్టి, డాల్డా వేసి కాగిన తరువాత యీ బిళ్లలు జాగ్రత్తగా ఒకటొకటిగా, యీ పిండిలోముంచి బాణలిలో వదలాలి. రెండువైపులా దోరగా వేగనిచ్చి చట్రంతో దేవి చమురంతా ఓడిపోయాక, వేరొక గిన్నెలో వేసుకోవాలి.

ఉర్లగడ్డలు ఉడికించి యివన్నీ తిప్పలు పడలేనివారు ఉర్లగడ్డ చెక్కు తీసి, లేకపోతే గరుకు నేలకు వేసి రుద్దితే పొట్టు పోతుంది. చిన్న ముక్కలు తరిగి, మామూలుగా పోపు వేసి, యీ ముక్కలు వేసి, సరిపడినంత ఉప్పూ కారం వేసి కొంచెం నీళ్లుజల్లి, మూత వేసి ఉంచాలి. నీళ్ళన్నీ యిగరనిచ్చి దించే ముందు కొంచెం గరంమసాలా జల్లి చల్లారక మెత్తగా పిసికిగాని, రోట్లో వేసి రుబ్బిగాని, అవి బిళ్ళలు బిళ్ళలుగా చేసి పైన చెప్పిన విధంగా నె బటాటోవడ చేస్తారు.

## చక్కరపాళీ

కావలసినవి :- పావుశేరు తాజా గోధుమపిండి ఒకస్పూను మిరియాలు తగినంత ఉప్పు టేబుల్‌స్పూను కారం. కారం ఎక్కువ తినేవారికి! లేకపోతే మిరియాలే చాలు. కొంచెం పసుపు, కొంచెం జీలకర్ర, పెసరగింజంత యింగువ.

తయారుచేయడం :- జీలకర్ర, మిరియాలు, యింగువ పొడి చేసి గోధుమపిండి వెడల్పయిన పళ్ళెంలో వేసుకొని, తగినంత ఉప్పూ, పసుపు, పైన చెప్పిన పొడీ వేసి బాగా కలియబెట్టి నిమ్మకాయంత వెన్నగాని, కమ్మని పేరిన నెయ్యిగాని వేసి గట్టిగా రాయివలె తడిపిపెట్టి గాలి చొరకుండా మూతవేసి, రెండుగంటలు నాననిచ్చి రొట్టెల కర్రతో పలుచగా అప్పడాలవలె చేసి, పెనంలో మన చపాతీవలె కాల్చాలి బాగా నెయ్యిపోసి, రెండువైపులా ఎర్రగా కాల్చి, ఒక డబ్బాలో గాలివారకుండా మూతవేసి ఉంచిన పదిపదిహేనురోజులు నిలవఉంటవి. రోటీ అంతా సమమైన సైజులో చెయ్యాలి. లేకపోతే ఒకవైపు మెత్తగా ఒకవైపు గట్టిగా ఉంటుంది. గుజరాతీవారి రొట్టెల కర్రలు చూడ ముచ్చటగా ఉంటవి. చక్కగా సన్నగా చిన్నవిగా ఉంటవి. ఈ చక్కరపాళీనే కొందరు కటక్ రోటీ అనికూడా అంటారు. ఇందులో మిరయాలు, జీలకర్ర పడింది కనక పిల్లలు ఎన్నితిన్నా జబ్బు చెయ్యదు.

ఈ సేవరీస్ చేసిచూస్తారుకదూ! ఏదో చేశామంటే చేశామని గబగబా చేసేసి ఆపైన బాగు రాలేదంటే కాదు. నేను వ్రాసినట్లు జాగ్రత్తగా చెయ్యండి మరి ఎందుకురాదో చూద్దాం! ఒకరిద్దరు పోతేగాని వైద్యుడు కాడన్నట్లు అసలు చేతగానివారు అశ్రద్ధ

గలవారు మొట్టమొదటే అంతబాగా కుదరలేదని భయపడకండి! ఇందులో ఎక్కువ శ్రమపెట్టేవి ఏవీ లేవు.

## వెజిటబుల్ పరోటా

కావలసినసామాను:- కేబేజి, బంగాళాదుంపలు, కాలీఫ్లవరు, నూలుకోలుగుంప, పచ్చిమిరపకాయలు, అల్లం, వుల్లిపాయలు, కొద్దిగా పోపుసామాను, డాల్డాగాని, నేయిగాని, మంచిగోధుమపిండి.

చేయువిధం- కాబేజి సన్నగా తరగాలి. (చెక్కులాగ మంచిపువ్వు తరగాలి). నూలుకోలు సన్నగా కోయాలి. మంచిబంగాళదుంపలు తరిగి, అన్నికూరలూ వేరువేరుగా కడగాలి. తరువాత వేరువేరుగానే వుడకపెట్టాలి. బంగాళాదుంపలకి పైతొక్కతీసి అన్నిరకాల కూరలూ కలిపి తగినంత ఉప్పువేసి ముద్దలాగ చెయ్యాలి. తరువాత గంట ముందుగా గోధుమపిండి మంచిది చూసుకొని డాల్డా వేసి విరిచి నీళ్లుపోసి పూరీల పిండిమాదిరిగా, కలపాలి. తరువాత వుల్లిపాయలు, పచ్చిమిరపకాయలు అల్లం చిన్నముక్కలు చెక్కులాగా తరగాలి. తరువాత మూకుడుపొయిమీద కాలవేసి తగ్గడాల్డా వేసి పోపు వేయించుకుని తరిగివుంచుకున్న వుల్లి, పచ్చిమిరప, అల్లం, ముక్కలువేసి బాగా వేయించాలి. వాసనవచ్చినదాకా వేయించి అన్నికలిపి అందులో కూరలముద్దను వేసి బాగా కలిపి దించుకోవాలి. తరువాత గోధుమపిండి ముద్దను (చేతికి నేయిగాని, డాల్డాగాని రాసుకొని) బాగా మర్దించాలి. పెద్దనిమ్మకాయంత ముద్దలుచేసుకొని ఒక్కొక్కటి తీసుకొని అరచేతికి డాల్డారాసుకుంటూ పిండిముద్దను చదునుగా చరచి అందులో కూరలముద్దను (చిన్ననిమ్మకాయంత) పెట్టి బొబ్బట్లపూర్ణం పెట్టినవిధంగాపెట్టి, ముడిచి ఉండకట్టి మెల్లిగా అప్పడాల పీటమీద పిండివేసి వత్తాలి. కాస్తదళసరిగావత్తాలి. పల్చగా అయితే చిరిగిపోతుంది. తరువాత తావామీద వేసి రెండుపక్కలా కాలిన తరువాత డాల్డాగాని నేయిగానిపోసి వేయించాలి. దీనికి డాల్డాకాస్త ఎక్కువగానే వుండాలి. (పరోటా వేయించినట్టుగ). ఇది చేయుటానికి పరిశ్రమ ఎక్కువగాని, తినటానికి చాలా రుచిగా వుంటుంది. ఇవి 3, 4, కన్నా ఎక్కువ తినలేరు. కారం ఎవరి ఇష్టానుసారం వారు వేసుకొనవచ్చును. గరంమసాలాగుండ కొద్దిగా కూరల ముద్దలో కలుపుకున్నా బాగుంటుంది.

గాదె శేషాచలం జాజిపూరు,
(ఒరిస్సా)

## ★ ఎంబ్రాయిడరీ డిజైనులు ★

ఈ మూడు డిజైనులు పిల్లల లంగాలకు అక్కడక్కడా, ఫ్రాకులమీద, చోళీకైతే చేతులమీద కుట్టాలి. ఈ మధ్యచాలామంది చీరలమీద ఎంబ్రాయిడరీ చేసుకుంటున్నారు. తెల్లచీరలు, లేతరంగుచీరలు వాయిల్ లోగాని, క్రేప్ గాని తీసుకుని కుచ్చిళ్ల మీదకి వచ్చేట్టు 4 అం. పైన, కొంగుమీద, ముదురు రంగుదారములతో కుడితే చాల చక్కగా ఉంటుంది. ఏ చీరమీద కుట్టుకున్నారో, అదే డిజైను అదే రంగు చోళీకి కుడిచేతిమీద కుట్టుకుంటే బావుంటుంది. ఓపికవుండి, సరదావున్నవారు వచ్చిన రంగులో ఎంబ్రాయిడరీ చేసుకోవచ్చు.

సి. రాధ, (హైదరాబాదు)



★ ★





### కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో

# ఐక్యరాజ్యసమితి సహాయం

కుటుంబ నియంత్రణ సమస్యపై ఢిల్లీలో చర్చలు జరిపిన దేశదేశాల ప్రతినిధులు ఆఖరి రోజు గోష్ఠిలో కొన్ని ముఖ్యతీర్మానాలు చేశారు.

వ్యక్తిగతంగా ఎవరికి ఇష్టం ఉన్నా లేకున్నా, ఈనాటి జనాభా, అది పెరుగుతున్న తీరూ, పుట్టిన వారికి కావలసిన అన్నవస్త్రాలూ, వాటిని ఉత్పత్తిచేసే అవకాశాలూ, వనరులూ అన్నీ లెక్కవేసుకుంటే, ప్రతికుటుంబం, ప్రతిదేశం, తద్వారా ప్రపంచం అంతా జనాభా పెరుగుదలను పరిమితం చేసుకోనక తప్పదు అని ఈ సభలో చర్చలూ, తీర్మానాలూ తేల్చాయి.

అందువల్ల ఈ వ్యవహారాన్ని విడివిడిగా ఏ దేశానికి ఆ దేశం ఆలోచించుకోవడం కాకుండా, అన్ని దేశాలూ కలసి ప్రపంచమంతటా ఈ సమస్యను గుర్తించాలనీ, ఆపైన దీనిని పరిష్కరించుకోవాలనీ వీటి తాత్పర్యం. ఈ కారణంగా, ప్రపంచ దేశాలన్నీ కలసి నెలకొల్పుకొన్న ఐక్యరాజ్య సమితి అధికారరీత్యా ఈ సమస్యను గుర్తించాలని ఢిల్లీలో సభవారు (గతవారం కొన్ని వివరాలు ప్రచురించాము) కోరారు.

## మానవుల హక్కులు

మానవులు అందరికీ జన్మతః సంక్రమించే హక్కులను పేర్కొంటూ మానవులందరూ వీటిని మన్నించాలని సమితి ధర్మసూత్ర ప్రణాళిక ఘోషిస్తూ ఉంది. ఇపుడు సంతానాన్ని పరిమితం చేసుకోవడం, అలా చేయడానికి తగినమార్గాలను తెలుసుకోవడంకూడా మానవులందరికీ ఒక హక్కు అని అంగీకరిస్తూ, ఈ హక్కును ఆ ప్రణాళికలో చేర్చాలని ఢిల్లీలో అంతర్జాతీయ సభ వారు సమితికి విజ్ఞప్తి చేశారు. ఈ విధంగా ఈ ఉద్యమం బాగా సాగడానికి సమితి తోడ్పడాలని కోరారు.

అలాగే, సమితి ఆధ్వర్యాన పనిచేసే ఆహార వ్యవసాయ వ్యవహారాల సంస్థవారు ఆహార ఉత్పత్తి అభివృద్ధికి అమలు జరిపే కార్యక్రమాలలో, సంతాన నిరోధాన్ని ఒక ప్రచారాంశంగా చేర్చుకోవాలని కోరారు. అంటే, ఆహారం ఉత్పత్తి ఎంత పెంచినా, మరోవంక ఇంత వేగంగా జనాభా పెరుగుతూ ఉంటే ఈ సమస్య దారికిరాదు అని నచ్చచెప్పడం.

ప్రపంచ ఆరోగ్య సంస్థ అని మరొకటి ఉంది. దేశదేశాలలో వ్యాధుల నివారణకూ, చికిత్సకూ తోడ్పడడం దీని పని. సంతాన నిరోధం ఆవశ్యకతను అందరికీ నచ్చచెబుతూ ప్రచారం చేయడానికి ఈ సంస్థ కూడా పూనుకోవాలని మరొక తీర్మానంలో కోరారు.

## స్త్రీకే అధికారం ఇస్తే

నిజానికి, ఈ సమస్య పరిష్కారానికి ప్రచారం అంతముఖ్యమైన పని మరొకటి లేదు. మనమటుకు మనదేశం సంగతి ఆలోచిస్తే, బస్తీలలో ఉన్న కొద్దిమందికి తప్ప, పల్లెలలో ఉన్న కోట్లాది స్త్రీ పురుషులకు దీని గురించి ఏమీ తెలియదు. చెప్పినా తప్పంటుంటారు. ఒకవేళ విన్నప్పటికీ, సంతానం పట్ల చిరకాలంగా ఉండి బాగా వంటబట్టిన భావాలు ఒక పట్టాన వదలిపోవు, మారవు. మత సంబంధమైన విశ్వాసాలేకాక, కేవలం జీవితానికి సంబంధించిన ఆలోచనలూ, అవసరాలూ కూడా వీటిలో ముఖ్యపాత్ర ధరిస్తాయి. ముఖ్యంగా రెక్కాడితే గాని డొక్కాడని కుటుంబాలలో, ఒక బిడ్డ పుడితే, 'తిని పెట్టడానికి ఇంకో జీవి' అనుకోరు; మరి నాలుగురాళ్ళు గడించడానికి ఇంకో రెండు రెక్కలు అని సంతోషిస్తారు. ఇతరులలో కూడా తల్లిదండ్రులకు ఓపిక సన్నగిలే సరికి, బిడ్డ చేతికంది వచ్చి ఆదుకోవాలనీ, సుఖపెట్టాలనీ ఉంటుంది. వెనక ఆస్తిపాస్తులు లేనివారికి వృద్ధాప్యంలో అన్నం పెట్టేది బిడ్డలే అంటే కాదనగల వారెవరు?

వీరందరికీ మంచిచెడ్డలు నచ్చచెప్పాలి. కుటుంబ నియంత్రణం అంటే పొత్తిగా సంతానం లేకుండా ఉండడం అనికాదు అని తెలియపరచాలి.

దీనికి ప్రచారం చాలా అవసరం. భారత ప్రభుత్వం మొదటి పంచవర్ష ప్రణాళికతోనే దీనిగురించి ప్రచారం ఆరంభించింది. సంతాన నిరోధానికి సలహాలిచ్చే, శస్త్రచికిత్సలుచేసే కేంద్రాలను ఏర్పరచడం మొదలు పెట్టింది. అయితే ఈపని నూరింట పదిపాళ్ళు కూడా కాలేదు. పల్లెలలో రెండువేలూ పట్నాలలో 5 వందలూ కుటుంబ నియంత్రణ కేంద్రాలు పెట్టాలి అనుకుంటే ఇప్పటికి స్థాపించినవి దేశం మొత్తంమీద 795 మాత్రమే. వీటిలో గ్రామీణ కేంద్రాలు 495; బస్తీలలో 800 ఉన్నాయి. అరులక్షల గ్రామాలలో వర్థుతున్న 40 కోట్ల జనులకు అవసరమైనన్ని సదుపాయాలు జరగాలంటే నిజానికి ఈనాడు మనదేశంలో ఉన్న ఆస్పత్రులన్నీ చాలవు. డాక్టరందరూ పనిచేసినా సాలుకు 50 లక్షలచొప్పున పెరుగుతున్న ఈ జనాభా సమస్య పూర్తిగా దారికిరాదు. అందువల ఈ సదుపాయాలన్నీ జరిగేలోగా మరొకవంక ప్రచారం బాగా జరగాలి. ఆడవాళ్ళకు ఈ సమస్య మంచిచెడ్డలు బాగా అర్థం కావాలి.

నిజానికి స్త్రీకేగనక ఈ విషయంలో అధికారం ఉంటే ఈ సమస్య చప్పున చక్కబడుతుందని ఒకపత్రిక వ్రాసింది. కారణం ఏటేటా పురుళ్లు పోసుకోడం, నీరసంతో తీసుకోడం, పిల్లలతో, వాళ్ళ జబ్బులతో సతమతం కావడం ఎంతకష్టమో ఆడదానికే తెలుసు కాబట్టి, స్త్రీలు చప్పున ఈసమస్య గొప్పతనాన్ని గ్రహించనూగలరు, అధికారమే ఉంటే, కుటుంబ నియంత్రణం అమలు జరిపించనూ గలరు...

## మంచి పద్ధతులు

సంతాన నిరోధానికి అనుసరించతగ్గ మార్గాల మంచిచెడ్డలను పరిశీలించడానికి ఢిల్లీ సభ ఒక ప్రవీణుల సంఘాన్ని వేసింది. చాలా అనుభవం—విశేషించి సంతాన నిరోధం విషయంలో అనుభవంగల వైద్యులు, ఈ సమస్య మంచిచెడ్డలు బాగా ఆకళింపు చేసుకున్నవారు ఇందులో సభ్యులుగా ఉండి చర్చించారు. సంతాన నిరోధానికి "స్టెరిలైజేషన్" (శస్త్రచికిత్స ద్వారా సంతానం కలిగే అవకాశాలు తొలగించడం) చాలా మంచిపద్ధతి అనీ, ఈ ఆపరేషన్ వల్ల ఎవరికీ హానికలుగదనీ, యోగ్యమైన విధానంగా దీన్ని అంగీకరించవచ్చుననీ ఈ సంఘంవారు ఒక తీర్మానంచేసి మహాసభ ముందు పెట్టారు.

సభలో ఈ తీర్మానంమీద కొంత దుమారం రేగింది. "మిగతా వాటికన్న ఇది చాలా మంచిపద్ధతి" అనడం తనకు నచ్చలేదని ఇందుకు ఒప్పుకోననీ శ్రీమతి ధన్వంతి రామా

(5-వ పేజీ తరువాయి)

ఈ సంస్థ సంవత్సరం పొడుగునా నిర్వహించే కార్యకలాపాలను గురించి దేశంలో ఎన్నో వదంతులున్నాయి. ఈ వదంతులు నిరాధారమైనవే కావచ్చు కాని, సంస్థతో సహకరించే మంత్రులకు, ఉద్యోగులకు గౌరవప్రదమైనవి కావు. ప్రదర్శన నిర్వహణను ప్రభుత్వం హస్తగతం చేసుకోవాలనడం నా ఉద్దేశ్యం కాదు కాని కార్యనిర్వాహక వర్గంలో ఉద్యోగులను ప్రభుత్వ ప్రతినిధులుగా నియమించి, కార్యకలాపాలను అదుపులో ఉంచుకోడం మంచిది. ఏ సంస్థకీ బాధ్యతారహితమైన ప్రయోజనాలను పొందడానికి అర్హత ఉండకూడదు.

హైదరాబాదు ఆంధ్రప్రభుత్వ ప్రతినిధుల సమావేశాలు 1956 లో ఇక్కడ జరిగినప్పుడు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కేంద్ర సచివాలయ భవనాలు ఈ 82 ఎకరాల స్థలంలో నిర్మించబడాలనే పథకం ఆమోదించబడింది. ఆ పథకం ఇంకా ఉపసంహరించుకోబడలేదని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఏదో ఒక నిర్ణయం సత్వరం తీసుకోవడం సమంజసం.

## రేడియో పిల్లల కార్యక్రమం

ఆలిండియా రేడియో సంవత్సరానికొకసారి 'రేడియో వారం' జరుపుతుంది. ఈ సంవత్సరం పదకొండవ తేదీన రేడియో వారపు కార్యక్రమాలు ప్రసారం చేసింది ఆకాశవాణి, హైదరాబాదు.

ఉదయం ఎనిమిదిన్నరకి తెలుగులోను ఉర్దూలోను పిల్లల కార్యక్రమాలు ప్రదర్శించబడ్డాయి, ప్రసారం చేయబడ్డాయి. పిల్లలు ఎలా చేసినా బాగానే ఉంటుంది. వాళ్ళు బాగా చేయకపోడం కూడా బాగానే ఉంటుంది. ఈ సంవత్సరం పిల్లల కార్యక్రమాలు బాగా ఉండీ, బాగా ఉన్నాయి.

ముఖ్యంగా చెప్పాలి కుమారి డి. కృష్ణకుమారి నృత్యం. ఐదారు సంవత్సరాల ఈ బాలిక శివతాండవం చేసి చూపించింది రంగస్థలంపై. తాళం తప్పకుండా ఆమె చేసిన నృత్యం ప్రేక్షకులను కరతాళధ్వనులకు పురికొల్పింది.

ఈ కార్యక్రమం బాగుందంటే మిగిలినవి బాగులేదని కాదు. అన్నీ చూడ ముచ్చటగా ఉన్నాయి. అన్నింటిలో అది ఎక్కువ ముచ్చటగా ఉంది. ఈ పిల్లలను చూస్తూంటే, 'ఈ పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు కాకుండా ఉంటే ఎంత బావుణ్ణు!' అనిపిస్తుంది. ★

రావు (కుటుంబనియంత్రణ సంఘం అధ్యక్షురాలు) వాదించారు. ఈ ప్రవీణుల సంఘం ఈ సిఫార్సును సరాసరి సభముందు పెట్టడం బాగులేదనీ మహాసభలో ఏయే తీర్మానాలు చర్చకురావాలో నిర్ణయించే సంఘం ఒకటి ఉండగా దాన్ని తప్పించి ఇలా తేకూడదనీ ఆవిడ కార్యక్రమ విధానానికి సంబంధించిన అభ్యంతరం కూడా చెప్పారు. అక్కడినో అమెరికన్ ప్రతినిధి డా॥ బ్లాకర్ మద్రాసు ప్రతినిధి డా॥ ఆర్. ఎ. గోపాలస్వామి శ్రీమతి రామారావు గారి వాదం సబబు కాదని వాదించారు. ఈ పద్ధతి మంచిది అని తేల్చిన సంఘంలో పెద్ద పెద్ద వైద్యులంతా ఉన్నారనీ వారు ఏకగ్రీవంగా ఇది మంచిదన్నారనీ ఎవరి ద్వారా వచ్చినా రాకపోయినా, ఈ పద్ధతి మంచిదను అనడానికేమీ సందేహం కాదనీ వారు అన్నారు. ఇకపోతే "మిగతా వాటి కన్నా ఇది మంచి పద్ధతి" అన్న మాటలు కావాలంటే తొలగించడానికి సిద్ధమేనని గోపాలస్వామి గారన్నారు. సమస్య రోజురోజుకి పెరిగిపోతూ ఉన్నప్పుడు ఈ పరిస్థితిని గుర్తించి, ఇందుకు ఈ పద్ధతి మంచిది అని చెప్పుకోవడం తప్పేమీ కాదన్నారు.

అలా అయితే ఈ తీర్మానం ప్రకటించకూడదు అని శ్రీమతి రామారావు అన్నారు.

చర్చ అంటూ జరిగిన తరవాత ఆ సంగతి ప్రకటించడం న్యాయమనీ, ఈ తీర్మానం చేసేది కూడా అదేననీ డా॥ బ్లాకర్ అన్నారు.

బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు డా॥ జూలియన్ హక్స్లీ మాటాడుతు తీర్మానాన్ని మహాసభ స్థూలంగా ఆమోదించాలన్నారు.

అయినా శ్రీమతి రామారావు తనవాదం విడవలేదు.

తీర్మానాలను బలవంతాన ఆమోదింపచేయాలని తాము ప్రయత్నించడం లేదనీ, ఈనాడు పరిస్థితులు ఇలాటి తీర్మానం చేయవలసి వచ్చే ఘట్టానికి వచ్చాయని ప్రపంచం గుర్తించడమే దీనిలక్ష్యమనీ గోపాలస్వామి గారు అన్నారు.

ధన్వంతి రామారావుగారు ఒప్పుకోని కారణంగా, డా॥ గోపాలస్వామి, డా॥ బ్లాకర్ ఇలా వెనక్కుతగ్గి తమ మాటలు సర్దుకోవలసిన అగత్యం ఏమీ కనిపించటం లేదని ఇంకో సభ్యుడు అన్నారు.

చివరికి తీర్మానాన్ని మహాసభ పాలక వర్గం పరిశీలనకు పంపారు.

అంతర్జాతీయ కుటుంబ నియంత్రణ సమాఖ్యకు కొత్త అధ్యక్షురాలుగా స్వీడన్ మహిళ శ్రీమతి ఆటెసెన్ - జెన్సన్ను ఎన్నుకున్నారు. ❀

# వనితా వాణి



కుటుంబ నియంత్రణ సమస్యలపై, చక్కగా విమర్శగా వ్రాసి. తోటి సోదరీమణులను గృహమే స్వర్గసీమగా చేసుకోమని హెచ్చరిస్తున్న సోదరీమణులకు, 'ముచ్చటగా ముగ్గురుపిల్లలతో' వ్యాసం వ్రాసిన రచయిత్రికి, నా హృదయపూర్వక అభినందనములు.

పి. వి. సత్యవతి. (రాజోలు)

* * *

సత్యవతిగారు వ్రాసిన "ఎంతమంది పిల్లలు మీకు?" అన్న వ్యాసము చదివి ఎంతయో గర్వపడ్డాను. మగవారికన్న ఆడవారే దీనిగుర్చి ఇంత శ్రద్ధచూపి చర్చించుట గర్వించదగినది కాదా మరి?

దేశములోని వివాహితులంతా దీన్ని ఆచరణ చేసుకొని దేశం సుభిక్షము కావడానికి దోహదము చేయగలదని ఆశిస్తాను. చక్కని వ్యాసము వ్రాసిన సత్యవతిగారికి నా మనఃపూర్వక అభివందనములు.

టి. జయలక్ష్మి - గుంటూరు.

* * *

"ఆపరేషన్ చేయించుకొన్న తరువాత చిన్నపిల్లలు పోతే?" అన్న ఆలోచన చేయడం కన్న నీచం మరొకటి లేదు. ధైర్యం ప్రధానం కనికేనా.

ఈ విషయంమీద ముందే ప్రస్తావన జరిపిన ఉత్తరగారికి నా ధన్యవాదాలు.

యల్లాపంతుల సుశీలాదేవి (నాగపూర్).

* * *

రాజ్యలక్ష్మిగారు వ్రాసిన "భర్తలను పొగడే భార్యలు" అన్న వ్యాసం చాల సహజంగా ఉంది. వారు విభజించిన మూడు జాతుల్లోని మూడవరకపు స్త్రీలను గూర్చి నేనుకూడా ఒక విషయం చెప్తాను. వారు కేవలం తమ భర్తలను తిట్టటం మాత్రమే కాక తన పుట్టింటివారిని విపరీతంగా మెచ్చుకుంటారు. వారు మాట్లాడే ధోరణిచూస్తే తాను కాలుపెట్టడంవలన తన అత్తింటివారు సంస్కరింపబడి పునీతులౌతున్నారనే భావం వ్యక్తమవుతుంది. తామర కొలనులోనుంచి బురదగుంటలోకి వచ్చామనే విషయాన్ని పరోక్షంగా వెల్లడిస్తారు. మరి ఇట్టివారు సంస్కరింపబడేదెన్నడో.

వే. శ్రీనివాసాచార్యులు.

* * *

'భర్తలను పొగడే భార్యలు' అన్న వ్యాసంలో మూడురకాలవారిని రచయిత్రిగారు తెలిపేరు. మొత్తంమీద మూడురకాలవారూ సమాజంలో మెచ్చుకోబడటంలేదు. ఇంక ఎటువంటివారు సమాజానికి సరిపోతారో అర్థంకావటంలేదు.

భర్తలను దూషించే భార్యలు సామాన్యంగా చాలా తక్కువగా ఉంటారు. అందులో విచారిస్తే చాలమటుకు అందుకు భర్త ప్రవర్తనే కారణంగా కనిపిస్తుంది. కొంతమంది పురుషులు స్నేహితులతో, బంధువులతో చాలఅనుకూలంగా ప్రవర్తిస్తూ మంచివారని పేరు తెచ్చుకుంటారు. కాని అసలు సంగతిఎల్లా వుంటుందంటే ఇంట్లో ఈగలమోత, బైట పల్లకీలమోత. మనస్సుకుంటే చికాకులన్నీ ఇంట్లో భార్యాబిడ్డలమీద చూపిస్తారు. అందరికీ ధర్మరాజుగా కనిపించే ఈ వ్యక్తి భార్యాబిడ్డలపట్ల యమధర్మరాజుగా ప్రవర్తిస్తాడు. అటువంటి భర్తతో వేగటం ఎంత కష్టమో రోజూ వారిని చూచేవారికి అర్థం అవుతుంది. కాని నలుగురిలో చెప్పుకుంటే ఉపయోగమేమున్నదని అనవచ్చును. కష్టంగాని, సుఖంగాని మితిమీరినప్పుడు, మరొకరితో చెప్పుకుంటే మనస్సు కొంత తేలికపడుతుంది. దుఃఖము వచ్చినప్పుడు ఏడవటం, సంతోషం వచ్చినప్పుడు నవ్వటం మానవ సహజం. ఈ రెండు గుణాలు లేనివాళ్లు మానవాతీతంగా ప్రవర్తించే వేదాంతులు మాత్రమే.

జి. అంజనీదేవి, (కె. డి. పేట)

* * *

"ఒక్కగా నొక్క పిల్ల" అను వ్యాసంపై విమర్శిస్తూ ఫిబ్రవరి 18వ తేది పత్రికలో కె. రాధారాణిగారు (కరీంనగర్) వ్రాసిన లేఖ నాకు నచ్చినది. గారాబం తల్లి పుట్టింట్లో పనిచెయ్యకుండా ఉంటే, అత్తవారింటికి వెళ్ళాక అలవాటులేక పనిచెయ్యడం కష్టమే అవుతుంది. గాని రాధగారు దీనిలో తల్లితండ్రుల తప్పు ఉందనడం పొరబాటు. తలితండ్రులు ఎంత చెప్పినా పని చెయ్యనివారు ఉంటారు కాబట్టి దీనిలో తల్లితండ్రులతప్పు ఏమీ లేదు.

ఎన్. సవిత్రామణి (రాజోలు).

* * *

## మహిళాసంఘాలు

ఈ మధ్య ... నికి మహిళా మండలి సభ్యురాండ్రమందరము కుటుంబనియంత్రణ సమస్యపై చర్చించి అందులో సాధకబాధకాలు తెలుసుకోవడానికి ఒక ప్రత్యేక సమావేశం జరిపాము.

పురపాలక సంఘ ఆరోగ్యశాఖాధికారిణి శ్రీమతి డాక్టర్ బి. సరస్వతి (ఎం. బి. బి. ఎస్.) గారు మా సభకు అధ్యక్షత వహించారు. మనుమల్ని ఎత్తిన వృద్ధ మహిళలూ, పిల్లలు లేని వారూ ఉన్న వారూ చాలా మంది ఈ సభకు వచ్చారు.

అధ్యక్షురాలు డా॥ సరస్వతిగారు, సంతానం పెరగకుండా ముందు జాగ్రత్త పడడం ఎందుకు అవసరమైందో, ఇది ఎంత పెద్ద సమస్యయో వివరించి చెప్పారు. దీనికి ప్రవీణులు ఎంతో పరిశోధించి కనిపెట్టిన మార్గాలూ ఆచరణలో వాటి ఫలితాలూ చెప్పారు. ఇదంతా ఆచరణలోకి వచ్చి ప్రభుత్వం నెగ్గాలి అంటే మహిళంతా దీని మీద శ్రద్ధతీసుకొని తెలియని వారికి తెలియచెప్పి ప్రచారం చెయ్యాలన్నారు.

తరవాత కుటుంబనియంత్రణ విషయంలో మా అందరికీ సలహా, సహాయం కావాలని కోరుతూ ఒక తీర్మానం చేశాము. కొందరు పెద్దలకు ఇది పూర్తిగా నచ్చకపోయినా, మొత్తంమీద మంచిదే అని తీర్మానం క్రింద వారు కూడా సంతకాలు చేశారు.

హెల్తు విజిటర్ గారు ఈ కాగితాన్ని పై అధికారులకు పంపి, ఇక్కడ కుటుంబ నియంత్రణ సహాయ కేంద్రం స్థాపించడానికి ఏర్పాట్లు చేయుచున్నారు.

గండికోట రాజేశ్వరి,
(లేడీస్ రిక్రియేషన్ క్లబ్ కార్యదర్శిని, పెద్దాపురం)






# కొత్త 'ముఖాలు'

మన నటీనటుల కేశాలంకరణ శిల్పం కొద్దిగా మారినట్లయితే, చలనచిత్రకళ ఎవరెస్టు శిఖరాన్ని కాకపోయినా, కాంచన్‌గంగా శిఖరం అంత ఎత్తుకైనా పెరుగుతుందని ఈ మధ్య ఒక తమిళ చిత్రాభిమాని అన్నారు. ఆయన పేరు గుర్తులేదు. మాటవరసకి జగదలప్రతాపన్ అనుకుందాం.

సదరు జగదలప్రతాపన్ గారు, ఏ సినిమాకి వెళ్ళినా హీరోలజుట్టు చాలా ఎబ్బెట్టుగా కనిపిస్తోందట. జానపద హీరో అయితే చెంపలమీదకి దిగిన తిమ్మెర్లు, గిరజాలూ వగైరాలున్నూ, సోషల్ హీరో అయితే అప్పుడే తలంటి పోసుకున్నట్టు చింపిరి జుట్టున్నూ ఉంటాయిట. వాటి అడుగున, తొంగిచూస్తున్నట్టుగా ముఖాలు కనిపిస్తాయి. ఒకసారి అయితే అనుకోవచ్చు. ఏళ్లతరబడి ఇలాగే ఉంటుంది. శుభ్రంగా పాపిట తీసి నున్నగా తలదువ్వుకుని వాడికి కథలు రావేల అని ఆయనబాధ. హీరోయిన్‌ల స్థితి కూడా ఇదే. అబూర్వ చింతామణి దగ్గర్నుంచి, అంటుతోమే సుందరమ్మ దాకా అందరూ మేరీ ఆంటోనెట్ మార్కు హెయిర్ స్టయిల్ (వీలైతే జోసఫైన్ చేత చేయించుకోవడం)కు ససేమిరా తగ్గనివారే. సినిమా కెళ్ళేవాడు నోరుమూసుకు కథ చూసి ఆనందించి, కరిగిన గుండెతోనో, బరువెక్కిన గుండెతోనో ఇంటికిపోకుండా ఇలాజుట్టు పట్టుకు బెంగెట్టుకు ఇదవడం ఏమిటి మరీ ఇది కాకపోతే అని మనం ఇది కావచ్చు. కాని ఏం చేస్తాం. జగదలప్రతాపన్ గారి రసాస్వాదనకి ఈ జుట్టు ఎబ్బెట్టుగాతోచి అడ్డు తగులుతోంది కాబోలు. బహుశా నటులభావాలు దీనిచాటున మరుగైపోతున్నాయి కాబోలు. లేదా వారే అన్నట్టు విసుగెత్తి ఉండనూ వచ్చు. లోకోభిన్నరుచిః అందులో తమిళ చిత్రప్రేక్షకుల అభిరుచులు మనకేల అనుకుందాం. అయితే ఒకచిక్కు. పోలెడు తమిళచిత్రాలు తర్జుమా అయి మనకు వస్తున్నాయి. పోనీ అనుకున్నా, తెలుగు చిత్రాలంటే మోజుగల ఒక వెంకటేశ్వరరావుగారు కూడా ఇలాటి ఫిర్యాదే చేస్తున్నారు! నాగేశ్వరరావు దగ్గరనించి నయనప్పన్ దాకా, పాతికేళ్ల కుర్రాడివేషం వస్తే ఒకే తరహా క్రాపింగు అని!

* * *

ఈ దృష్ట్యా, ఇటీవల ఒక ఫిలింప్రముఖుడు కొత్త 'ముఖాల' కోసం చేసిన ప్రకటన గమనార్హమైనది.

హీరో హీరోయిన్ పాత్రలు ధరించడానికి కొత్త నటులు కావాలని ఆకంపెనీ ఒక హెచ్చరిక వేసింది.

ఇందుకు ఆశించే యువతీ యువకులకు సినిమామీద దారుణమైన మోజుండడం, హీనపక్షం మెట్రిక్ దాకా చదువుకుండడం, కాస్తో కూస్తో రంగస్థల, లేక నటనానుభవం

(60-వ పేజీ చూడండి)



విఠల్ ప్రొడక్షన్సువారి 'జయ విజయ' లో కాంతారావు, కృష్ణకుమారి.

# ★ చిత్రలేఖలు ★

ఆర్యా,

మన సంస్కృతినీ, కళనూ సినిమాలు పెంచి పోషించటంలేదని విశ్వసించి విశ్వసించే వారితో నేను ఏకీభవించను. మన ప్రాచీన కావ్యాలు, నవీన చిత్రాలు చాలా చదివి, చూశాను. కావ్యాల్లో హీరోయిను విప్రలంభంలో ఉన్నప్పుడల్లా చంద్రోపాలంభం చేయటం బాక్సాఫీసూత్రం. ఈ సూత్రాన్నే మన సినిమాలూ అనుసరిస్తున్నాయి. తెలుగులో ఏ జానపద, సాంఘిక, పౌరాణిక, పౌరాంఘిక జాన చిత్రం చూసినా చంద్రుడిమీద ఒకటో రెండో పాటలు పాడని హీరోయిను కనిపించదు. ఇది మన ప్రాచీన సంస్కృతిని పోషించటం కాక మరేమిటో? చంద్రుడు ఫొటో జెనిక్, పాటో జెనిక్ అని ఏ నాడో మన సినిమావారు గుర్తించారు. ప్రేమపీన రావటం భయం, అట్టి చంద్రుడిమీద హిట్టో విట్టో తిట్టో విసురుతూ హీరోయిను పాటపాడుతుంది. సినిమా తీయటానికి ధనం ముఖ్యమనీ, కథా కథనం ముఖ్యమని కొందరు అంటారుగాని నాకు నమ్మకంలేదు. బృందావన చందమామా, ఆనంద చందమామా మొదలైన తెలుగు సంస్కృతిపదాలు మిళాయించి పాటలు ముందు రాసుకుని వాటి చుట్టూ కథ అల్లి సినిమాతీస్తే ఎందుకు బాగా పోవు? 'చందమామా' పాటలు ఎక్కువగా ఉన్న సినిమాకు—అమెరికాలో ఆస్కార్ బహుమతు లిచ్చినట్లు — ఇండియాలో శేస్కార్ బహుమతు లివ్వాలని నా మనవి.

"మ్యూజిక్కు"

[కాబోయే మ్యూజిక్ డైరక్టరు]

* * *

ఆర్యా,

ముఖస్తుతి అనేది ఎలాటివారికైనా కాస్త ఇబ్బందే. అహంకారంలేనివారికి మరీను. అంగవల్ల అటువంటి సందర్భాలలో ఎవరైనా మొహంమీద పొగిడేస్తే అటువంటివారు, "నేను మీరన్నంత గొప్పవాణ్ణి/దాన్ని కాను" అంటారు వినమ్రత అభినయించి. అయితే ఇది అన్నిటికీ బాగుంటుందా అని సందేహం. ఆమధ్య ఒక పురాణచిత్రంలో ఒక మహాపతివ్రతను పట్టుకుని ఆవిడభర్త, దేవతలు మెచ్చేసుకునేసరికి, ఆకాశం కేసి తిరిగి, పాతివ్రత్య మాహాత్మ్యంలో ఒక చిటికెను మోడెస్టి (వినమ్రత) మిళాయిస్తే బాగుంటుందన్న తాత్పర్యంతో కాబోలు "ఆ. పోదురూ...మీరంతా ఏదో నామీద అభిమానంతో అలా అంటున్నారుగాని, నేను మీరనుకున్నంత పతివ్రతను కానులెండి" అనభావానికి సవిలాసంగా అభినయింపట్టింది!

ఇదేమన్నా "సెన్సార" పక్షంగావుందా అని మా ఆవిడ అంటోంది.

సెన్సారం.

* * *

ఆర్యా,

చలనచిత్రములలో బీదవాడి ఇల్లు సైతం కూడా జమీందారు భవనంలా పెద్దగా, సినిమా సెట్టింగులా అధునాతనంగా ఉంటున్నదని ప్రజలు హేళన చేస్తున్నట్లు కనిపిస్తున్నది. ప్రజలు పాపముపగల్లా అష్టకష్టాలూ పడతారు. పూర్ ఇళ్ళలో వుంటారు. అందువల్ల అందమైన పెద్దపెద్ద సెటింగులు చూట్టానికి మొహంవాచి ఉంటారు. కథలో బీద



సుధాకర్ ఫిలింస్‌వారి "వచ్చినకోడలు నచ్చింది" లో
ఎన్. టి. రామారావు. జమున.



# మధురగాయకుడు సంగీతదర్శకుడు

# రాజేశ్వరరావు

పుస్తకాలూ, వెన్నెల, సంగీతం, పొరుగింటివారి పాపాయి, స్నేహం, సంగీతం, కాలేజీకి వెళ్తున్న అమ్మాయి, మంచిపుస్తకం, సంగీతం, డబ్బు, ప్రశంసావాక్యం, శ్రీకృష్ణుడికథలూ, సంగీతం. రాజేశ్వరరావు పాట ఎల్లప్పుడూ, ఎప్పటికప్పుడూ మనసుకు హాయినిచ్చే తీయని వస్తువుల కోవలోవి. వయసుకు, వార్ధక్యానికీ లొంగనివి.

నిఘంటువులో 'శ్రావ్యసంగీతం' అనే మాటకి అర్థం వ్రాయడానికి మాటలు వెతికే శ్రమ పడకుండా చెప్పబగులు రాజేశ్వరరావు అని టూకీగా రాసే చాలు అని చాలామంది నమ్మకం.

అల్లవారివీధిలో చివరింటి మేడమీదనో, మైలున్నర దూరానవున్న బస్సుస్టాండుదగ్గర కాఫీక్లబ్బులోనో రాజేశ్వరరావు రికార్డు పెడుతున్నారుట అని విని, "అంతదూరము పరుగెత్తుకెళ్లి పాటవిని పొంగిపోతూ పరుగెత్తుకెళ్లి పోయేవాడిని" అని చిన్ననాటి ముచ్చటలు చెప్పేవారిలో ఈనాడు లాయర్లూ, డాక్టర్లూ, యాక్టర్లూ, గాయకులూ, సంగీతకారులూ ఎందరో ఉన్నారు. లలితసంగీతాభిమానులకు, గాయకులలో రాజేశ్వరరావు దేవతలలో కృష్ణుడి వంటివాడు. భక్తి గౌరవాలే కాక, ప్రేమను సంపాదించుకొన్న కంఠం ఆయనది. మధురస్వర సరోవరంలో రాజహంసలా సొగసుగా రీవిగా, పూదోటలో తేటిలా ఊహకి అంతనంత వేగంగా విహరిస్తుంది రాజేశ్వరరావు కంఠం.

అన్యులకూ ఆయనకూ గల ఒక ముఖ్యభేదం, రాజేశ్వరరావు సంగీతరచనా ప్రతిభ. ఓహో విభావరి, కలగంటి కలగంటి, కోపమేలరాధా, హాయిగా పాడుదునా, ఒంటిగా నుయ్యాల లూగితినా, పొదరింటిలోనుండి మొదలైనవి రాజేశ్వరరావు సంగీతరచనా నైపుణికి కూడా ఎప్పుడూ పచ్చని నిదర్శనాలుగా నిలిచే మచ్చుతునకలు. ఈ పాటలలో ఏది అన్నిటికన్న బాగుండేది అనివలువుకుర్తి కనుక్కుంటే, అన్నిటికీ అన్ని ఓట్లూ వచ్చేస్తాయి.

చలనచిత్రాలలో సంగీతదర్శకుడుగా రాజేశ్వరరావు ఏనాడో ఎన్నో కొత్త కొత్త పోకడలుపోయి ఎన్నో మనోహర విన్యాసాలు చేశాడు. అనువాతినం అనబడే నేటి బొంబాయి సినీమా సంగీతంలో ఆర్కెస్ట్రియేషన్ శిల్పాన్ని రాజేశ్వరరావు అలనాటి రికార్డులలోనే ప్రయోగించి అద్భుతమైన ఫలితం సాధించాడు. ఈ నాటికీ వివిధ వాద్యాలకి స్నేహం కలిపి, అవి ఒకదానినొకటి వెక్కిరించుకోకుండా మేళవించేవారిలో రాజేశ్వరరావుకు విశిష్టస్థానం ఉంది.

ఏ వాద్యానికి, ఏ స్వరానికి ఎక్కడ యతివెయ్యాలో, ఎక్కడ 'ప్రతి' (కౌంటర్) వెయ్యాలో చెప్పగల ఛందస్సు రాజేశ్వరరావు కాంపోజిషన్. పాటకి వాద్యం, వాద్యానికి వాద్యం దేనికి ఎది ఎక్కడ పరమైనచో సంధినిత్యమో, శ్రోతకి సంతోషం

---

వాడిపాత్రగదా అని పూరిగుడిసె కడితే వాళ్ళ కలలు కల్లలయిపోవూ? ఈ సంగతి తెలుసుకోకుండా ప్రజల ఆశలు గ్రహించకుండా ప్రజలు సినిమా సెట్‌లని తిట్టడం బాగులేదు.

ఇవన్నీ ఎలాఉన్నా అసలు ప్రజలు గొర్రెలమంద వంటివారు.

ప్రజాభిప్రాయం అంటే ప్రజ లేమనుకుంటున్నారు అన్నది కాదు; ప్రజలేమనుకుంటున్నారో అన్నవిషయమై ప్రజలేమనుకుంటున్నారో అదే ప్రజాభిప్రాయం. ఇది గ్రహించమని ప్రజలకు హెచ్చరిక.

ఒక సెట్ జన్

## సంగీతదర్శకుడు రాజేశ్వరరావు

తిథ్యమో చెప్పగల వ్యాకరణాలు అవి. వాటికి మధురాతి మధురాలైన దృష్టాంతాలు ఆయనా బాలసరస్వతీ జతగా పాడిన పాటలు "..రసపుష్టి జంత్రగాత్రములరాగ్రదించు విమల గాంధర్వంబు విద్యమాకు" అని ఘోషిస్తాయి ఆ యుగళ గీతగీతాలు.

*　　*　　*

అయినప్పటికీ ఈ రోజున చాలామంది (ఆయన అభిమానులుసహా) రాజేశ్వరరావు చేస్తున్న సినిమా పాటలువిని నిరుత్సాహపడుతున్నారు. కొందరు నిస్పృహతో "ఇతను గొప్పగాయకుడే కాని, గొప్ప మ్యూజిక్ డైరక్టరు కాడేమో" అనుకునే స్థితికివస్తున్నారు. 'మల్లీశ్వరి' "మిస్సమ్మ" వంటి చిత్రాలలో సంగీతం గుర్తుకు వచ్చినపుడు మాత్రం వాలిక్కరచుకొని, "రోజుల మహత్యం" అనుకుంటున్నారు. సినిమా పరిశ్రమలో ఉండే సాధక బాధకాలు తెలిసినవారు ఈ మాటలో ఏకీభవిస్తారు. ఈ నాడు బాక్సాఫీసు సూత్రాలు అందరు కళాకారులను బంధించి వేసినట్లే రాజేశ్వరరావునూ చుట్టుముట్టాయి. ఇతరుల నేసులవలెనే, ఆయననూ బొంబాయి హిట్ రికార్డులను "రీ-రికార్డు" చేయమని బాక్సాఫీస్ సూత్రధారులు శాసిస్తున్నారు.

అయితే బాధ్యతగల కళాకారుడు గట్టిగా తలచుకుంటే ఈ సినీభవ బంధాలను ఇట్టే తెంచుకులేచి నిలవగలడు. రాజేశ్వరరావుకు ఆ శక్తి లేదనలేము కాని ఆసక్తి లేదేమోనని పరిశ్రమ ఎరిగిన వారంటారు. అతనికి సంగీత ప్రపంచం వేరే ఉంది. అందులో హులాసాగా తిరుగుతాడు.

ఒకసారి టాక్సీమీద ఒక మిత్రుడింటికి వస్తానని, టాక్సీ దొరకక ఆటోరిక్షా ఎక్కి గంటసేపు టాక్సీకోసం తిరిగిన మనిషి రాజేశ్వరరావు. అందుకే, అతన్ని అపురూప సంగీత సమ్మోహనాస్త్రంగా ఎరిగిన బి. ఎన్. రెడ్డి, వాసన్ వంటివారు, లాలించి, బుజ్జగించి మంచి పాటలు చేయించారు. ఈనాటి పరిస్థితులు అలాటివి కావు.

*　　*　　*

కవులూ గాయకులూ దుస్థితిలో ఉన్నట్లయితే, ఆ దుస్థితి వారున్న సీమను ఏలే రాజుది తప్ప వారికి అంటదని ఒకమనీషి అన్నాడు....

అంతే అన్నాడుగాని, ఇటు రాజేశ్వరరావూ, అటు ఆయనను బుక్ చేసుకునే దర్శక నిర్మాతలూకూడా ఈ పరిస్థితులను మార్చడానికి ప్రయత్నిస్తే, తెలుగువారంతా ఆనందంతో ఉప్పొంగిపోతారు.





నవశక్తిఫిలింస్‌వారి 'మాయింటి మహాలక్ష్మి'లో
గుమ్మడి, జమున, హరనాథ్.

## నాగేశ్వరరావు పేరిట కళాశాలకు నామకరణం

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు పేరిట గుడివాడ కళాశాలకు ఫిబ్రవరి 26న నామకరణం చేశారు.

"ఈ కళాశాల నిర్మాణానికి ఎందరెందరో విరాళాలిచ్చారు. దీనికి నా పేరు పెట్టడం నా అదృష్టంగా భావించి ఆనందిస్తున్నాను" అని ఆరోజు ఉత్సవంలో తన తరపునా, తన అభిమానుల సంఘం తరపునా లక్ష రూపాయల విరాళాన్ని కళాశాల పాలకవర్గం అధ్యక్షుడు శ్రీ పర్వతనేని వెంకటరత్నంగారికి సమర్పిస్తూ నాగేశ్వరరావు అన్నారు.

ఐదు వేలమంది హాజరైన సభలో హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. సభకు, కేంద్ర ప్రభుత్వరక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య అధ్యక్షత వహించారు. ఆరోజునే కళాశాలలో నూతనభవన నిర్మాణానికి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డా॥ వి. ఎస్. కృష్ణా శంకుస్థాపన జరిపారు. శ్రీయుతులు రఘురామయ్య, డా॥ కృష్ణా, మేకా రంగయ్యప్పారావు మొదలగు వక్తలంతా శ్రీ నాగేశ్వరరావు ఔదార్యాన్ని ప్రశంసించి ఆయనను అభినందించారు. కేంద్ర మంత్రులు డా॥ పంజాబ్ రావ్ దేశముఖ్, శ్రీ కె. సి. రెడ్డి, చలనచిత్ర పరిశ్రమనుండి శ్రీయుతులు ఎన్. టి. రామారావు, రేలంగి వెంకటరామయ్య, బి. ఎన్. రెడ్డి, ఎ. ఆదినారాయణరావు. శివాజీ గణేశన్, జెమినీ గణేశన్, శ్రీమతి సావిత్రి, పూర్ణా, నమేరియా, వాహినీసంస్థలూ, ఏలూరు సి. ఆర్. రెడ్డి కళాశాల, విజయవాడ ఎస్.ఆర్.ఆర్., సి. వి. ఆర్., కళాశాల, గుంటూరు వైద్య కళాశాలల అధ్యాపకులూ నాగేశ్వరరావును అభినందిస్తూ సందేశాలు పంపారు.

గుడివాడ కళాశాలకు లక్ష రూపాయలు విరాళం ఇచ్చిన వారిపేరు పెట్టాలని లోగడ పాలకవర్గం తీర్మానించింది.

అప్పట్లో నాగేశ్వరరావు 25 వేలు విరాళం ఇవ్వగలమని తెలియచేశారు. ఆపైన నాగ

# వార్తావరణం

సుజనాఫిలింస్ వారి పౌరాణిక చిత్రం 'సతీతులసి' మార్చి 7 న విడుదలకాగలదని తెలుస్తోంది. ఎస్. వరలక్ష్మి, గుమ్మడి వెంకటేశ్వరరావు, కృష్ణకుమారి, మాలతి, సీత, లక్ష్మీదేవి కె.వి.ఎస్. శర్మ, రామశర్మ, పద్మనాభం, కుటుంబరావు, మిక్కిలినేని, పెరుమాళ్ళు, అమర్‌నాథ్, మొదలగువారు ఇందులో పాల్గొన్నారు. మాటలు తాండ్ర సుబ్రహ్మణ్యం, పాటలు ఆరుద్ర. తాండ్ర సుబ్రహ్మణ్యం వ్రాశారు. సంగీతం పామర్తి నృత్యాలు వేణుగోపాల్. దర్శకుడు ఎ. మధుసూదనరావు.

* * *

నేషనల్ పిక్చర్స్ వారి 'అంతా పెద్దలే' త్వరలో విడుదల కాబోతుంది శివాజీగణేశన్ లలిత, తంగవేలు, ఎం.ఎన్. రాజం వీరప్ప నటించారు. రచయిత బైరాగి. సంగీతం సుబ్రహ్మణ్యం రాజా. దర్శకుడు టి. ఆర్. రఘునాథ్.

* * *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'ఇల్లరికం' నిర్మాణం పూర్తిఅయింది తాతినేని ప్రకాశరావు దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో నాగేశ్వరరావు జమున ముఖ్య పాత్రలు నిర్వహించారు. రచయిత ఆరుద్ర సంగీత దర్శకుడు చలపతిరావు.

ఎస్. సి. ఫిలింస్ వారి సంగీత నృత్య ప్రధాన ప్రేమాయణాలలో ఇటీవల పైకివచ్చిన అమిత తొలిసారి భరత్ భూషణ్ కు నాయికగా నటిస్తోంది. అచలా సచ్‌దేవ్, జీవన్, ముజ్నా మొదలగువారు పాల్గొంటున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు రమేష్ తివారి. సంగీతదర్శకుడు హన్స్‌రాజ్ బెహల్.

మీనాకుమారి భర్త అమ్రోహీ, "దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయ్" అనేచిత్రం నిర్మిస్తున్నారు. స్క్రీన్ ప్లే ఆయనే వ్రాశారు. ఇందులో మీనాకుమారి, రాజ్ కుమార్ (మదరిండియా) నాయికానాయకులు. నదిరా, హెలెన్, ప్రతిమాదేవి, పమ్మి బేబీనాజ్, తున్‌తున్, ఓంప్రకాశ్ జగదీష్ కన్వాల్ ఇతర నటులు. దర్శకత్వం కిశోర్ సాహు. సంగీతం శంకర్, జైకిషన్‌లు.

దర్శక నిర్మాత శక్తిసమంత కొత్త చిత్రం "ఇన్‌సాన్ జాగ్ ఉఠా"లో ముఖ్య నటులు మధుబాల, సునీల్ దత్. సంగీతం సచిన్ దేవ్ బర్మన్.

బల్‌రాజ్ సాహ్నీ, మీనూముంతాజ్, జానీవాకర్, నిలోఫర్, పమ్మి పాల్గొన్న 'బ్లాక్ క్యాట్' గతవారం ఉత్తరాదిన విడుదల అయింది. అపరాధ పరిశోధన కథావస్తువు. దర్శకుడు ఎన్. ఎస్. అన్సారీ ఇందులో ఒక ప్రముఖపాత్రకూడా నిర్వహించారు.

ప్రదీప్‌కుమార్ స్వంతచిత్రం "ఏక్ షోలా" గతవారం బొంబాయిలో విడుదల అయింది మాలాసిన్హా, ప్రదీప్ కుమార్, శుభాఖోటే, ధుమల్, బేబీనాజ్, హనీ ఇరానీ మొదలగువారు నటించారు.

సంగీతం మదన్ మోహన్ సమకూర్చారు.



సుజనాఫిలిమ్స్‌వారి 'సతీతులసి' లో కుటుంబరావు, కృష్ణకుమారి.

శ్వరరావు అభిమానులు కొందరు ఒక సంఘంగా ఏర్పడి మిగతా 75 వేలూ పూర్తి చేసి, లక్ష రూ.లు నాగేశ్వరరావు పేరిట అందచేయ సంకల్పించినట్లు పాలకవర్గానికి తెలియచేశారు. వారు అందుకు అంగీకరించగా మొన్న సభలో నాగేశ్వరరావు ఈ మొత్తాన్ని సమర్పించారు.

1957 లో ఆంధ్ర విశ్వ విద్యాలయానికి 25 వేలు ఇచ్చిన నాగేశ్వరరావు, అక్కడితో ఆగక ఈ యేడాది ఈ కళాశాలకు విరాళం ఇవ్వడం, ఇంక మద్రాసు విశ్వవిద్యాలయానికి, విజయవాడలో రంగస్థల నిర్మాణానికి విరాళాలు ఇవ్వదలచినట్లు ప్రకటించి ఉండడం గొప్ప విషయం. సినిమా పరిశ్రమకే ఇది గర్వ కారణం...

* * *

గుడివాడ సభ తరువాత, భూషణగొల్లం, అకివీడు గ్రామాలలో నాగేశ్వరరావుకు సన్మానాలు జరిగాయి. పరిసర గ్రామాల నుండి వేలాది ప్రజలు వచ్చి ఆయనను అభినందించారు.

విజయవాడలో నవయుగ ఫిలింస్ వారు నాగేశ్వరరావు గౌరవార్థం విందుచేశారు.

★

# కొత్త ముఖాలు

(55-వ పేజీ తరువాయి)

(ఉండితీరాలని లేదని ధైర్యం చెప్పారు) ఉండడం వగైరా వరత్తులు పెట్టారు.

అన్నిటికన్న ముఖ్యమైనది : నేటి మేటి నటులకు పోలికలు మాత్రం ఉండకూడదు అన్నది!

*　　*　　*

"నాది అచ్చు దిలీప్‌మార్ కు జుట్టు!ఒట్టు" అనో, "నీది ప్రొఫైల్ లో దేవానంద్ పోలికలున్నట్టు అనుమానంగా ఉంది సుమ్మీ" అనో, "నేను వైజయంతిలా డాన్సు చేయగలను" అనో, "ఎడిటర్జీ నేను అశోక్ కుమార్ లా ఉంటానని నేనూ, నాగేశ్వరరావులా ఉంటావని నా మిత్రుడూ వాదించుకుంటున్నాము.



'జయవిజయ' చిత్రంలో ఆచార్య.

నేను మద్రాసు/బొంబాయి వస్తే ఛాన్సు లుంటాయ్యా" అనో పోలికలు చెప్పుకుని, అవే అర్హతలనుకుని సినిమాలో చేరబోయే వారికి ఇది వార్నింగు కావచ్చు. దీంతో పాటు నేటి మేటి నటులమీద విమర్శకూడా వినిపిస్తోంది అని కొందరు గిట్టనివాళ్ళు-కు-శంక. అంటే, ఇప్పుడు చెలామణీలో ఉన్న నటీ నటుల ముఖాలు బాగులేవని గాని, భావాలు బట్వాడా చేసేందుకు వాటిలో సదుపాయాలు లేవని గాని, విసుగెత్తిస్తున్నాయని గాని అనలేము. ఎందుకంటే, వారిలో చాల మంది తమ ఉన్నత స్థాయికి అర్హత ఉన్నదని రుజువు చేసుకొన్నారు "ఫేస్ వాల్యూ" ఎక్కువే అని వేరే చెప్పనక్కరలేదు.

అయితే ఈ విమర్శకుల భావం ఏమిటి అంటే, ఈపాత ముఖాలలోనే కొత్తదనం కనిపిస్తే బావుంటుంది అని.

మనహీరోలు హెయిర్ స్టయిల్ (అనగా క్రాపింగులు) గనక మారిస్తే, హోమింగ్ అనబడే 'డటో' నటన మారుతుందనీ, జుట్టువల్ల తప్పనిసరిగా పెట్టవలసివచ్చే స్టాక్ పోజులు మారుతాయనీ, ఇవి గనక మారితే మల్లీగా ఫోటోగ్రఫీ, ప్రేమఘట్టాలూ, చందమామా పాటల్సు, ఆపైన కథా కమామిషూ, అసలు మొత్తం చలనచిత్ర స్వరూప స్వభావాలే మారి కొత్త మార్గంలో ముందుకు సాగగలవనీ ఈ వర్గం అభివాదం.

ఈ పరిస్థితికి ఎవరు ఎంతవరకు బాధ్యులు, ఏది ఎంతవరకు కారణం.?

ఏది అయినా, మిగతా బాక్సాఫీస్ సూత్రాల పేరిట "డాన్సు లేకపోతే జనం రారు నీకు తెలీదు పో" అన్నట్టుగా, దీనికి కారణాన్ని కూడా ప్రజల నెత్తిన రుద్దడం మటుకు సరికాదు. ఫాషన్లకు నరనడి దిద్దగల సినీతారల అలంకరణలో జనం దేన్ని అనుకరించినా మానినా, రింగుల క్రాపింగుల మీద మాత్రం మోజుతో విరగబడి అనుకరించడం లేదు. అందువల్ల, మూడు కారణాలు ఉండవచ్చు. ఒకటి : ఎవరూ దాన్ని గురించి పట్టించుకోక మామూలుగానే పని సాగించడం.

రెండు : పెద్దనటులకు చెబితే బాగుండదనో, చెప్పినా వినరనో దర్శక నిర్మాతలు అనుకోవడం.

మూడు : ఈ పెద్దనటులు నవరణ ప్రతిపాదనలకు అంగీకరించక పోవడం.

ఈ మూటిలో ఏదో ఒకటి కావచ్చు అనుకోలేము. పరిశ్రమ స్థితిగతులు చూస్తే కేవలం ఈ క్రాపింగు వంటి వాటిని విషయాలోనే కాక, అన్నిటా ఈ మూడు లక్షణా ధగధగ మెరిసిపోతున్నాయని పరిశ్రమలో ఉన్నవారే అంటున్నారు.

పని మనిషి వేషం వేసిన ఒక పెద్దనటి షిఫాన్‌చీరకట్టి మరీ అంట్లు తోముతానని పట్టుబట్టిందిట. చీర చిరిగినట్లు చూపాలంటే, దానిమీద ఇంకో సైలాన్ ముక్కతో మాసికలు వేసితీరాలిట. పోస్టుమాన్ పాలీసో వెయ్యాల్సిన ఒక పెద్దనటుడు గాబర్డీన్ యూనిఫారం తప్ప తొడగననీ దర్జీదగ్గర ఖాకీ సరుకు ధరించడం పరువు తక్కువనీ ప్రకటించాడట.

కళ పవిత్రమైనదనీ, అరిడ కోసం జీవితాన్ని అంకితంగా ఇస్తామనీ ఫాటోజెనిక్ గా మాట్లాడేవారూ, వాస్తవికతను పోషించి అడుగడుగునా జీవితం ప్రతిబింబింప చేసెయ్యడం తమ లక్ష్యమని ఉద్ఘాటించేవారూ ఇలాంటి అద్భుతాలు చేస్తుంటే, పైన చెప్పిన జగదల్ప్రతాపన్ జుట్టు గురించి అంతగా పట్టించుకోవడం, ఈ వాక్యకారుడు ఇన్ని అక్షరాలు వ్రాయడం అద్భుతం అనిపించుకోదు.

నిజానికి క్రాపింగులకధ హాస్యాస్పదమైన చిన్న సమస్యగా సరదాగా తేలికగా కబుర్లు చెప్పుకోడానికి సరిపోయే సంగతిగా కనిపించినా నేటి చలనచిత్ర పరిశ్రమకు సంబంధించిన అన్ని శాఖలలోనూ ఉన్న పెద్ద సమస్య లన్నిటికీ ఇది చిహ్నం.

ఇలాటి చిన్న చిన్న లోపాలు సర్దుకోవడంతో ఆరంభించిన చిత్ర పరిశ్రమ కొన్నాళ్ళకి మరింత మెరుగు తేలగలదని పలువురు చిత్రాభిమానుల ఆశ. 

## సత్యజిత్‌రాయ్ - భారతం

పథేర్ పాంచాలి, అపరాజిత చిత్రాల దర్శక నిర్మాత సత్యజిత్ రాయ్ మహాభారతాన్ని వర్ణచిత్రంగా నిర్మించ సంకల్పించాడు.

పౌరాణిక చిత్రాలుమాని చూసి, ఆశ వదలుకొన్న పలువురికి, రాయ్‌వంటి వ్యక్తి భారతంవంటి వస్తువును చేపట్టాడని విన్నప్పుడు, కొత్తఆశలు కలిగాయి. వస్తు గౌరవాన్ని మన్నించి, దక్షతతో వ్యవహరించగల మనిషి ఒకడు ఈ పనికి పూనుకొన్నాడని ఆనందం, ఇందులో పెగ్గుకు రావాలన్న ఆ కాంక్ష కలిగాయి.

రాయ్ ఇందులో కురుక్షేత్ర ఘట్టాన్ని ప్రధాన వృత్తంగా తీసుకోగలడని, రచన త్వరలోనే ఆరంభం కాగలదనీ తెలిసింది. ఈ చిత్రాన్ని ఆయన స్వయంగా నిర్మిస్తాడట. నిర్మాణం బహుశా మద్రాసులో జరుగవచ్చునట.

## బిమల్ - రామాయణం

తెరమీదకెక్క ప్రయత్నంలో రచన ఘట్టంలోఉన్న మరో మహాకావ్యం 'రామాయణం' బిమల్ రాయ్ ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

### చెల్లని మోసం

"కాళ్లులేని కబోదిని బాబయ్యా! కాండబ్బు దర్మం చెయ్యండి."

"కాళ్లుపోయినా ఫరవాలేదులే. కళ్లులేకపోతే మరీకష్టం. ఇందు తీసుకో కాసీ."

"నిజమేనండి. నేను గుడ్డోణ్ణిగా వుండేరోజుల్లో అంతా చెల్లని డబ్బులేసేవోరండి."

## శివరాత్రి మహాపర్వం

(26 వ పేజీ తరువాయి)

ను కేరి బ్రహ్మతో తన అసమర్థతను వెల్లడించెను. బ్రహ్మ అట్లు నిజమును ఒప్పుకొనక గమురొక్క శిరోభాగమును జూచివచ్చితిననియు బొంకి నిజమని మొగలి పువ్వుతో సాక్ష్యమిప్పించెను. ఇదంతయును కనిపెట్టుచునే ఉన్న పరమశివుడు ప్రత్యక్షమై కోపగించి బ్రహ్మకు పూజ లేకుండునట్లును, మొగలిపూవు తన పూజకు పనికిరాకుండునట్లును శపించెను. అందుచేతనే అన్ని దైవములకు ఆలయము లున్నవిగాని బ్రహ్మదేవునకు మాత్రము ఆలయము లేదు. పూజయు లేదు. అప్పటినుండి శివపూజకు మొగలిపూవు మాత్రము పనికిరాకుండపోయెను.

ఏది ఏమైనను శివరాత్రి మహాపర్వదినములలో అగ్రస్థానమే ఆక్రమించుచున్నది. వేనోళ్ళ పురాణము లన్నియు శివరాత్రి మహాత్మ్యమును కొనియాడుచున్నవి.

పూర్వము సుకుమారుడను బ్రాహ్మణుండు మహా పాపంబులుచేసి కడకు మహాశివరాత్రి నాట వ్రతాలోకనంబున సర్వపాపవిముక్తుడై శివపురంబున కరిగెనని పుణ్యగాథ కలదు.

కాబట్టి హిందువు లున్నంతవరకు అనాదిసిద్ధమైన ఆర్య సాంప్రదాయములు హిందువుల రక్తనాళముల ప్రవహించు వరకు శివరాత్రి ముఖ్యమైన పర్వదినముగా నిలిచియే యుండును. ఎంతమంది నాస్తికులును, ఎన్ని నాస్తికమత ప్రభావములును చెలరేగినను ఇట్టి పర్వదినములను కదలింపజాలవు.

పాశ్చాత్య నాగరికతా సాంప్రదాయంలో మునకలిడుచు దారితెన్ను కానలేక చీకాకు పడుచున్న అసహాయుల కెప్పటికైనను ఈ పర్వదినములే చుక్కానులై ప్రాచీన సాంప్రదాయముల వంకకు మళ్ళించి హిందూమతము యొక్క గౌరవమును యినుమడింప జేయగలవనుటలో అతిశయోక్తి యేమున్నది. ★

 

# నదీతీరం



(23-వ పేజీ తరువాయి)

రెండవ కొడుకుకు రంగనాయకుల కుమార్తెను చేసుకోవాలనే ఉద్దేశంతో, పిల్లదానిని చూసుకుందికి జగన్నాయకులు మెట్టూరు వచ్చాడు. మెట్టూరులో అతడు మూడు రోజు లాగిపోవలసి వచ్చింది.

విశాల హృదయులకు స్వార్థపూరిత కుతంత్రాలతో నిండిన మనస్తత్వాలు వెంటవెంటనే బోధపడవు. జగన్నాయకులున్న స్వల్పకాలంలో మెట్టూరుగ్రామ వాతావరణం పరిశీలనగా చూడలేదు. ఊరుమాత్రం వాటుకుమాలలూ తిరిగి చూశాడు. అతడికి బ్రాహ్మణవీధి రేవు అగాధంగా, రాతిపలకలతో నిండి భయంకరంగా కనబడ్డది. శూద్రవీధి రేవు ఏయేటి కాయేడు కోసుకుపోతూ, దరిదాపు నిరుపయోగమే అయిపోయింది. గ్రామస్థులు పావంచాలు వేయించకుండా ఈ రెండు రేవులనూ ఎందుకిలా ఉంచివేశారా అని అతడి కాశ్చర్యం వేసింది. ధర్మకార్యం, ఈ రెండు రేవులకూ రాతికట్టుతో పావంచాలు కట్టిస్తే బాగుంటుందని అతడికి తోచింది.

* * *

జగన్నాయకులు కొందరు రైతులవెంట తీసుకొని బ్రాహ్మణవీధిలోకి వచ్చాడు. మొట్టమొదటి యిల్లు విశాలమైంది ముందు వరండా గచ్చుది వెడల్పుగానూ వుంది. తన అనుచరులతో జగన్నాయకులు వరండాలో కూర్చున్నాడు. మనుష్యుల అలికిడి విని ఇంటిలోపలినుంచి లక్ష్మయ్యబాబు వచ్చి అందరినీ కుశలప్రశ్నలు వేస్తూనే, వరండాలో పెద్ద జంబుఖానా పరిపించి వచ్చినవారి నందరినీ కూర్చోబెట్టాడు. ఆయేడు పడే వర్షాలతో సంభావన ప్రారంభమై ధాన్యం ధరవరలు, పిస్తుచదావుల మీదుగా నడిచి చివరికి ఏటేటా పెద్దేరు వరదలవల్ల భూములకు కలుగుతున్న నష్టం మీద చాలాసేపు నిల్చింది. జగన్నాయకులన్నాడు:

"లక్ష్మయ్యబాబూ, ఏటేటా వరదలొస్తున్నాయి, నిజమే. ఇందులో మనం స్వతంత్రించి ఏం చెయ్యగలం? ఎవళ్ళో కొందరు, లేకపోతే ఓ గ్రామంవాళ్ళు చెయ్యగలిగిన పనా ఇది? మన కష్టాలన్నీ చెపుతూ గవర్నమెంటువాళ్ళకు మహజర్లు పెడుతుంటే వాళ్ళు కలెక్టర్ని తాసిల్దార్ని పంపించి తణిఖీ చేయిస్తారు ఇలాంటి మోటు పనుల సంగతటుంచి, మన గ్రామస్థులమే స్వతంత్రంగా చేసుకోగలిగిన పనులు మనమెందుకు చేసుకోకూడదు?"

లక్ష్మయ్యబాబు తలతాటిస్తూ చిరునవ్వు నవ్వాడు. మెట్టూరుగ్రామానిక ముకుటంలేని రాజని లక్ష్మయ్యబాబునే చెప్పాలి. ఇందుకనేక కారణాలున్నాయి. భూఖామందులందరికంటె లక్ష్మయ్యబాబుకే హెచ్చు భూము లున్నాయి. హెచ్చు ధాన్యం వస్తాయి. ఇద్దరు తమ్ముళ్ళున్నారు, పెద్ద ఉద్యోగాలలోనే. అతడింగ్లీషు బాగా చదవగలడు, వ్రాయగలడు, మాట్లాడగలడు. తండ్రివెంట బాల్యంనుంచీ తిరుగుతూ కోర్టు పద్ధతులూ, రెవిన్యూ రూల్సూ క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నాడు. అతడికి నాలుగైదు జిల్లాలలో పెద్దహోదా, పలుకుబడీ గల బంధువు లున్నారు. ఇవన్నీ ఉంచి, నిజంగానో భేషజానికో లక్ష్మయ్యబాబు గొప్ప కళాపోషకుడనీ దైవకార్యాసక్తి పరుడనీ పేరు తెచ్చుకున్నాడు. సంవత్సరములో వచ్చే నవరాత్రిపూజలన్నీ తనయింట జరిపిస్తాడు. నవరాత్రులలో హరికథలూ, బుర్రకథలూ, గానకచేరీలూ, వీధినాటకాలూ, భాగోతాలూ, గొల్లకలాపాలూ, భరతనాట్య మేళాలూ, ప్రతిరోజూ ఒకటో రెండో తప్పనిసరిగా వుంటవి తొమ్మిది రోజులూ సన్నాయిమేళం ఉంటుంది. ప్రతిరోజూ గ్రామసంతర్పణ తప్పనిసరి. ఆఖరిరోజున చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళందరికీ ఆహ్వానాలువెళ్లి, వేలకొద్దీ సమస్త జాతులవారికీ భూరిసంతర్పణ ఏర్పాటౌతుంది ఆ ఒక్కరోజే దేవుడికి కట్నాలక్రింద అసమం ముప్పై వేల రూపాయలకు తక్కువ లేకుండా వస్తాయని ప్రతీతి. ఈ తొమ్మిది రోజులూ గ్రామం కోలాహలంగా పెళ్ళి వేడుకలో వున్నట్లే కనబడుతుంది. ఇందులో చిత్రమేమంటే లక్ష్మయ్యబాబు ప్రతిఏడూ కళాకారులకు వార్షికాలంటూ ఎంత స్వల్పమొత్తం ముట్టజెప్పినా వాళ్ళు మారుమాటాడలేక వెళ్ళిపోతారు. ఇవన్నీ కాక వీటివాళ్ళూ గారడీవాళ్ళూ, పాములవాళ్ళూ, కోతుల భాగోతాలూ, ఎలుగుబంటి ఆటలూ చుట్టుప్రక్కల గ్రామాల్లోకి వచ్చినప్పుడు మెట్టూరువచ్చి లక్ష్మయ్యబాబు దర్శనం చేసితీరుతారు చుట్టుప్రక్కల గ్రామాలకు ఏ గవర్నమెంటు ఆఫీసరు వచ్చినా బస మాత్రం మెట్టూరులో లక్ష్మయ్యబాబుగారింట్లోనే. ఇక్కడైతే ఆఫీసర్లు స్నానపాన భోజన శయనాదులకు మంచి సదుపాయంగా ఉంటుంది. ఆఫీసర్లకూ ఇతర ఆగంతకులకూ లక్ష్మయ్యబాబు విగ్రహపుష్టీ, గంభీర ముఖమూ, గాంభీర్యమూ రజసమూ ఉట్టిపడే మాటలూ అతడిమీద ఒకవిధమైన గౌరవం పుట్టిస్తాయి. అందరిదగ్గిరా యింత పలుకుబడిగా మెసులుకువస్తున్న లక్ష్మయ్యబాబు స్వగ్రామంలో మాత్రం కఠినుడూ స్వార్థపరుడూ అన్న అపనింద తప్పలేదు. ఇందుకు కారణాలూ లేకపోలేదు. అతడు తన భూములన్నీ స్వంత వ్యవసాయంలోకి తీసుకురావడానికి వీలుగా కొందరినిభూముల నుంచి తప్పించాడు. దీనిమీద చెలరేగిన దావాలలో మూడుకోర్టులలోనూ తనపక్షమే తీర్పు వచ్చింది. మరి నష్టపడిన కుటుంబాలకు ఇతడిమీద అభిమాన మెలా వుంటుంది? భూఖామందన్నవాడికి గ్రామంలో కొన్ని లోటుపాట్లుండడం సహజం. లక్ష్మయ్యబాబుగారింట బసచేస్తున్న ఆఫీసర్లు అతడి దగ్గిర ఉపాయంగా యీ భోగట్టా అంతా సంగ్రహించి వెళ్ళిపోతారు. ఒక్కొక్కప్పుడివి చిక్కులకు దారితీస్తాయిగదా! అందుకే ఇతడంటే తోటిభూఖామందులకు కోపమూ అయిష్టమూ. గ్రామంలో ఏ రయితూ, భూఖామందూ అతడింటికి తరచుగా వెళ్ళడు, వెళ్ళినా సావకాశంగా కూర్చొని మాట్లాడడు, తోవలో కనిపిస్తే మాత్రం ఓ నమస్కారంచేసి తప్పుకోవడమే పరిపాటి.

* * *

"అయ్యో, ఆ మాట నువ్వనాలా జగన్నాయకులూ!" అన్నాడు లక్ష్మయ్యబాబు.

"మాటవాసికి, ఈ వీధి రోడ్డుంది చూడండీ—" అంటూ ప్రారంభించాడు జగన్నాయకులు.

"అదా మీరంటున్నది? వీధుల మరమ్మత్తు పని ఎవళ్ళదయ్యా? అది గవర్నమెంటు వారిది. ఆ పేరూ ఈ పేరూ చెప్పి సర్కారువాళ్లు వేలకువేలూ మనదగ్గిర గుంజుకుంటున్నారు. ఏమంటావ్?"

"ఎప్పుడో సర్కారువాళ్లు చేయిస్తారని మనం నిత్యం అవస్థపడి చూస్తూ ఊరుకోవడమేనా? ఏ పాటి డబ్బు ఖర్చవుతుంది గనక?"

"ఖర్చు కేవడేడికాదయ్యా! ఇలా వాళ్ళ పనులు మనం చేసేసుకుంటూ ఉంటే, రేపాదున్న పెద్ద పనుల దగ్గిరికి వచ్చేసరికి వాళ్ళు కాళ్ళు తేలవెయ్యరటయ్యా?"

"ఏ కారణంచేతో సర్కారువాళ్లు చెయ్యలేదనుకోండి. నా కళ్ళతో చూస్తు

న్నది చెపుతున్నాను—అంతవరకూ ఆడవాళ్లూ పిలలూ బురదలోనూ గోతుల్లోనూ పడిపోతూ అవస్థపడవలసిందేనా?"

లక్ష్మయ్యబాబు నిరసన సూచకంగా చెయ్యూపాడు.

"ఏమిటి నువ్వంటున్నది జగన్నాయకులూ? ఈ రోడ్డు నా ఒక్కడిదే అనుకున్నావా? ఈ వీధిలో ఉన్న చిల్లర బాపతులను విడిచిపెడితే నేనుకాక మరి యిద్దరు మోతుబరులున్నారు. నేనే ఎందుకు పూనుకోవాలి? వాళ్లకు మాత్రం అవసరం లేదా ఈ రోడ్డు?"

"మీరలాంటి దృక్పథం పెట్టుకుంటే ఏం పనౌతుంది లక్ష్మయ్యబాబూ? ఎవరు చేస్తేనేం, ఇది నలుగురికీ పనికివచ్చే ధర్మం పని."

"జగన్నాయకులూ, నీకు తెలిసిన ధర్మసూత్రాలు నాకూ తెలియకపోలేదయ్యా. ఈ గ్రామం రాజకీయాలు నీకు తెలియవు. మీ వూరు వాతావరణమే నీ మనసులో ఉంది. మీ వూళ్ళో నువ్వొక్కడివే మోతుబరివి. నువ్వేం చేసినా మీ గ్రామస్థులు శిరసావహిస్తారు. మా గ్రామంలో ఇలాంటి పనులెవరైనా ఒకడు తలపెడితే తక్కినవాళ్లు 'వీడికి మహాచాతిస్సైనట్టూ, మనం గాజులు తొడిగించుకొని కూచున్నట్టూ' అంటూ నిరసన చెయ్యడం మొదలెడతారు. మీదు మిక్కిలి వాడిమీద కక్షకట్టి వాణ్ణి నానా చిక్కులలోకీ ఈడుస్తారు."

జగన్నాయకులకు ఏమి చెప్పడానికీ తోచలేదు. అలా వింటూ కూచున్నాడు. లక్ష్మయ్యబాబు తిరిగి ప్రారంభించాడు:

"పోనీ, మా వీధిమాట అలా వుంచు. మీ రంగనాయకులున్న వీధి మాటేమిటి? అది మా వీధికన్నా ఘోరంగావుందే! ఏం రంగనాయకులూ, మాట్లాడవు?"

రంగనాయకులన్నాడు. "లక్ష్మయ్యబాబూ, మీరు స్థితిపరులేకాదు, హెచ్చు కులం వాళ్లు కూడాను. మీరే మీ రోడ్డు బాగు చేయించుకోలేదు. మా వాళ్లమాట అడగడం దేనికి?"

"అలాగనకు. జగన్నాయకులు లేవదీసిన ధర్మ సూత్రం మీకూ వర్తిస్తుంది. నువ్వొక్కడివే పట్టుపడితే మీ వీధి మరమ్మత్తు చేయించేగలవు!"

"అంత సులువుకాదండోయ్! మా వీధిలో వాళ్లు బొత్తిగా మూర్ఖులు. కొందరి గోడ్లశాలలు రోడ్డు మీదికే ఉన్నాయి. అవి తీయించాలంటే మాటలా?"

"విన్నావుటయ్యా జగన్నాయకులూ?" నవ్వుతూ అడిగాడు లక్ష్మయ్యబాబు. "ఈ వూరు సంగతే ఇంత."

ఇదంతా వింటూఉంటే జగన్నాయకులకు దిగ్భ్రమ గలిగినట్టైంది. ఆ విషయం వదిలేసి మరో విషయం ఎత్తుకున్నాడు: "పోనీ, అదలా ఉంచండి. ఈ గ్రామమంతటికీ ఉన్నవి రెండే రేవులు. మీ రేవు రాతి పలకలతో నిండి చాలా ప్రమాద స్థితిలో ఉంది. ప్రజలందరూ గగ్గోలు పెడుతున్నారు. ఇంక ఆ వీధిలో రేవు అసలే అధ్వానంగా ఉంది. ఈ రెండు రేవులకూ సోపానాలు కట్టిద్దామని నాకు సంకల్పం కలిగింది. మీరు గ్రామ పెద్దలుగదా అని మీతో మనవి చేస్తున్నాను. ఏమంటారు?"

లక్ష్మయ్యబాబు పెద్ద నవ్వు నవ్వాడు. "జగన్నాయకులూ, బాగుందోయ్ వరస! ఏం, మా వూళ్ళో మా వీధి రేవు మేం బాగు చేసుకోలేమనా నువ్వు ముందుకు వచ్చావు??"

"అయ్యయ్యో! నేనా ఉద్దేశంతో అనలేదు సుమండీ! ఏదో నలుగురికీ పనికివచ్చే మంచి పని కదా అని—"

"అంటే అన్నావుగాని, మరావూ పెత్తను. మన స్నేహంచూసి ఊరుకున్నాను. మా వూళ్లో మేమంత గాజులు తొడిగించుకోలేదు. క్షణంలో అయిపోయే పని ఇది. నువ్వేమో పొన్నూరునుంచివచ్చి మా వూళ్లో ధర్మకార్యాలు చేస్తానంటున్నావు"

జగన్నాయకులకు తామసం పుట్టింది. అతడు చివాలున లేచి అనుచరులతో సహా రోడ్డుమీదికివచ్చి అన్నాడు: "ప్రజలిబ్బంది పడుతూంటే చూస్తూ ఊరుకోవడం మీ గ్రామంలో రివాజు కాబోలు. ఇక్కడ వందలకొలది గ్రామస్థులు నాతో మొర పెట్టుకుంటూ ఉంటే ఊరుకోలేక నేనీ సోపానాల పనికి వప్పుకున్నాను. నా డబ్బు ఖర్చుపెట్టి పదిమందికి పనికివచ్చే పని చెయ్యాలంటే ఈ గ్రామమే ఉందా? మీ గ్రామం కీర్తి ప్రతిష్ఠలు మీరే బాము కొంగురూ!" జగన్నాయకులు చరచరా నడిచి అనుచరులనుతీసుకొని వెళ్లిపోయాడు.

* * *

కాలి మణుకుమీద దెబ్బ తగిలిన దగ్గర నుంచీ సుందరమ్మకు ఏటినుంచి మడి నీళ్లెలా వస్తాయా అన్న బెంగ పట్టుకుంది. తను మరి యేట్లోకి దిగలేనంటూ రోజూ భర్తతో మొర పెట్టడం మొదలు పెట్టింది. "ఎవరు చెప్పారండీ మనమీ అగచాట్లు పడమని? మీరా, రోజూ కాళ్ళీడ్చుకుంటూ ఆ వూరు కాదని ఈ వూరూ, ఈ వూరు కాదని ఆ వూరూ తిరగడం. నేనా ఏట్లోకి దిగలేక వొళ్లు హూనమై పోవడమూనూ. ఇద్దరు కొడుకులున్నారు. ఒకరి దగ్గర నాల్రోజుల పాటూ మరోవాడి దగ్గర మరో నాల్రోజుల పాటూ ఉంటే మీ ప్రాణానికీ నా ప్రాణానికీ కొంత హాయిగా ఉండదటండీ?"

విస్సయ్య పూర్వకాలం మనిషి. కంఠంలో ప్రాణమున్నంతవరకూ తన వృత్తి ధర్మం వదలకుండా అలాగే కష్టపడతానంటాడు గాని ఇతరులమీద—వాళ్లు కొడుకులైనా—ఆధారపడడమంటే ఇష్టంలేదు. అయితే

## కవి మిత్రులు

ఒక కవి తను రాసినపద్యాల్ని మరో కవిమిత్రుడికి వినిపిస్తున్నాడు. పద్యాలన్నీ చదివిం తర్వాత తలెత్తి చూస్తే కవిమిత్రుడు కుర్చీలో కూర్చున్న పళంగానే గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. కవి అతన్ని లేపి కోపంగా "నీ అభిప్రాయంకోసం పద్యాలు చదివితే నిద్రపోతావేమిటీ?" అన్నాడు.

కవిమిత్రుడు ఆవులిస్తూ "నిద్రమాత్రం అభిప్రాయం కాదా?" అన్నాడు.

* * *

## పరీక్షల అంచుమీద

స్కూలుఫైనలు పరీక్షకు కట్టిన ఒక విద్యార్థి మరొక విద్యార్థితో:—

"ఇవాళ రాత్రి ఏం చేద్దామోయ్ పంతులూ?"

"ఇదిగో ఈ రూపాయి ఎగరేద్దాం. బొమ్మపడితే సినిమాకెళదాం. బొరుసుపడితే నిద్రపోదాం. అంచుమీదనుంచుంటే చదువుదాం. తప్పౌతుందామరి?"

#  నదీతీరం 

తన భార్య మరి చాకిరీ చెయ్యలేనంటూ ఘోష పెడుతూ ఉంటే వినక తప్పలేదు. వర్షకాలం రాకముందే విస్సయ్య తన పౌరోహిత్యపు పనంతా ఒక శిష్యుడి పరంగా అప్పజెప్పి, భార్యతో కలిసి అక్కడికి పాతిక మైళ్ళ దూరంలో ఉన్న తన రెండవకొడుకు దగ్గిరికి వెళ్ళిపోయాడు.

* * *

తొలకరి చినుకులు ప్రారంభించగానే రైతులందరూ పొలం పనులలో పడి, ఆ సందడిలో ప్రతినిత్యమూ పడుతున్న ఈతిబాధలు కొంతకాలంపాటు మరిచిపోయారు. శ్రావణ మాసంలో పెద్ద వర్షాలూ పడ్డాయి, ఏరూ వచ్చింది. దీనితో కూడా దరేవు పూర్తిగా లోతుకుపోయి అసలే పనికిరాకుండా పోయింది. బ్రాహ్మణ రేవులో రాతి పణుకులే స్థితిలో ఉన్నాయో ఎవరికీ తెలియదు. నీళ్లుమాత్రం బాగా అందుబడిలో ఉన్నాయి. ఆ సంవత్సరం వర్షాలధికంగానే ఉన్నాయి. ఏరు రెండు గట్లూ తీసి పారుతున్నది. ఊళ్ళో పడ్డ వర్షపునీరు ఏట్లోకి పోవడానికి వీలులేక పోయింది. ఎక్కడ నీరక్కడే నిలవైపోయి, కత్తెం గోతులలో కుళ్లి ఊరంతా భరించరాని దుర్గంధం వెదజల్లుతున్నది. దోమలబాధ మితి మీరి పోయింది. దీనికితోడు ఏదో రకం విషజ్వరాలు గ్రామాలలో వ్యాపించి చిన్న పిల్లల నేకులు చచ్చిపోయారు. మెట్టూరు గ్రామానికి ఆసుపత్రి అధమం ఎనిమిది మైళ్ళ దూరమేనా ఉంటుంది. అయినా గ్రామంలో ఉన్న ఏడెనిమిది వందల జనానికీ ఆసుపత్రి మందులంటే నమ్మకం లేదు. నమ్మకమున్న మోతుబరులుమాత్రం బళ్లతో బస్తీలకువెళ్ళి డాక్టర్ల చేత చికిత్స చేయించుకుంటున్నారు. ఊళ్ళోవున్న ఒకరిద్దరు సంచీ కట్టు వైద్యులే ఊరంతటికీ శరణాగతి. గ్రామాలలో మంచి ప్రాక్టీసులో ఉన్న ఈ సంచీకట్టు వైద్యంలో ఒక గొప్ప తనముంది. వైద్యులది తరతరాలనుంచీ వస్తున్న అనుభవ వైద్యము. వైద్యులకు తక్షణం డబ్బు చెల్లించనక్కరలేదు. వాళ్ళకు వార్షికాలున్నాయి. మందు ఖర్చు వాడు మాత్రమే. ఎప్పుడు పిలిస్తే అప్పుడు. ఎన్నిసార్లు పిలిస్తే అన్నిసార్లు వచ్చి రోగిని చూస్తారు, ధైర్యం చెప్తారు. అదృష్టం బాగుంటే రోగం కుదురుతుంది. కుదరకపోతే వైద్యులు నిందల పాలు కారు. తమ సహజ వైరాగ్య స్వభావంతో గ్రామస్థులు తమ కర్మను నిందించుకుంటారే గాని వైద్య లోపమని మనస్సులో నైనా అనుకోరు.

* * *

మార్గశిర మాసం వచ్చేసరికి ఏరు బాగా తీసిపోయింది. ఏరు తీసి పోగానే గ్రామంలోని నిలవ నీరు చాలామట్టుకు ఇగిరి పోయింది. ఈ నెలలోనే లక్ష్మయ్య బాబుగారి రెండవ కుమార్తె వివాహం. పెద్ద భూఖామందింటి పెళ్లిగనక ఊరంతా వారం రోజులనుంచీ ఒకటే కోలాహలంగా ఉంది. వీధిలో విశాలమైన పందిరి వేసి సుందరంగా అలంకరించారు. రెండు మూడిళ్ళు ఖాళీ చేయించి విడిది ఏర్పాటు చేశారు. నలుగురు వంటవాళ్ళు సహాయంగా ఇతరులు నలుగురూ ఏర్పాటయ్యారు. పెళ్లివారు వందల సంఖ్యలో ఉన్నప్పుడు నీటి ఖర్చు చాలా ఉంటుంది. ఇందు నిమిత్తం ఇరవై పెద్ద గంగాళాలు తెప్పించి వంట పందిరిలోనూ, విడిది ఇళ్ళలోనూ పెట్టించారు. లక్ష్మయ్య బాబుగారి యిలు ఏటి వొడ్డునే ఉంది. అయినా నీళ్ళుమాత్రం అందుబడిగా లేవు. బండితో నీళ్లు తేవడానికి ఆ గ్రామంలో వీలు లేదు. అందుచేత లక్ష్మయ్య బాబుగారు బస్తీనించి స్పెషలుగా రామయ్య అనే బ్రాహ్మణ యువకుడిని రోజుకు పది రూపాయలిచ్చే యేర్పాటుమీద కుదుర్చుకొని పొద్దస్తమానమూ గంగాళాలన్నీ ఏటి నీటితో నింపేపని అతడికి నిర్ణయించారు.

పైలా పచ్చీసులో ఉన్న రామయ్య మంచి బలాఢ్యుడు. లోగడ ఒకసారి రెండు భుజాలమీదా రెండు కావిళ్లుంచుకొని నీళ్లు తొణకకుండా నాలుగు ఫర్లాంగులు పరుగున వెళ్ళగలిగినందుకు రజితపాత్ర బహుమానం పొందినవాడు. పెళ్లినాడుదయం రామయ్య కావిడి వేసుకొని రాతి పణుకులమీదనించి లేడిలా అవలీలగా ఎక్కుతూ దిగుతూ నాలుగు కావిళ్లనీరు మోసి వేశాడు. ఐదో కావిడి మోస్తూ కిందనుంచి మూడు పణుకులు దాటాడు. నాలుగవ పణుకు మీద అడుగు వేసేసరికి అది కొద్దిగా అటూ ఇటూ ఊగింది. రామయ్య భుజంమీద కావిడి కొద్దిగా వెనకకు జారింది. అది మళ్ళీ సరిచేసుకొనే గాభరాలో రామయ్య అడుగులు తడబడ్డాయి. తక్షణమే అతడి ఎడమ కాలు రాతి పణుకుమీదనుంచి జారిపోయి, కావిడీ, బిందెలతో సహా అతడు క్రింది రాతి పణుకు మీద పడ్డాడు. రాతి పణుకుకు తల బలంగా మోపి వెంటనే చెక్కలైపోయింది. ఒక నీళ్ల బిందె అతడి కడుపుమీద పడి, కడుపు కూడా చితికిపోయింది.

ఆ సమయంలో పెళ్ళి పందిరిలో అట్టహాసంగా బ్యాండు మోగుతున్నది. అప్పుడే స్నాతకం ప్రారంభించారు. పందిట్లో పిన్నా పెద్దా పెళ్లివారు కిటకిటలాడుతున్నారు. లక్ష్మయ్యబాబు క్షీరాబ్ధి ధోవతి కట్టి, పై మీది పట్టువోణీ సర్దుకుంటూ వియ్యంకుడితో ఛలోక్తులాడుతూ విరగబడి నవ్వుతున్నాడు. అదే క్షణంలో నౌకరొకడు పరుగెత్తుకుంటూవచ్చి ఏటి గట్టున రామయ్య బుర్ర పగిలి చచ్చిపోయాడన్న ఘోర విషాదవార్త, అతడి చెవులో వేశాడు. లక్ష్మయ్యబాబు ఉన్నపాటునే మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు. పందిట్లో ఉన్న యావన్మంది ఏటి గట్టుకు పరుగెత్తారు. 

## పరుసవేది

బస్సుకోసం 'క్యూ' లో నుంచున్న ఒక పెద్దమనిషిని కుర్రాడొకడు అడిగాడు: "సార్, మీ పరుసుపోయిందా?"

పెద్దమనిషి జేబులు తడుముకుని "అవునోయ్, పోయింది. నీకేమన్నా దొరికిందా?" అన్నాడు

"దొరకలేదండి. ఇవ్వాళ పరుసు పోగొట్టుకున్నవాళ్ళు మీతో కలిపి పదిహేనుమంది అయ్యారు," అన్నాడు కుర్రాడు.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



'సెంద్రవొంకలో యేమి సిత్రమున్నాదే!'

'వొంకపోగానే మా వోడొస్తడమ్మా!'

—చిత్రం: వీరిశెట్టి అచ్యుతరావు, పుల్లేటికుర్రు

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly